# Great Learning opportunity....
## Training on new generation
# CAD/CAM/CAE Technologies - CATIA V5

## OBJECTIVE:

In this course you will learn state of the art, cutting edge leading technologies in CAD/CAE - CATIA V5. At the end of the course you will be in a great demand to start your career in automotive, Aerospace & other MNCs.

## PARTICIPANT PROFILE:

Engineering / Polytechnic students and professionals with Mechanical, Civil & Electrical backgrounds.

## COURSE CONTENTS:

1. CATIA Basics & Tools
2. Sketcher
3. Part Design basics & advanced (Solid)
4. Shape Design basics & advanced (Surface)
5. Generative & Interactive Drafting
6. Structural Design
7. Sheetmetal Design
8. Knowledgeware
9. FEM & Kinematic Analysis

## SALIENT FEATURES:

- Well-qualified experienced engineers trained by IBM Consultants.
- Visiting faculty from leading Auto & Aerospace Multi national companies.
- Latest workstations with Pentium 4, 256MB RAM, 32MB V RAM, 17" Color Monitor etc.
- Flexi lab timings.
- Exposure to live and practical projects.
- Placement Assistance.

Gama Solutions Inc. is a subsidiary of Guru Information Solutions USA, formed with an aim to provide world class services in CAD/PDM areas to both domestic and international customers.

*: For further details please contact :*

**GAMA SOLUTIONS INC.**

**Plot No – 9, Krishna Priya Apartments, Flat No. 201**
**Hare Krishna Road, TIRUPATHI.**

# బ్రౌన్ లేఖలు

## ఆధునికాంధ్ర సాహిత్య చరిత్ర శకలాలు

(గద్యవ్యాఖ్యతో)

పర్యవేక్షణ

ప్రొఫెసర్ జి. యన్. రెడ్డి

సంశోధన

బంగోరె

శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం

తిరుపతి (ఆంధ్రప్రదేశ్)

1977

S. V. UNIVERSITY, TIRUPATI (A. P.)
Published with grants from U.G.C. & A. P. State Archives
1977 February

*

# BROWN'S LETTERS:
## Glimpses of History of Modern Telugu Literature
[with running commentary]

*

**price: Rs. 12-50**

Chief editor:
PROF. G. N. REDDY
Editor:
BANGOREY

*

Printers:
KRANTI PRESS
12, Francis Joseph St., Madras-600001.

Cover design:
P. C. NARASIMHA REDDY

# విషయసూచిక

# ప్రస్తావన

> To revive the literature of a language was an ardous task for one man and he a foreigner.
>
> —C. P. BROWN

తెలుగుభాషా సాహిత్యాలకు అఖండమైన సేవచేసిన మహనీయుడు ఎవడన్న ప్రశ్నకు సమాధానంగా చాటి చెప్పదగిన వ్యక్తి—మన ఆంధ్రుడు మాత్రం కాదు—ఆంగ్లేయుడైన సి. పి. బ్రౌన్ (1798–1884). విదేశీయుడైన బ్రౌన్‌కు తెలుగుభాష ఒకటి ఉన్నట్లు తెలిసింది తన పంతొమ్మిదో యేట; ఓనమాలు నేర్చుకున్న తర్వాత తెలుగు వాఙ్మయంమీద మనసు పోనిచ్చింది తన ఇరవై ఆరో యేట. అప్పటినుంచి తన జీవితాంతంవరకు—అంటే అరవై సంవత్సరాలపాటు—ఆంధ్ర వాఙ్మయోద్ధరణను ఒక మహాయజ్ఞంలాగా నిర్వహించిన మహాతపస్వి బ్రౌన్.

గత శతాబ్దంలో భారతీయ భాషా సాహిత్యాలను అభిమానించి, అధ్యయనం చేసి–గ్రంథరచన చేసిన పాశ్చాత్య భారతకోవిదుల్లో (western indologists) సుప్రసిద్ధులెందరో ఉన్నారు. ముఖ్యంగా దక్షిణదేశ భాషలకు సంబంధించి సి. పి. బ్రౌన్‌తో పోల్చి చెప్పదగినవారు తమిళానికి జి. యు. పోప్, రెవరెండ్ విన్‌స్లో; కన్నడానికి రెవరెండ్ ఎఫ్. కిటెల్; మలయాళానికి డాక్టర్ హెచ్. గుండర్ట్ మొదలైనవారున్నారు. వీరందరూ మిషనరీలు. ఆయా భాషలు నేర్చి వాటికి నిఘంటు వ్యాకరణాదుల్ని వ్రాయడం వారి వృత్తి ధర్మం. వీరి కృషికి మనం ఈ నాటికీ చేయెత్తి మొక్కుతున్నాం. వీరి నిఘంటువుల్ని పునర్ముద్రించుకుంటున్నాం. అయినా ఆయా భాషలకు వీరు చేసిన సేవ గురిగింజ ప్రమాణంగా ఊహించుకుంటే, బ్రౌన్ తెలుగుకు చేసింది గుమ్మడి పండంత అని చెప్పకతప్పదు.

బ్రౌన్ మిషనరీ కాదు. సివిల్ ఉద్యోగి. ఆనాటి సివిల్ ఉద్యోగుల్లో అనేకులు సుఖలాలసులు, ధనార్జనా నిమగ్నులు. దేశీయులపట్ల, దేశభాషలపట్ల ఉదాసీనులు. కాని బ్రౌన్‌దొర ప్రవృత్తి అటువంటిది కాదు. తన జీవితంలో ప్రతి క్షణాన్నీ, జీవితార్జనలో ప్రతి దమ్మిడీనీ తెలుగుభాషా సాహిత్యాలకు వినియోగించిన కర్మయోగి బ్రౌన్.

ప్రాచీన తెలుగు వాఙ్మయంలో కాలగర్భంలో కలిసిపోయినవి పోగా మనకు లభ్యమైన గ్రంథాలు సగభాగం మాత్రమే. ఆ సగభాగంలో ఇంచుమించు సగంకంటే ఎక్కువ భాగాన్ని సేకరించి, ఉద్ధరించి, భద్రంచేసిన వాఙ్మయోద్ధారకుడు బ్రౌన్.

ఆ రోజుల్లో తన సొంతడబ్బు యాభైవేల రూపాయలవరకు ఖర్చుపెట్టి, కొన్నివేల తెలుగు తాళపత్ర గ్రంథాలను సేకరించిపెట్టి పోయాడు. శతాధికంగా తెలుగు గ్రంథాల్ని పరిష్కరించినాడు. భారత రామాయణాదుల్నీ, వ్యాఖ్యానాలతో మన ప్రబంధాల్నీ ముద్రించినాడు. ముద్రింప జేసినాడు. తాను స్వయంగా నేటికీ ప్రామాణికమైన ఛందోవ్యాకరణ గ్రంథాల్ని, నిఘంటువుల్ని వ్రాసి ప్రకటించడమే గాక; వేమన పద్యాలకు, కొన్ని ప్రబంధ భాగాలకు ఇంగ్లీషు అనువాదాల్నికూడా సంతరించినాడు. బ్రౌన్ కృతులు, ఇతర రచనలు లండన్ ఇండియా ఆఫీస్ లైబ్రరీలో ముద్రితాలు, అముద్రితాలు అన్నీ చేరి 52 సంపుటాల్లో అసూర్యంపశ్యలుగా ఉన్నాయి. బ్రౌన్ చేసిన బైబిల్ సమగ్రానువాదం ఇంకా వ్రాతప్రతి రూపంలోనే లండన్ బైబిల్ సొసైటీలో ఉండిపోయింది.

ఆనాడు తెలుగుదేశంలో వివిధ ప్రాంతాల్లోని పండితులతో, విద్వాంసులతో తాను సాగించిన ఉత్తర ప్రత్యుత్తరాల్ని ఇంకా ఇతర రకాల జాబుల్ని 20 సంపుటాల్లో— ఒక్కొక్క సంపుటంలో సుమారు 400 పుటలు కలవి—భద్రపరచి పోయాడు.

మన సాంఘిక చరిత్రకు సంబంధించిన ఈ బ్రౌన్ సామగ్రి ఇంకా ఎంతో ఉంది. కొన్ని సంస్థలు కొన్నేళ్లపాటు చెయ్యదగినంత సాహిత్యసేవను, బ్రౌన్ ఒక్కడే చేసినంత మరి యే విదేశీయుడు గానీ, ఏ భారతీయ భాషకూ చేయలేదు. ఇది వాస్తవమే కాని అత్యుక్తి కాదు. నిజానికి బ్రౌన్ ఒక వ్యక్తి కాడు, ఒక సంస్థలాంటి వాడు. తన ఇల్లే ఒక సారస్వత సత్రం. ఒక కాలేజి. సొంత డబ్బుతో జీతాలిచ్చి పది పదిహేను మంది పండితుల్ని సదా తన కొలువులో పోషించేవాడు. కాబట్టే

నూరార్లు లెక్క సేయక
పేర్లెక్కిన విబుధవరులఁ బిలిపించుచు వే
మార్లర్థమిచ్చు వితరణి
చార్లెసు ఫీలిప్సు బ్రౌను సాహెబు కరుణన్

అని సమకాలిక పండితులచే కీర్తింపబడినాడు.

అవివాహితుడై అహోరాత్రాలు తన జీవితాన్ని తెలుగుభాషా సాహిత్యాలకు అర్పించిన బ్రౌన్ దొరను ఆంగ్లమిత్రులు కొందరు పిచ్చివాణ్ణిగా జమకట్టి పరిహసించే వారట. బ్రౌనే ఒకచోట ఇలా రాశాడు. "At various times I have been considered (and by myself) as somewhat insane ... Those who have known me intimately have judged me wholly sane."

తెలుగు పిల్లలకు పాఠశాలలుకూడా స్థాపించి నిర్వహించిన విద్యాదాత సి. పి. బ్రౌన్. బిషప్ కాల్డ్వెల్‌కు సంస్కృతభాషా ప్రవేశాన్ని కల్పించినాడు. తాను రచించిన ఆంధ్రగీర్వాణచ్ఛందం, సంస్కృత ఛందస్సు అనే రచనలే గోల్డ్‌స్టకర్‌ను సంస్కృత భాషాధ్యయనానికి ప్రేరేపించాయి. బ్రౌన్ బహుభాషావేత్త. గ్రీకు, లాటిన్, హీబ్రూ, ఫ్రెంచి, పర్షియన్, బెంగాలీ, మరాఠీ, హిందూస్తానీ, అరబిక్ ఇత్యాది భాషల్లోకూడా ప్రావీణ్యాన్ని గడించినాడు.

బహుముఖ ప్రజ్ఞాశాలి అయిన బ్రౌన్ తెలుగుభాషా సాహిత్యాలకు చేసిన సేవను గురించీ, అతడు వదలిపెట్టిపోయిన వాఙ్మయనిధిని గురించీ ఇంతవరకు తెలుగు లోకానికి తెలిసింది గురిగింజ ప్రమాణమే. ముద్రితమై ప్రచారంలో ఉన్న తన ప్రామాణిక నిఘంటువులకు అతడు చేసిపెట్టిన కూర్పులూ, చేర్పులూ రెండింతలు పెరిగి అముద్రితంగానే ఉన్నాయి. అలాగే అతని తెలుగు వ్యాకరణం కూడా పెరిగింది. నేటి సామాజికావసరాలకు ఉపయోగపడే పరిశోధన సామగ్రి బ్రౌన్ సంపుటాల్లో ఎంతో నిక్షిప్తమై ఉంది.

ముఖ్యంగా తెలుగును అధికార భాషగానూ, ప్రయోజనాత్మకంగానూ రూపొందించు కునే ఈనాటి అవసరాలకు బ్రౌన్ కూర్చిన జిల్లా నిఘంటువు, మిశ్రభాషా నిఘంటువులు, సేకరించి పెట్టిపోయిన తదితర భాషాసామగ్రి యెంతో ఉపయోగపడుతుంది. వీటన్నిటినీ వెలుగులోకి తీసుకురావాలనే ప్రయత్నానికి శ్రీ వేంకటేశ్వర విశ్వ విద్యాలయం ఒక పరిశోధన విభాగాన్ని 1975 సెప్టెంబర్‌లో రూపొందించి

దోహదమిచ్చింది. రాష్ట్రప్రభుత్వం, ఆంధ్రప్రదేశ్ ఆర్కైవ్స్‌శాఖ, విశ్వవిద్యాలయ గ్రాంట్ల సంఘం కొంత ధనసహాయంతో చేయూత నిచ్చాయి. ఈ ప్రోత్సాహాన్ని పురస్కరించుకొని 'బ్రౌన్ లేఖలు' అనే ఈ చిన్న సంపుటాన్ని ప్రస్తుతం ప్రచురించడమైంది. మరికొన్ని ప్రచురణలుకూడా త్వరలో రానున్నాయి. ఇవి తెలుగు భాషా చరిత్రకే గాకుండా తెలుగువారి సాంఘిక సాంస్కృతిక చరిత్రల అధ్యయనానికి, ప్రధానంగా బ్రిటీషు యుగానికి సంబంధించిన పరిశోధనలకు కొంత ఆధార సామగ్రి కాగలవు. విశ్వవిద్యాలయాల్లో చరిత్ర, సాంఘిక రాజకీయశాస్త్రాది విభాగాలు, భాషాసాహిత్య విభాగాలు వీటిమధ్య సమష్టి (inter disciplinary) అధ్యయనానికి బ్రౌన్ వాఙ్మయం ఒక సుక్షేత్రం.

బ్రౌన్ లేఖలు అనే ఈ గ్రంథానికి ఆసక్తికరమూ బహువిషయ ప్రధానమూ అయినటువంటి వ్యాఖ్యను కూర్చిన శ్రీ బంగోరె అభినందనీయుడని ప్రత్యేకించి పేర్కొనడం సముచితం.

28—12—'76,
తిరుపతి.

జి. యన్. రెడ్డి,
ఆంధ్రశాఖాధ్యక్షుడు.

# ముందుమాటలు

> బ్రౌన్‌ను గురించి ఎవరుమాత్రం ఈనాడు
> ముందుమాటలు తప్ప ఆఖరు మాటలంటూ
> ఎట్లా చెప్పగలరు? అది దుస్సాధ్యం!

ఎందువల్లనంటారా? ఆ తెలుగు సూర్యుడు, 'కారణజన్ముడూ' అయిన బ్రౌన్ మనకు మిగిల్చిపోయిన అక్షరసామ్రాజ్యం ఎంత విస్తారమైంది! ఎంత విలువైంది! మద్రాసు ఓరియంటల్ మేనుస్క్రిప్ట్స్ లైబ్రరీలో వేలకువేల సంపుటాల వ్రాతప్రతులు ఆయన మనకోసం విడిచిపెట్టిపోయాడు. ఇదంతా కల్సి కొన్ని లక్షల పేజీల వాఙ్మయ సామగ్రి అవుతుంది. ఇక, ఆధునికాంధ్ర చరిత్రలో అత్యంత కీలకమైన మూడు దశాబ్దాల కాలవ్యవధిలో తెలుగుదేశానికి ఒక రెవిన్యూ జుడీషియల్ అధికారిగా పరిపాలనా పరిధిలో ఆయన వ్రాసిపెట్టిపోయిన అలనాటి ఫైళ్ళు నేటికీ గుట్టలు గుట్టలుగా తమిళనాడు ఆర్కైవ్స్ అనే గనిలో పడివున్నాయి. ఓపిగ్గా లోడి పైకి తీస్తున్నకొద్దీ ఇంకా ఇంకా చూడవల్సిన ఫైళ్ళు బోలెడు కనపడ్తున్నాయి. అంతే కాదు. తెలుగు చరిత్రకు, సంస్కృతికి, సారస్వతానికీ సంబంధించి బ్రౌన్ ప్రింట్ చేసిన గ్రంథాలు, వ్యాసాలూ శతాధికంగా కనపడ్తున్నాయి. ఇవిగాక, వేల మైళ్ల అవతల తెలుగుదేశానికి బహుదూరంగా లండన్ వగైరాచోట్ల బ్రౌన్ సారస్వత సామగ్రి ఎంతో భద్రపరచబడి వుంది. బ్రౌన్‌ను గురించిన ఒక సమగ్రమైన అవగాహనను ఏర్పరచుకోవాలంటే, ఆయన చేసిపెట్టిపోయిన పని తాలూకు మంచిచెడ్డల్ని, వెలుగునీడల్ని మనసుకు తెచ్చుకొని అంచనా వేయాలంటే ఈ సంపుటాలు, ఆ ఫైళ్ళు, ఆ సామగ్రినంతా చదివి—కనీసం పైపైగానైనా చదివి—ఒక నిర్ణయానికి రావాలి గదా. ఈ బ్రౌన్ పెన్నిధి ఎన్ని పిహెచ్.డి. లకు సరిపోతుందో, ఎన్నేళ్ళు పడ్తుందో ఎట్లా చెప్పడం?

పది పదిహేనేళ్ళ క్రితం—మద్రాసు ఓరియంటల్ మేనుస్క్రిప్ట్స్ లైబ్రరీలో నుంచి అత్యంత విలువైన ఈ బ్రౌన్ మెకంజీ సేకరణల పెన్నిధిని మినహాయించి, మిగతా

తాళపత్ర ప్రతుల్ని మాత్రమే తిరుపతిలోని శ్రీ వెంకటేశ్వర ఓరియంటల్ ఇన్‌స్టిట్యూట్‌కి తరలించుకొని వచ్చాం. ఒకవిధంగా ఒరిజనల్ సోర్స్ మెటీరియల్‌ను అక్కడే వుంచేసి, సెకండరీ సోర్సెస్‌ను మాత్రం ఇక్కడకు తెచ్చుకొన్నాం. అప్పుడే ఆ బ్రౌన్ పెన్నిధిని - తెలుగు, సంస్కృతాలకు సంబంధించిన పెన్నిధిని- తిరుపతికి తరలించుకొని వుంటే, ఇప్పుడు శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయం ఏర్పాటుచేసిన ఈ బ్రౌన్ రీసర్చి ప్రాజెక్టు పని కొంత సులువై వుండేది. కానీ, అది ఎందువల్లనో జరగలేదు. ఆ తర్వాతైనా అక్కడి ఆ బ్రౌన్ వేలాది సంపుటాలకు జెరాక్స్ లేదా మైక్రో ఫిల్మ్ ప్రతులైనా తీయించి భద్రపరచుకోవాలన్న దృష్టి మనకు లేకపోయింది. అట్లాగే ఆంధ్రప్రదేశ్ స్టేట్ ఆర్కైవ్స్‌లోకి డిస్ట్రిక్ట్స్ రికార్డ్స్ పేర తెలుగు జిల్లాల రికార్డుల గుట్టలు కొన్ని తరలించబడ్డాయి. కానీ, డిస్ట్రిక్ట్స్ పరిధి దాటి స్టేట్ లెవల్లో వర్గీకరింపబడిన ఫైళ్ళు అనేకం, అక్షరాలా అనేకం, ఇంకా మద్రాసు ఆర్కైవ్స్‌లోనే వున్నాయి. ఆ ఫైళ్ళలో తెలుగుదేశపు ఆధునిక చరిత్ర సమాచారం ఎంత నిక్షిప్తమై వుందో ఎట్లా చెప్పడం? ఇక, బ్రౌన్ మద్రాసులో కూర్చొని ఆనాడు ప్రింట్ చేసిన తెలుగు గ్రంథాలు, తదితర గ్రంథాలు, వ్యాసాలు, వ్యాసానికలను సైతం మనం భద్రపరచుకోలేకపోయాం. ఈ ముద్రిత ప్రతులైనా తెలుగుదేశంలోని ఏ లైబ్రరీల్లోనూ లేకుండా చేసుకుని సర్వజాగ్రత్తలూ తీసుకొన్నాం. వీటిల్లో కొన్ని శాశ్వతంగా కనుమరుగై పోయాయా అనిపిస్తున్నది. మరికొన్ని ఏ లండన్, అమెరికా లైబ్రరీల్లో తప్ప ఇక్కడ మరెక్కడా లేవనిపిస్తున్నది.

ఈ నేపథ్యంలో శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయంవారు నెలకొల్పిన సి. పి. బ్రౌన్ రీసర్చి ప్రాజెక్టులో తెలుగుశాఖ అధ్యక్షులు ఆచార్య జి. యన్. రెడ్డిగారి పర్యవేక్షణ క్రింద సీనియర్ రీసర్చి ఆఫీసర్‌గా 1975 సెప్టెంబర్ 10 న చేరాను. ఇది 1977 జనవరి 9 తేది. ఈ ఒక్క సంవత్సరం నాలుగునెల్ల వ్యవధిలో నేను చేయవలసిన దేమిటి? చేయగలిగిందేమిటి? చేసిందేమిటి? చేసినదానికంటే చేయవలసింది ఇంకా బోలెడున్నట్లు కనపడుతున్నది. చేసినదానికి సాక్ష్యంగా ఇదుగో ఈ చిన్న సంపుటాన్ని - చాలా చిన్న సంపుటాన్నే - 'నిస్సిగ్గు'గా మీ ముందుంచుతున్నాను. దీనితోబాటు బ్రౌన్ ఆనాడు తన 29వ ఏట తెలుగు-సంస్కృత ఛందోరీతుల్ని గురించి ఆంగ్లంలో ప్రచురించిన మొట్టమొదటి గ్రంథాన్నికూడా సేకరించి చారిత్రకాది వివరణలతో పునర్ముద్రిస్తున్నాం. త్వరలోనే బ్రౌన్ సాహిత్య జీవితానికి సంబంధించిన స్వీయచరిత్రాత్మక రచనను, తెలుగు భాషకు సంస్కృతికి సంబంధించి బ్రౌన్ ఆంగ్లంలో వ్రాసిన వ్యాసాల సంకలనాన్ని వెలువరించబోతున్నాం. ఉన్న

వనరులను, మెటీరియల్ సేకరణలోగల ఇబ్బందులను దృష్టిలో పెట్టుకొని, పూర్తి స్వేచ్ఛనిచ్చి, జర్నలిజం పరిధిలోనుంచి ఈ అకెడమిక్ పరిశోధనా రంగంలోకి వూడి పడ్డ నాచేత బ్రౌన్ సాహిత్య వ్యవసాయం చేయించిన ప్రాజెక్టు పర్యవేక్షకులు ఆచార్య జి. యన్. రెడ్డిగారి కింద పనిచేయడం, ఆ పని ఇంత నిత్యోత్సాహజనకంగా వుంటుందని వూహించుకోలేకపోయాను. ఈ ప్రచురణలు ఈ రూపంలో ఇంత త్వరగా వెలుగు చూడడానికి ఆయన ఇచ్చిన ప్రేరణ, తోడ్పాటు ఒక కారణం.

ఈనాడు బ్రౌన్ పట్ల మన తెలుగుదేశంలోకంటే విదేశాలవారు ఎంతో కుతూహలం కనపరుస్తున్నారు. విలువ నిస్తున్నారు. ఇందుకు సాక్ష్యంగా ఒక చిన్న ఉదంతం ఈ సందర్భంలో చెప్పాలి. ఇక్కడ శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయంవారు ఈ బ్రౌన్ రీసర్చి ప్రాజెక్టును ఏర్పాటు చేయబోతున్న తరుణంలో అక్కడ లండన్ లో ఒక పాతపుస్తకాలషాపువారు బ్రౌన్ స్వహస్త లిఖితంగా 123 ఏళ్ళ క్రితం వ్రాసి పెట్టిన స్వీయచరిత్ర ప్రతి ఒకటి బయటపెడితే అమెరికాలోని మిన్నెసోటా లైబ్రరీ వారు ఆ 60 పేజీల ప్రతిని 146 డాలర్లకు, అంటే దాదాపు 1,500 రూపాయలకు కొని భద్రపరిచారు. అట్లాగే 150 ఏళ్ళ క్రితం కేంబెల్ ప్రకటించిన తెలుగు గ్రామర్ ను బ్రౌన్ కు బహూకరిస్తే, బ్రౌన్ దాదాపు ప్రతి పేజీలో ఏదేదో మార్జినల్ నోట్స్ వ్రాసిపెట్టిన ప్రతి లండన్ లోనే మరొక పాతపుస్తకాల షాపువారు అమ్మకానికి పెట్టివున్నారు. దాన్ని కొనిపెట్టుకోవాలనే ఆసక్తి మన కెక్కడిది? ఇదీ పరిస్థితి.

ఈ మిన్నెసోటావారు కొన్న బ్రౌన్ వ్రాతప్రతికి జెరాక్స్ ప్రతి తీసి పంపమని న్యూయార్క్ లో వుంటున్న డాక్టర్ ఎ. శ్రీనివాస్ (నా శ్రీమతి సుమిత్ర అన్న) గారిని కోరితే ఆయన 15 డాలర్లు ఖర్చుపెట్టి పదిలంగా పంపాడు. న్యూయార్క్ నేషనల్ లైబ్రరీలో తలదాచుకొని వున్న బ్రౌన్ తెలుగు గ్రామర్ మొదటి (1840) ఎడిషన్ ఫోటో కాపీ పంపమని ఆయన్నే కోరాను. మైక్రోఫిల్మ్ తీసి పంపడానికి ఏర్పాట్లు చేశానని మొన్ననే జాబొచ్చింది. బ్రౌన్ దీన్ని మద్రాసులోనే సొంతంగా ప్రింటు చేసినా మద్రాసు లైబ్రరీలు కళ్ళకు వత్తులు పెట్టుకొని వెతికినా కనపడ్తేనా? ఇట్లాగే దాదాపు మూడేళ్ళ క్రితం, ఈ ప్రాజెక్టు ఏర్పడడానికి చాలా ముందు ఫ్లైట్ లెఫ్టినెంట్, ఇప్పుడు స్క్వాడ్రన్ లీడర్ ఎం. జె. రెడ్డి (నా సోదరి శ్రీమతి సుశీలమ్మ అల్లుడు) లండన్ కు పై చదువులకోసం వెళ్తుంటే ఆయన్ను కోరాను— బ్రిటిష్ మ్యూజియంలో వున్న బ్రౌన్ ముద్రిత గ్రంథాలకు కనీసం కొన్నిటికైనా

మైక్రో ఫిల్ములు తీసి పంపమని. మూడువారాల క్రితమే ఇండియా వస్తూ నా మరదలు శ్రీమతి కుముదచేత కొన్ని పంపించాడు. వీళ్ళకు కృతజ్ఞతలు.

ఇంకా ముఖ్యంగా చెప్పవల్సిన వ్యక్తి ఒకరున్నారు. బ్రౌన్ ప్రాజెక్టు అవతరణకు ముందు శ్రీ నార్ల - నా ఔత్సాహిక పిచ్చి పరిశోధనల పట్ల, నా పట్ల అవాజ్యమైన అనురాగాన్ని ప్రదర్శిస్తూ ఒక ప్రోత్సాహక శక్తిగా వుంటున్న శ్రీ నార్ల - సతీసమేతంగా ప్రపంచ పర్యటనకు వెళ్తున్నప్పుడు, ఆయన్ను అమాయకంగా ప్రాధేయపడ్డాను: 'సార్, మీరు లండన్ వెళ్తున్నారు కదా. అక్కడ వారం పది రోజులు వుంటానంటున్నారు గదా. ఒక్క చిన్నపని నా కోసం మీ శిష్యుడికోసం చేస్తారా. అక్కడి బ్రిటీష్ మ్యూజియం, ఇండియా ఆఫీస్ లైబ్రరీల్లో వుండే బ్రౌన్ సంపుటాల్లో మీకు తోచిన ఒకటి రెంటికైనా మైక్రో ఫిల్ములు పంపండ'ని పిచ్చిగా ప్రార్థించాను. అబ్బా నీ బ్రౌన్‌పిచ్చి పాడుగాను, డెబ్బయ్యో పడిలో ప్రవేశించబోతున్న నన్ను ఈ పనికి పురమాయిస్తున్నావా అన్నట్లుగా చూచి - 'ప్రామిస్ చేయలేను బంగోరె కానీ చూస్తాను'—అన్నారు. కొన్నినెల్ల మౌనం తర్వాత ఇండియా తిరిగొచ్చి గుర్తుగా జాబు వ్రాశారు: 'లండన్‌లో ఒక తెలుగు వ్యక్తికి నీ గురించి చెప్పాను. నీ పుస్తకాలు పంపి, బ్రౌన్ గురించి నీకేమి కావాలన్నా అతనికి వ్రాయి. తప్పక పంపిస్తాడు'—అని ఒక అడ్రసు ఇచ్చారు. ఆ జాబు చూచుకొని గాల్లో తేలిపోతూ నా పుస్తకాలు (బ్రౌన్ గురించినవి) రెండింటిని రిజిస్టర్డ ఏర్ మెయిల్లో పంపుతూ ఆ అపరిచిత వ్యక్తికి నా బ్రౌన్ వేదనను సరఫరా చేశాను. 'నీ పుస్తకాల్ని ఆక్స్‌ఫర్డ్ ప్రయాణంలో రైల్లో ఏకబిగిన చదివాను. నీవడిగిన బ్రౌన్ మెటీరియల్‌ను త్వరలో పంపుతాను. లేదా నేను ఇండియా వస్తూ తెస్తాను'— అంటూ ప్రేమగా జాబు వ్రాశారు. ఆ జాబు చూచుకొని ఎంత సంబరపడిపోయానో ఎట్లా చెప్పడం? అప్పటినుంచి నేటివరకూ ఆ అపరిచిత వ్యక్తి నేనడిగిన మెటీరియల్‌ను విసుగు లేకుండా లండన్‌నుంచి నెమ్మది నెమ్మదిగానైనా పంపుతూ వస్తున్నారు. అతనే డాక్టర్ జి. కృష్ణమూర్తి. గూటాల కృష్ణమూర్తిగారు. వారి ఋణం ఎట్లా తీర్చుకోను?

ఇక లండన్ ఇండియా ఆఫీస్ లైబ్రరీలో వున్న బ్రౌన్ చరమదశనాటి 52 సంపుటాలు దాదాపు 17 వేల పేజీల వ్రాతప్రతులకు మైక్రో ఫిల్మ్ కాపీల నిమిత్తం డబ్బు కట్టడానికి మా యూనివర్సిటీవారు ఏర్పాటుచేశారు. మొన్న ఆగస్టులో దాదాపు 9 వేల రూపాయలు కట్టాము. ఈ బ్రౌన్ మైక్రో ఫిల్ములు వచ్చే జూన్ - జూలైనాటికి తప్ప ఈలోగా పంపడానికి వీలు కాదన్నారు వారు. అవి

వచ్చినప్పుడు కానీ బ్రౌన్ అధ్యయనంలో కొత్త శకం ప్రారంభం కాదు. ఈ విషయంలో ఆంధ్రప్రదేశ్ విద్యాశాఖ ఉదారదృష్టితో ఇందుకు అవసరమైన ధనాన్ని మంజూరు చేసినందుకు కృతజ్ఞతలు.

ఇక, బ్రౌన్ జ్వరంతో కొట్టుమిట్టాడుతూ దరిగానని తరుణంలో—నా పరిమిత శక్తులకు ఒక తెన్ను చూపి తోడ్పడిన మిత్రుడూ, రాజ్యసభ సభ్యుడు శ్రీ ఎన్. జనార్దన రెడ్డి ఒకరున్నారు. ఆయన ఇచ్చిన అండను ఎట్లా మరువగలను?

బ్రౌన్ ప్రాజెక్టు కృషిని తిలకించి, హర్షించి ఈ లేఖల పుస్తకంతోబాటు మరి రెండు బ్రౌన్ గ్రంథాల ప్రచురణకు తమకు వీలున్న పరిధిలో ఒక పరిమితమైన సహాయ పథకాన్ని సూచించి, రాష్ట్ర ప్రభుత్వ పక్షంగా మంజూరు చేయించిన ఆం. ప్ర. ఆర్కైవ్స్ శాఖ డైరెక్టర్ ఎస్. వెంకట్రామయ్య (ఐ. ఏ. ఎస్.) గారికి కృతజ్ఞతలు చెప్పుకోవడం నా విధి.

ఈ ప్రాజెక్టు పక్షంగా ఈ లేఖల పుస్తకాన్నే మొదటగా ఎందుకు వెలువరించాలి? బ్రౌన్ సేకరించి పెట్టిపోయిన దాదాపు 6_7 వేల పేజీల్లో వున్న ఈ జాబులు నేను ప్రత్యేకంగా అభిమానిస్తున్న విభాగం. ఇంతగా ఇష్టపడడానికి కారణం ఒక్కటే. ఈ లేఖలు పైకి వట్టి మొరటు వచనపు ముక్కలుగా కనపడుతున్నా—1790 నుంచీ 1853 దాకా విస్తరించివున్న ఈ జాబుల్లో వెలుగులోకి రావల్సివున్న తెలుగుదేశపు సాంఘిక సాంస్కృతిక చరిత్ర ఎంతగానో నిక్షిప్తమై వున్నదని నా ప్రగాఢ విశ్వాసం. మూడేళ్ళ క్రితం ఇదే జాబుల్ని ముడిసరుకుగా తీసుకొని "బ్రౌన్ జాబులు: తెలుగు జర్నలిజం చరిత్ర: 1832 నుంచి 1857 దాకా" అనే గ్రంథాన్ని ప్రకటించాను. తెలుగు జర్నలిజం చరిత్ర వ్రాయడానికి ఈ జాబులు ఆనాడు ఆధారభూతమైనట్లే, ఇప్పుడు ఆధునికాంధ్ర సాహిత్య చరిత్రకూ శ్రేష్ఠమైన సామగ్రిగా ఉపయోగపడుతున్నాయి. తెలుగువాళ్ళకు సంబంధించి ఇంకా ఎన్నో విషయాల సమగ్రచరిత్ర వ్రాయడానికి ఇవి అద్భుతంగా ఉపయోగపడ్తాయని నా నమ్మకం. తెలుగుదేశంలో కరువుకాటకాల చరిత్ర, తెలుగు యువకుల విద్యావిషయాల చరిత్ర, వాళ్ళ నిరుద్యోగ చరిత్ర, వాళ్ళ ఆర్థిక సామాజిక వికాస చరిత్ర—ఇట్లా ఎన్ని చరిత్రల అధ్యయనానికైనా ఈ జాబులు ఒక తరగని గని అని, ఒక పంటభూమి అనీ, నా విశ్వాసం. అందువల్లనే ఈ బ్రౌన్ ప్రాజెక్టు ప్రచురణలకు ఈ జాబుల సంకలనంతో శ్రీకారం చుట్టుతున్నాం.

దాదాపు పదేళ్ళ క్రితం ఆం. ప్ర. సాహిత్య అకాడమీ వీటి ప్రాధాన్యం గుర్తించి 4_5 వేల రూపాయలు ఖర్చుపెట్టి మద్రాసు ఓరియంటల్ మేనుస్క్రిప్ట్సు లైబ్రరీలో

నుంచి ఈ జాబుల్లో 16 సంపుటాలను మాత్రం కాపీ చేయించి భద్రపరచుకొని వుంది. కానీ, దురదృష్టవశాత్తు వాటి ఆధారంతో ఒక్క ప్రచురణనైనా తీసుకు రాలేకపోయింది. ఈ సందర్భంలో ఒక మాట. ఒక నెలరోజుల క్రితమే కడపజిల్లా కలెక్టరు పి. యల్. సంజీవరెడ్డిగారు బ్రౌన్ ప్రాజెక్టుకు ఒక ప్రతిపాదన పంపి వున్నారు. ఈ జాబుల్లోనుంచి కడపకు సంబంధించినవాటిని ఒక సంకలనంగా ఏరి కడప సాంఘిక చరిత్రాది వివరణలతో ఒక సంపుటాన్ని వెలువరించడానికి జిల్లా నిధులలోనుంచి కొంత కేటాయించగలనని వ్రాశారు. ఇందుకు ప్రయత్నాలు జరుగు తున్నాయి. త్వరలో కార్యరూపం ధరించగలదని ఆశిస్తున్నాను. ఇట్లా జిల్లాల వారీగా ప్రాంతీయ చరిత్ర సారాన్ని పిండి అధ్యయనం చేయడానికి ఈ లేఖల పెన్నిధి బాగా పనికొస్తుందనడంలో ఎట్టి సందేహమూ లేదు.

ఇకపోతే, ఈ పుస్తకాన్ని "విదేశీయులకు తెలుగు బోధించిన తొలి ఉపాధ్యాయులు" అని మద్రాసు ఫోర్ట్ సెంట్ జార్జి కాలేజి నేపథ్యం గురించిన అధ్యాయంతో ప్రారంభించడంలోకూడా ఒక కారణం లేకపోలేదు. మన సాహిత్య సాంస్కృతిక పునరుజ్జీవనం (రినైజాన్స్) పందొమ్మిదో శతాబ్దిలోనుంచీ ప్రారంభమైనట్లు స్థూలంగా చెప్పుకొంటున్నాం. కానీ, ఆ 'రినైజాన్స్' ఏ వీరేశలింగంతోనో, గురజాడతోనో లేదా వెనక్కు వెళ్ళి ఏ చిన్నయసూరితోనో ప్రారంభమైనట్లు చెప్పు కొంటున్నాం. అయితే ఏ చారిత్రకశక్తుల ఆసరాతో, ఆధారంతో ఈ ఆధునికత ఆవిర్భవించిందో మన చరిత్రకారులు ఇంకా సరిగా అంచనా కట్టలేదనే నా విశ్వాసం. తెలుగు రినైజాన్స్‌కు నిజమైన జన్మకాలాన్ని జన్మస్థానాన్నీ, దాని స్వరూప స్వభా వాలనూ అర్థం చేసుకోవాలంటే ఇంకా ముందుకు వెళ్ళి చూడాలని నా మతం.

ఈ తెలుగు 'రినైజాన్స్' పుట్టుకలో ఒక కీలకమైన ఘట్టాన్ని మనం ఇంతవరకూ దాట వేస్తూనే వస్తున్నాం. నా దృష్టిలో—దక్షిణ ప్రాంతానికి సంబంధించినంత వరకూ, ప్రత్యేకించి తెలుగునాడుకు సంబంధించినంతవరకు మద్రాసు ఫోర్ట్ సెంట్ జార్జి కాలేజి అవతరణ అనేది ఒక ముఖ్యమైన మైలురాయిగా భావిస్తున్నాను. అంతకుముందు సైతం వున్న కొన్ని బీజప్రాయమైన శక్తులమాట అటుంచుదాం. వలస పరిపాలనావసరాలను దృష్టిలో పెట్టుకొని, ఒక పద్ధతిలో, ఒక సుస్పష్టమైన సంస్థాగతంగా ఇంగ్లీషువాళ్ళు విధిగా మన దేశభాషలను నేర్వడం అనేది అప్పటితో అక్కడితోనే అంకురార్పణ జరుగుతుంది. అటు అధికారహోదాలో వున్న ఇంగ్లీషు వాళ్ళు - ఇటు దేశభాషా పండితులు, ఇట్లా రెండు భిన్న సంస్కృతులకు చెందిన వారు కలిసి కొంతకాలంపాటు సన్నిహితంగా పనిచేసే కూడలి ప్రదేశం, సంగమ

స్థానంగా ఈ కాలేజి ఆవిర్భవించింది గనుక దీనికి ఈ ప్రాముఖ్యం వున్నదని నా నమ్మకం. మనం పరిశీలించవలసిన కీలకమైన సమస్యలు అక్కడే అప్పుడే ఎదురవుతున్నాయి. ఇక, బ్రౌన్ కూడా ఈ కాలేజీలో మెలిగి తర్ఫీదై వచ్చినవాడే గనుక మన అధ్యయనాన్ని ప్రధానంగా ఇక్కడే 'ఫోకస్' చేయవల్సి వుంది. బ్రౌన్ ఈ కాలేజి ప్రభావాన్ని గురించి పెక్కుచోట్ల ప్రస్తావించి వున్నాడు. ఉదాహరణకు ఈ పుస్తకంలో 3-4 పేజీల్లోని వాక్యాలు చూడమని మనవి.

ఇండియన్ రెనైజాన్స్‌కు, ముఖ్యంగా బెంగాల్ రెనైజాన్స్‌కు కలకత్తా ఫోర్ట్ విలియం కాలేజీయే జన్మస్థావరం అంటూ డేవిడ్ కాఫ్ (David Kopf) అనే పరాయిదేశపు యువ పరిశోధకుడు "British Orientalism and the Bengal Reniassance: The Dynamics of Indian Modernization 1773-1835" అనే తన సిద్ధాంత గ్రంథం (1969) లో రుజువు చేయడానికి అద్భుతంగా ప్రయత్నించాడు. ఎంతో అపురూపమైన చరిత్రసామగ్రిని కుప్పపోస్తూ అందులో ఆయన సాగించిన చర్చ సారాంశం - బెంగాల్ రెనైజాన్స్ కిరీటాన్ని ఆ కలకత్తా కాలేజి శిఖరంపై తగిల్చడమే. అయితే ఆయన గ్రంథం చదువుతుంటే మన దక్షిణాదికి సంబంధించిన సమస్యల స్వరూపం ఎక్కడా కానరాదు. దీన్ని దృష్టిలో పెట్టుకొనే ఈ లేఖల గ్రంథంలో 51-52 పేజీల్లో ఫుట్‌నోట్‌లో ఈ భావాన్నే వ్యక్తం చేశాను.

సాహిత్యపరంగా ఒక్క ఉదాహరణ చెప్పాలంటే ఆధునికతకు ఒక గొప్ప సూచిక వచనరచన. ఒక జాతి నాగరికతకు, దాని ఆధునిక సంస్కార సంపదకు ఒక సూటి నిదర్శనం ఆ భాషలో వున్న వచన సారస్వతం అని నా నమ్మిక. మన భాషల్లో ఇటువంటి వచన సాహిత్య సృష్టికి—ప్రత్యేకించి ఈ కాలేజి స్థాపనతో అవసరం ఏర్పడ్డది. ప్రత్యేక అవసరం ఏర్పడ్డది. అతి క్రూడ్ ఫార్మ్‌లో వచనంలో వున్న ఈ లేఖలను ఆధారం చేసుకొని ఆధునికాంధ్ర సాహిత్య చరిత్ర చర్చకు ఉపక్రమించడం, ఈ చర్చను ఈ ఫోర్ట్ సెంట్ జార్జి కాలేజి వాతావరణ నేపథ్యంలోనుంచి కొనసాగించడంలో నా ఉద్దేశం అదే. మన తెలుగు సాంస్కృతిక పునరుజ్జీవనానికి ఈ కాలేజి ఎంతవరకు దోహదం చేసిందన్న విషయాన్ని మరింత లోతుకు వెళ్ళి చరిత్రాధారాలతో పరిశీలించాలన్న అవసరాన్ని నొక్కిచెప్పడానికే ఈ గ్రంథాన్ని ఈ అధ్యాయంతోనే ప్రారంభించాల్సి వచ్చింది. అంతేకాదు, తెలుగు సాహిత్య రంగంలో బ్రౌన్ చేసిన మార్గదర్శకమైన కృషిని గురించి, తెలుగు భాషనూ సాహిత్యాన్ని ఆధునికీకరణం చేయడంలో ఆయన నిర్వహించిన భూమికను గురించి

ఈ దృష్ట్యా అవగాహనకు తెచ్చుకోవాలనే ఆశయంతోనే ఇట్లా ఆరంభించాల్సి వచ్చింది. ఈ ఉద్దేశంతోనే బ్రౌన్ వ్రాసిన తెలుగు వచనాన్ని వీలైనంత విరివిగా చూపాలన్న ప్రయత్నం జరిగింది. బ్రౌన్ స్వయంగా వ్రాసిన లేఖలు అదనంగా రెండింటిని వ్యాఖ్యాన రహితంగానైనా అనుబంధంలో చేర్చడం ఈ దృష్టితోనే.

ఇక అనుబంధంలో ఆఖరున 'టూకీగా బ్రౌన్ జీవిత కథ' అనే పేరుతో ఆయన జీవిత విశేషాలను వివిధ దృక్కోణాలనుండి పరిశీలించడానికి వీలుగా ఇచ్చాను. మూడు నాలుగు పేజీల్లో సరిపెట్టాలనుకొన్నది 30 పేజీలు దాటిపోయింది. ముఖ్యంగా బ్రౌన్ సాహిత్య విశేషాల సంగతటుంచి తెలుగునాట ఆయన గడిపిన 'అధికార జీవితం' గురించి అధ్యయనం చేయవల్సింది ఎంతైనా వుంది. ఉదాహరణకు చిత్తూరు జిల్లా జడ్జిగా ఆయన నెలరోజులకంటే మించి లేదు. కానీ, ఆ నెలరోజుల్లో చిత్తూరులో కోర్టు గుమాస్తా శేషయ్యద్వారా సేకరించిన తెలుగు సంగీత (కీర్తనల) గ్రంథాలు, వాటిలో కొన్నిట్ని ఆయన ఇంగ్లీషు బాణీలతో సరిపోల్చి చూడడం, ఆ మట్లు కట్టడం వగైరా సంగతులటుంచి, ఆ స్వల్పకాలంలో ఆయన ఎన్నో ఫైళ్ళు చూచి ఎక్కువ సంఖ్యలోనే కేసుల తీర్పులు చేసినట్లున్నాడు. వీటిల్లో ఆయన భావసరళి ఏమిటి? అట్లాగే గుంటూరు ఆక్టింగ్ కలెక్టర్‌గా పట్టుమని మూడు నెలలకంటే ఎక్కువ లేడు. కానీ, ఆ మూడు నెలల్లో ఎన్ని ముఖ్యమైన ఫైళ్ళు చూశాడు. ఎన్ని నివేదికలు ప్రభుత్వానికి పంపాడు! 1833 జనవరి 16 న ఛీఫ్ సెక్రెటరీకి జాబు వ్రాస్తూ అందులో మొదటి దఫాగా famine (కరువు) అనే పదం వాడతాడు. దానిమీదట 18 తేదీన్నే (గుంటూరునుంచి రెండు రోజుల్లోనే ఆ జాబు ఎట్లా మద్రాసుకు చేరుకున్నదో) చీఫ్ సెక్రెటరీ చీవాట్లు పెడ్తూ జవాబు వ్రాస్తాడు – 'పదాలు పొదుపుగా వాడడం నీకు రాదా? కలెక్టర్‌గా నిన్నగాక మొన్న చార్జి తీసుకొన్నావు. అప్పుడే కరువు అంటావేమిటి? scarcity (కొరత) అనలేవా? ఇంతవరకూ అక్కడ కరువు పరిస్థితులున్నట్లు గవర్నర్‌కు ఎవరు కానీ తెలియచేయలేదే—అంటూ దబాయిస్తూ బ్రౌన్‌కు వ్రాస్తాడు. దానిమీదట బ్రౌన్ పరమ వినమ్రంగానే—'ఉన్నమాటంటే ఉలుకెందుకు? కరువనే మాట వాడినందుకు నన్ను ఆడిపోసుకుని ప్రయోజనమేమిటి? ఇదుగో ఇక్కడి దారుణ కాటక పరిస్థితి' అంటూ లెక్కపక్కలతోబాటుగా ప్రజల ఇక్కట్లను తెలియజేస్తాడు; నివేదిక పంపుతాడు. ఆంధ్రదేశ చరిత్రలో ఈ 'గుంటూరు కరువు' ఎట్లాటి ప్రభావాన్ని కల్గించిందో, బ్రిటీష్‌వాళ్ళ పరిపాలనా సరళిలో ఎట్లాంటి మార్పుల్ని తెచ్చిందో చెప్పుకోవాలంటే అదంతా వేరే కథవుతుంది.

ఇక అప్పటి కొన్ని ఫోర్జరీ, దొంగసాక్ష్యాల కేసుల విషయంలో బ్రౌన్ తీర్పులు అతన్ని డిస్మిస్ చేసేదాకా వెళ్ళాయంటే వీటిల్ని గురించి ఎంత, ఎట్లా చెప్పాలి? ఒక్క మాటలో చెప్పాలంటే బ్రౌన్‌ను అధ్యయనం చేయడమంటే ఆ కాలంనాటి తెలుగు సమాజపు పొరలను వివిధ కోణాలనుండి చేసే అధ్యయనమే అవుతుంది.

ఆఖరుగా ఒకమాట. ఈ గ్రంథ రచనలో అనివార్యమైన తొందరపాట్లవల్ల కొన్ని లోపాలు దొర్లాయి. మరికొన్నిచోట్ల సమగ్రత కొంత దెబ్బతిన్నది. ఉదాహరణకు 54వ పేజీలో "అచ్చుముచ్చట్లు" అనే అధ్యాయం ఒకటి వుంటుందనీ, అందులో బ్రౌన్‌కు తన ప్రెస్ వర్కర్ వ్రాసే జాబు వస్తుందనీ సూచించడం జరిగింది. నిజానికి అందులో "అచ్చుముచ్చట్లు" అనే గాకుండా "తెలుగు ప్రెస్ పెట్టి చేతులు కాల్చుకున్న బ్రౌన్" అనే ఉపశీర్షికతో వచ్చే అధ్యాయమే గాకుండా, "బ్రౌన్ గ్రంథ సేకరణ లౌల్యం" అనే మరో అధ్యాయాన్నికూడా చేర్చి ప్రెస్ కాపీని సిద్ధపరచడం జరిగింది. కానీ, మధ్యలో గ్రంథం అచ్చు జరుగుతుంటే, పేజీల సంఖ్య అనుకొన్నదానికంటే మితిమీరి పోతుంటే ఆ రెండు అధ్యాయాల్ని ఆఖరుక్షణంలో తొలగించవలసి వచ్చింది. ఈ మార్పును పాఠకులు గమనించ ప్రార్థన.

అట్లాగే 12వ పేజీలో తెలుగు ట్రాన్స్‌లేటర్ మేజర్ టి. జి. యమ్. లేన్ ప్రకటించిన తెలుగు అర్జీల పుస్తకానికి ఇంగ్లీషు తర్జుమాకూడా ప్రకటింపబడినట్లు స్పష్టంగా చెప్పలేక ఏవో ఊహాపోహల మాటలు వ్రాశాను. ఇంగ్లీషు తర్జుమా వెలువడిన మాట వాస్తవం. దాని కాపీ ఇండియాలో ఎక్కడుందో ఏమోకానీ, బ్రిటీష్ మ్యూజియంలో వున్నట్లు బార్నెట్ కేటలాగ్ చెప్తున్నది. అట్లాగే ఆధునిక అవసరాలను దృష్టిలో పెట్టుకొనివచ్చిన తెలుగు రీడర్లగురించి చెబుతూ కొన్ని ముఖ్యమైన రీడర్లను చేర్చడం మర్చిపోయాను. ఉదాహరణకు థామస్ ఆంతోనీ పిళ్లై 1880 లోనే ఒక రీడర్‌ను ప్రకటించాడు: The English, Tamil, Telugu and Hindustani Sonmalai, or An easy way of learning to speak four languages—అని దీనిపేరు. పిళ్లై దీన్ని రూపొందించగా, సి. వెంకటస్వామి నాయుడు, తంజావూరు సంస్థానకవి డేనియల్ పిళ్లై రివైజ్ చేశారు.

ఇక వేమన పద్యాలను బ్రౌన్‌కంటే నూరేళ్ల ముందుగానే 1730 లో ఓంప్రథమంగా సేకరించి పారిస్‌కు పంపిన ఫాదర్ లె గాక్ (Father Le Gac) ను గురించి చర్చించవల్సింది చాలా వున్నా, అక్కణ్ణే ఆయన్ను గురించి బొత్తిగా ఏమీ చెప్పక పోవడం అన్యాయమే. తెలుగుదేశంలో ముఖ్యంగా రాయలసీమ ప్రాంతంలో మొదటగా పనిచేసిన జెసూట్ మిషనరీలలో ఈ లె గాక్ (1671-1738), ఫాదర్

జాన్ కెల్మటీ (John Calmette, 1693_1739_40) ముఖ్యులనదగినవారు. ఈ ఫాదర్ కెల్మటీ సంస్కృతం, తెలుగు భాషల్లో మంచి పండితుడని పేరుపడ్డవాడు. తెలుగు క్రిశ్చియన్ కావ్యం 'వేదాంత రసాయనం'తో ముడిపడిన సత్యబోధస్వాముల వారు ఈ కెల్మటీయేనని చరిత్రకారుల ఊహ. ఇక ఫాదర్ లె గాక్ ఆ రోజుల్లో తెలుగుదేశంలోనుంచి ప్రత్యేకించి రాయలసీమనుంచి ఎన్ని తాటాకు పుస్తకాలను పారిస్‌లోని కింగ్స్ లైబ్రరీకి పంపాడో లెక్కలేదు. అనంతపురం జిల్లాలోని హిందూపురం తాలూకా కృష్ణాపురంలో ఈ లె గాక్ చనిపోయినట్లు ఆయన సమాధిరాయికూడా అక్కడ వున్నట్లు ఫ్రెంచి లేఖలనుంచి ఇంగ్లీషులోకి తర్జుమా చేయబడిన "హిస్టరీ ఆఫ్ ది టెలుగు క్రిశ్చియన్స్" (తిరుచునాపల్లి, 1910) అనే గ్రంథాన్నిబట్టి తెలుస్తున్నది. ఆయన పారిస్‌కు పంపిన ఆ ప్రతిని చూస్తే వేమన్నను గురించి కొంతైనా కొత్తగా తెలిసే అవకాశం వుంటుంది.

ఇక వేమన్నను మొట్టమొదటిసారిగా కీర్తించిన అబె డుబాయ్ వ్రాసిన "హిందూ మేనర్స్..." గ్రంథం ఫక్తు గ్రంథచౌర్యం కోవకు చెందినదనీ, అప్పటికి అముద్రితంగావున్న ఒక ఫ్రెంచి పుస్తకాన్ని కాపీకొట్టి డుబాయ్ తన పేరు పెట్టుకొన్నట్లు ఒక ఫ్రెంచి రచయిత్రి తన తీసిస్‌లో రుజువు చేసిందనీ ఫ్రైకెన్‌బర్గ్ ప్రస్తావించారు. ఈ పుస్తకం అచ్చవుతున్న దశలో ఒక గ్రంథం చదివాను. Indian Society and the Beginnings of Modernization (1830_50) అని దాని పేరు. లండన్ యూనివర్సిటీకి చెందిన స్కూల్ ఆఫ్ ఓరియంటల్ అండ్ ఆఫ్రికన్ స్టడీస్ వారు దీన్ని ఇటీవలే ప్రచురించారు. అందులో ఫ్రైకెన్‌బర్గ్ "The Impact of Conversion upon Society in South India..." అనే వ్యాసంలో ఈ విషయాన్ని ప్రస్తావించారు. ఈ డుబాయ్ గ్రంథానికి కారణమైన ఆ ఫ్రెంచి మాతృక విషయంకూడా తెలిస్తే వేమన్నను గూర్చి మరేదైనా విషయం వుండొచ్చు.

ఇక ఆఖరుగా ఒకమాట. ఈ బ్రౌన్ దీపాన్ని వెల్గించి ఈ ప్రాజెక్టు పుట్టుకకు కారకులైనవారు అప్పట్లో వైస్‌ఛాన్సలర్‌గా వున్న డాక్టర్ డి. జగన్నాథ రెడ్డిగారు. దీన్ని ఈ దశవరకు తీసుకొచ్చి, గడువును కొంత పొడిగించి, నిధులను ఉదారంగా మంజూరు చేయడంలో అధిక శ్రద్ధను కనపర్చినవారు, ఓరియంటల్ విజ్ఞాన సంపద పట్ల ప్రత్యేక అభిమానాన్ని చూపుతున్న ఇప్పటి వైస్ ఛాన్సలర్, ప్రొఫెసర్ కె. సచ్చిదానందమూర్తిగారు. వీరికి ప్రత్యేకంగా కృతజ్ఞతలు చెప్పుకొంటున్నాను.

మజిలీ : మద్రాసు,
9_1_'77.

—బంగోరె.

# 1

## విదేశీయులకు తెలుగు బోధించిన తొలి ఉపాధ్యాయులు

మన విద్యాలయాలలో 'తెలుగు బోధన', 'తెలుగులో బోధన' అనేవి ఇంకా పరిణత దశకు చేరుకోలేదంటే ఉలిక్కిపడవలసిన పన్లేదు. మన పరిస్థితి ఇట్లా వుంటే, విదేశాల్లోని కొన్ని విశ్వవిద్యాలయాలు తెలుగుభాషా శాఖలు ఏర్పరచుకొని కొద్దో గొప్పో కృషి చేస్తున్నాయి.

ఒక్క అమెరికాలోనే నాలుగైదు విశ్వవిద్యాలయాల్లో తెలుగు శాఖలున్నాయి. తెలుగును గురించి పరిశోధనాత్మక రచనలు వస్తుండడమేగాక, తెలుగులో డాక్టరేట్లు పుచ్చుకున్న ఒకరిద్దరు అమెరికన్లు కూడా వున్నారు. ఉదాహరణకు టెక్సస్ విశ్వ విద్యాలయానికి చెందిన యాండ్రె షోబర్గ్ (Andree Sjoberg).

ఇక మాస్కోలో ఏకంగా తెలుగు పుస్తకాలే చూడముచ్చటగా అచ్చొత్తించి మనకిక్కడకు సరఫరా చేస్తున్నారు. రష్యన్ వనిత శ్రీమతి స్వెత్లానా జెనిత్ (Svetlana Dzenit) ఈ తెలుగు ప్రచురణలకు పర్యవేక్షకురాలుగా వుంటున్నారు.

లండన్‌నుంచి తెలుగు పుస్తకాలు ప్రచురించాలనే సాహసిక ప్రయత్నమొకటి జరుగుతున్నది. 'విదేశాంధ్ర ప్రచురణలు' అనే పేరుతో డాక్టర్ గూటాల కృష్ణమూర్తి ఒక సంస్థను ఇటీవలే ప్రారంభించారు. తెలుగువారిని గురించే గాకుండా, తెలుగులో కూడా కొన్ని గ్రంథాలను లండన్‌నుంచి ముద్రించాలని గట్టిగా ప్రయత్నిస్తున్నారు— అలనాడు 1746 లో బెంజమిన్ షూల్జ్ (Benjamin Schultze, 1689-1760) జర్మనీనుంచి తెలుగు పుస్తకాలు ఓంప్రథమంగా అచ్చువేసినట్లు. ఆ మాటకొస్తే, లండన్‌లో 1855 లో అచ్చయిన విల్సన్ (H. H. Wilson, 1789?-1860) రూపొం

దించిన "గ్లాసరీ ఆఫ్ జుడీషియల్ అండ్ రెవిన్యూ టర్మ్స్" (Glossary of Judicial and Revenue Terms) అనే నిఘంటువులో ముఖ్యమైన ఇతర భారతీయ భాషలతోపాటు వందలాది పదాలకు తెలుగు అక్షరాలు పోతపోయించి ముద్రించడం జరిగింది. దీనికి ముందు, 1837 లో కెప్టన్ హెచ్. హార్క్‌నెస్ (Captain H. Harkness) దక్షిణాది భాషల వర్ణమాలను లండన్‌లోనే ముద్రించి వున్నాడు. ఇందులో తెలుగు అక్షరాలు, లిపి కాలక్రమేణా పొందిన పరిణామ వికాసాలను ఇతర దక్షిణాది భాషలతో సరిపోలుస్తూ సూచించే సుదీర్ఘ పట్టికలను 'లిథోగ్రాఫ్' ముద్రణలో అచ్చువేశాడు.*

ఈ పరిణామం ఒక్క రోజులో యాదృచ్ఛికంగా జరిగింది కాదు. దీని వెనుక ఎందరెందరి కృషో దృశ్యాదృశ్యంగా వున్నదని చరిత్ర తిరగవేస్తే తెలుస్తుంది. తెలుగుకు సంబంధించినంతవరకు ఈ సవ్వడిలేని అంతర్జాతీయ పరిణామానికి వైతాళికు లనదగినవారు ఎందరో వున్నారు. వారిలో మన బ్రౌన్‌కు ఒక బృహత్‌స్థానం వుంది. ఒక విధంగా దీనిని ముందు ఊహించికొని ఇందుకు అవసరమయ్యే పనిముట్ల నెన్నిటినో సమకూర్చి పెట్టిపోయినవాడు కూడా బ్రౌనే.

ఒకవైపున విదేశాల్లో ఈ తెలుగు అధ్యయన కృషి కొనసాగుతూ వుంటే, ఇంకోవైపున ఇక్కడి తెలుగువాళ్లకు తెలుగు భాషలో పాఠ్యబోధన చేయడానికి మనం ఇంకా తంటాలుపడ్తూనే వున్నాం. ఇటీవలే మన కాలేజీల స్థాయిలో తెలుగులో బోధన ప్రారంభమైంది. తెలుగులో పాఠ్యగ్రంథాలు కొంతకుకొంతైనా తెలుగు అకాడమీ ఆధ్వర్యంలో ఉత్పత్తి అవుతున్నాయి. విజ్ఞాన వినిమయం ఎంతగానో విస్ఫారిన ఈ రోజుల్లో కూడా మనకు ఇందులో ఇబ్బందులు ఇబ్బిడిగా కానవస్తున్నాయి. అట్లాంటిది సరిగ్గా 165 ఏళ్ళక్రితం విదేశస్థులకు, తెలుగు బొత్తిగా రాని విదేశాలవారికి తెలుగు బోధించవలసివచ్చిన ఉపాధ్యాయుల అవస్థ ఏమైవుండాలి? వారికి ఎన్ని తిప్పలు ఎదురైవుండాలి? ఊహించుకోవడం కష్టమే.

ఆ తొలి తెలుగు పండితులెవరు? వారి సత్తా ఏపాటిది? వాళ్లు అనుసరించిన బోధనా పద్ధతులేవి? వాళ్ళకు అప్పట్లో వుండిన సాధనసంపత్తి ఏలాంటిది? ఈ ప్రశ్న లకు సిద్ధంగా జవాబులు చెప్పే సాహిత్య చరిత్రకారులెవరూ మనకు లేరు. చెల్లా

*చూడు: "Ancient and Modern Alphabets of the Popular Hindu Languages of the Southern Peninsula of India", Captain Henry Harkness, London, 1837.

చెదురుగా పడివున్న చరిత్రాస్థికలను మనమే పోగుజేసుకొని చూచుకోవల్సి వుంది. ఇన్ని వ్యాకరణాలు ఏర్పడ్డ తర్వాత కూడా "తెలుగునకున్న వ్యాకరణ దీపం చిన్నది" అని అనుకొంటూనే వున్నాం. "ఇన్ని" నిఘంటువులు వచ్చినా కూడా తెలుగునకు సమగ్రమైన డిక్షనరీ లేదు— అని చాటుకొంటూనే వున్నాం. ఇవేమీ లేకుండానే ఆ రోజుల్లో ఆ తెలుగుపండితులు ఎన్ని తిప్పలు పడ్డారో కదా అనిపిస్తుంది.

విదేశస్థులకు తెలుగు బోధించిన ఆ తొలి తెలుగుపండితులు కొందరు బ్రౌన్ సేకరించి పెట్టిపోయిన లేఖల సంపుటాలలో దర్శనమిస్తున్నారు. వారు వ్రాసుకొన్న జాబులలో ఆ గొడవలు కొన్ని చోటు చేసుకున్నాయి. వాటిని ఇక్కడ పరిశీలిద్దాం.

ఇంగ్లీషువాళ్లు సామ్రాజ్యవాదతత్వంతో తెలుగుదేశాన్ని పాలించడం ప్రారంభమైన మందట్లో కొత్తకారు ఇంగ్లీషు ఉద్యోగస్థులకు దేశభాషల్లో పరిచయం కలుగ చేయాలనే ఏర్పాటు ఒకటి చేశారు. జిల్లాకలెక్టర్ల కింద జడ్జీలకింద వాళ్ళను అసిస్టెంట్లుగా నియమించే ముందు తెలుగులోనూ తదితర ప్రాంతీయ భాషల్లోనూ వారు కొంత ప్రవేశం సంపాదించుకోవాలనే షరతుకూడా పెట్టారు. ఆ మేరకు మద్రాసు ఫోర్ట్ సెంట్ జార్జి కళాశాలను 1812 లో ప్రారంభించి, అందులో ఒకటి రెండేళ్ళపాటు వాళ్ళు ప్రాంతీయ భాషలు అభ్యసించాలన్నారు. ఈ విధంగా వారికి తెలుగువంటి దేశ భాషలను 'నూరిపోసే' కార్యక్రమం ప్రారంభమైంది.

ఈ కాలేజిలో తెలుగుబోధన ఓంప్రథమంగా ఎప్పుడు ప్రారంభమైందో స్పష్టంగా తెలియదుగానీ డాక్టర్ జె. మంగమ్మ వ్రాసిన "బుక్ ప్రింటింగ్ ఇన్ ఇండియా విత్ స్పెషల్ రెఫరెన్స్ టు ది కాంట్రిబ్యూషన్ ఆఫ్ యురోపియన్ స్కాలర్స్ టు తెలుగు (1746-1857)" అనే గ్రంథంలో, మొదటిసారిగా 1813 సెప్టెంబరు 2 తేదీన జె. హిట్ (J. Hitt) అనే ఆయనకు ఈ కాలేజిలో తెలుగు భాషాబోధన ప్రారంభమైందని పేర్కొన్నారు. 1814 మే 1 తేదీన ఏ. సింక్లెర్ (A. Sinclair) ఈ కాలేజీలో చేరిన రెండో తెలుగువిద్యార్థి అయ్యాడు.

ఈ మద్రాసు కాలేజి అవతరణనాటికి తెలుగు సాహిత్యరంగం ఏ దశలో వుందో ఊహాతీతమైందేమీ కాదు. ఆ దుస్థితిని గూర్చి బ్రౌన్ ఇట్లా వ్రాశాడు:

"During the eighteenth century, the incursions of the Mohamedans effectually crushed the literature of Telangana (Telugu country); It has fallen low; and the colloquial dialect has become equally corrupt- men are now rarely met with among

them who can read or explain the classical authors of the language; a knowledge of prosody is yet more rare.

Twenty five years of peace in Telangana under the British government have now afforded opportunities for some revival of literature..."*

"...Telugu literature was dying out, the flame was just glimmering in the socket. The Madras College founded in 1813 (sic. it must be 1812) preserved a little spark..."†

ఈ కాలేజి 1812 లో ప్రారంభమైనప్పుడు నియమితులైన మొదటి తెలుగు పండితులెవరోగానీ, సి. పి. బ్రౌన్ 1817 ఆగస్టు 13 తేదీన ఈ మద్రాసు కాలేజీలో చేరినప్పుడు ఆయనకు ఓనమాలు దిద్దబెట్టి, తెలుగు చెప్పిన పండితుడు వెలగపూడి కోదండరామపంతులు. తర్వాత ఈ పంతులు వుద్యోగం ఎందుకు వూడిపోయిందో ఏమోకానీ, తనకు తెలుగు చెప్పాడనే గురుత్వంతో బ్రౌన్ ఈయనకు పోలీస్ హెడ్ అమీనా వుద్యోగ మిప్పించి ఆదుకొన్నాడు. §

ఇక ఈ కాలేజిబోర్డు ఆ ప్రారంభదినాల్లో అచ్చువేయించిన పుస్తకాలలో ఎ. డి. కాంబెల్ (A. D. Campbell, 1788?-1857) వ్రాసిన తెలుగు వ్యాకరణం ఒకటి. 1816 లో దీని మొదటి ముద్రణ వెలువడింది. పీఠికలో కాంబెల్ పేర్కొన్న "హెడ్ సంస్కృత, తెలుగు మాస్టర్" వేదం పట్టాభిరామశాస్త్రి ఈ కాలేజి మొదటి ప్రధాన తెలుగు పండితుడేమో. అవునని శ్రీ నిడుదవోలు వెంకటరావు "చిన్నయసూరి జీవితం"లో పేర్కొన్నారు. తరచి చూడవలసిన అంశమే. అంతేగాక, ఈ పట్టాభిరామశాస్త్రి క్రింద తెలుగుమున్షీలుగా అసిస్టెంట్లుగా మరెవరైనా పనిచేశారా లేదా అనేది భావిపరిశోధన తేల్చి చెప్పవలసిన అంశం.

---

* చూడు: Verses of Vemana, C. P. Brown, Hyderabad, 1967; Preface by Brown, P. IV.

†"Literary Life of Charles Philip Brown," C. P. Brown, London, 1872, P. 25.

§"English Translations of the Exercises and Documents printed in the Telugu Reader", C. P. Brown, Madras, 1852, P. 55.

పట్టాభిరామశాస్త్రి మరణంతో కాళీపడిన వుద్యోగానికై దరఖాస్తులు కోరుతూ వివిధ జిల్లాల కలెక్టర్లకు జారీచేసిన ఒక నోటీసులో నెలకు 175 రూపాయల జీతమనీ, బ్రిటిష్ సివిల్ ఉద్యోగులకు తర్కం, వ్యాకరణం, ధర్మశాస్త్రాలు చెప్పడమేగాక, తెలుగు నేర్చుకొనేవారికి నన్నయ భట్టీయంతో సహా తెలుగు గ్రామర్ మొదలైనవి బోధించాలని సూచించడం జరిగింది.* దీని తర్వాత వచ్చిన తెలుగుపండితులెవరో మరి?

ఈ కాలేజీ తెలుగుపండితులు బ్రౌన్‌కు వ్రాసుకున్న లేఖలలో మచ్చుకు మూడింటిని ఇక్కడ ముచ్చటించుకొందాం: రావిపాటి గురుమూర్తిశాస్త్రి (1832), పాటూరి రామస్వామిశాస్త్రులు (1846), బేతపూడి సుందరరాయడు (1847). మొదటగా బేతపూడి సుందరరాయడి జాబు:

1

మహారాజశ్రీ సి. పి. బ్రౌన్‌దొరగారి సముఖమునకు—

తమ ఆశ్రితుడు— బేతపూడి సుందరరాయడు అనేక సలాములుచేసి వ్రాసుకున్న అర్జి విన్నపము యేమంటె, నా దగ్గిర చదువుతూ వుండె దొరలలో 'వోగిలివి' దొరగారు తెలుగులో అర్జీలు చదవగలరు. తనంతట తాను తర్జుమా రీ కొంచం సుమారుగా చెయ్యగలరు. మాటలు కూడా సుమారుగా మాటాడగలరు. గ్రామరు విషయం బాగా తెలుసును. యిదిగాక 'లూ'యను దొరగారు నా దగ్గిర మూడునెలల నుంచి చదువుతున్నారు. ఆయన అర్థగ్రాహ్యము చేసుకోగలరు. కొంచం మాట్లాడగలరు. తర్జుమా కొంచం కొంచం యిప్పుడు ఆరంభం చేస్తూ వున్నారు. అయితే, బుద్ధి బహు సూక్ష్మంగా వున్నది. సీఘ్రంగా గ్రహించ దగ్గవారె. వారికి కూడా అర్జీలమీదనె పాటు చేయిస్తున్నాను. సదరహి యిద్దరు దొరలు అరవ భాషలోను యిదేప్రకారం కొంచం యెచ్చు తగ్గుగా వున్నారు. మార్చి నెలలో తమ సముఖములోకి వచ్చి పరీక్ష యివ్వవలెనని వున్నారు. గనక యీ సంగతులు తమ చిత్తానకు విశదం కాగలందులుకు మనివి వ్రాశినాను.

* చూడు: Guide to the Records of the Nellore District 1801 to 1835, Madras, 1934, P. 171.

యిదిగాక కాలేజి తెలుగు మునిషీలలో విశ్వంభరశాస్త్రులు రాజీనామా యిచ్చినట్టు నాకు తెలిసినది. ఆ మాట నిజమైతె సరె. లేక యిఖమీదు రాజీనామా దాఖలు చేసేలాగున వుండెనా, నేను బహుదినములనుంచి కాలేజిలో సరటఫికెట్టు సంపాదించుకోవలెనని అక్కడనే కనిపెట్టి తమ దయను కూడా అనుసరించుకుని వున్నాను. ఆ యిలాకా రిడక్షన్‌లో పని పోయినందున— అక్కడ తిరిగి వకటి ఖాలి అయితే నాకు యిత్తురనే అభిప్రాయంతో— జీవనానికి గడియక నానా శ్రమపడుతూ యీ నీలగిరికిన్ని వచ్చి దేహానికి సరిపడకవున్నా నేను చదువుచెప్పే దొరలకు నావల్ల విఘాతం లేకుండా వారి దయకున్ను పాత్రుణ్ని కావలెనని వున్నాను.

అయితె యిదివర్కు నా గ్రహచారసామాన్యంవల్ల అనేక పనులు ఖాలి అయినా వకటైనా నాకు దొరకకపోవడం తమ చిత్తానికే విశదం అయివుండడం చేత నేను విస్తరించి వ్రాసుకోలేదు. యీ విశ్వంభరశాస్త్రుల సరటఫికేట్టు నాకు దయచేసి నన్ను పరిక్షచెయ్యవలెనని తమ అభిప్రాయం వుంటె— అది అయ్యేవరకు ఆ పని వకరికిన్ని యివ్వక నిలిపిపెట్టవలెననిన్ని, నేను వచ్చిన మీదట నన్ను తమరు పరీక్షచేసి తరువాతనైనా నాకు ఆ పని ఖాయంగా చేసి యివ్వవలెనని ప్రార్థిస్తున్నాను.

మరిన్ని యిక్కడికి వచ్చిన మునిషీలు దొరలకు చదువు సాగక మునుపె వారి చదువుకు విచ్చిత్తు కలగచేసి తిరిగి పట్నం లేచిపోతూ వుండినా, నేనుమాత్రం అన్ని కష్టములకు లోబడి వారి చదువుకు అటంకం లేకుండా సాగించవలెననిన్ని అట్లా లేచివస్తె తమ చిత్తానకు యెక్కడ కోపం వస్తుందొ అనే భయంచేత యిక్కడనే వున్నాను. అయితె యీ సమయంలొ నేను అక్కడ లేనందున ఆ ఖాలి అయ్యే సరటఫకెట్టు యవరికైనా యిస్తా రేమో అని నిండా భయంగా వున్నది. నాకు ఆ భయం లేకుండా నన్ను కాపాడవలశిన భారకులు తమరె గనక విన్నపం వ్రాసుకున్నాను.

మరిన్ని నేను నా కొలువు సమగ్రంగా చేసి పేరు తెచ్చుకోవలెనని వున్నందున యీ కొండమీద మంచు— చలిచేత యెన్ని కష్టములు సంభవించినా అవి అన్ని వోర్చుకొని యిక్కడనే వున్నాను. వకవేళ నేను యిప్పుడే రావలశినట్టున్ను అట్లా రాకపోతె పని దొరకదు అని వున్నట్టు అయితె యిప్పుడె రావలెను. అరణ్యమధ్యలో వున్నందున యేమి తోచక వున్నాను. మెట్టుకు

అ సరటఫకేటు నాకు వకటి దయచేసి నన్ను యట్లా ముందుకు తేవలెనో అట్లా తెచ్చి ఆజ్ఞయె చొ॥ దయచేయిస్తె ఆ చొప్పున నడుచుకొంటున్నానుగాని నా స్వతంత్రంమీద వకటిన్ని చేయను. యిందున గురించి కాలేజిలో అర్జి యిచ్చేలాగ్ను వక అర్జి నా తమ్ముడైన మల్లయ దగ్గిరికి అంపిస్తున్నాను. గనక ముందుగా తమకు విన్నపం వ్రాసుకున్నాను. చిత్తగించవలెను.

యిదే అనేక సలాములు.

1847 జనవరి 9 తేది. —బేతపూడి సుందరరాయుడు*

* * *

బహుశా దొరలు ఆ దినాలలో ఎండలు భరించలేక నీలగిరిలో మకాంపెట్టి బేతపూడి వంటి మున్షీలచేత తెలుగు పాఠాలు చెప్పించుకొనేవారేమో. ఆలా తెలుగు చదువుకున్న దొరలను పరీక్షించి, వారి పాండిత్యాన్ని తూచి విలువ కట్టాల్సిన ఎగ్జామినర్ బ్రౌన్ కావడం, కాలేజీ తెలుగు మున్షీలలో విశ్వంభరశాస్త్రి రాజీనామా యిచ్చారని తెలిసి, ఆ కాళీలో తనను వేసుకోవల్సిందిగా బ్రౌన్‌ను ప్రార్థించడం— వీటినిబట్టి చూస్తే అప్పట్లో బ్రౌన్‌కున్న స్థానాన్నీ పలుకుబడినీ వూహించుకోవచ్చు.

ఇక్కడ గమనించవలసిన ముఖ్యమైన విషయం— బేతపూడి సుందరరాయడు దొరలకు తెలుగు పాఠాలు చెప్పిన తీరు. "అర్జీలమీదనే పాటు చేయిస్తున్నాను.... ....తెలుగులో అర్జీలు చదవగలరు.... తర్జుమా సుమారుగా చెయ్యగలరు.... అర్థగ్రాహ్యం చేసుకోగలరు.... మాటలు కూడా సుమారుగా మాటాడగలరు ..." ఏమిటీ అర్జీలు? వీటిమీద దొరలచేత పాటుచేయిస్తూ బేతపూడివారు తెలుగు పాఠాలు చెప్పిన తీరేమిటి?

ఈ సందర్భంలో ఈయన వ్రాసిన "నీలగిరి చరిత్ర"ను ఇక్కడ ప్రస్తావించవలసి వుంది. ఈ పుస్తకం 1864 లో అచ్చయిందని డాక్టర్ కొత్తపల్లి వీరభద్రరావు "తెలుగు సాహిత్యంపై ఇంగ్లీషు ప్రభావం" అనే తన థీసిస్ గ్రంథంలో పేర్కొన్నారు. ఈ "నీలగిరి చరిత్ర" చూచే యోగం నాకింకా కలగలేదుగానీ, ఈ జాబులో ప్రస్తావించబడిన విషయాల దృష్ట్యా డాక్టర్ రావు తన గ్రంథంలో పేర్కొన్న కొన్ని భాగాలను ఇక్కడ పరిశీలించడం అవసరం. ఏనుగుల వీరాస్వామయ్య "కాశీయాత్ర

---

* మద్రాసు ఓరియంటల్ మేనుస్క్రిప్ట్స్ లైబ్రరీలోని బ్రౌన్ జాబుల సంపుటం ఎమ్. 420, పేజీలు 282-85.

చరిత్ర"లాగా అంత ప్రఖ్యాతిలోకి రాలేదుగానీ ఇది అంత తీసివేయదగ్గదిగా కనపడ్డం లేదు. కోలా శేషాచలకవి నీలగిరియాత్ర వేరు, ఇది వేరు.

ఈ "నీలగిరి చరిత్ర"లో నీలగిరి యాత్రా ప్రయాణాది వృత్తాంతాలే గాకుండా, రెండోభాగంలో కలగూరగంపలాగా 'అర్జీలు', 'కాలేజి వృత్తాంతం', 'పొగబండి'— ఇత్యాది ప్రకరణాలు కూడా వున్నాయి. ఇందులో మళ్ళీ ఈ అర్జీల అధ్యాయాన్ని రెవిన్యూ అండ్ మేజిస్ట్రేట్ డిపార్టుమెంట్, జుడీషియల్ డిపార్టుమెంట్, పబ్లిక్ వర్క్స్ డిపార్టుమెంట్, మిలిటరీ డిపార్టుమెంట్ అనే నాలుగు శీర్షికలుగా విభజించి నట్లున్నది. ఆయా శాఖలలోని కింది వుద్యోగులు పరిపాలనా విషయాలపరంగా పైవారికి తెలుగులో పెట్టుకొన్న అర్జీలు వివిధ జిల్లాలనుంచి సేకరించి బేతపూడి ఈ అధ్యాయంలో ప్రకటించాడు. చెప్పదలచుకొన్నవాటిని సూటిగా డొంకతిరుగుళ్ళు లేకుండా అనవసర ప్రకర్షల జోలికి పోకుండా నేరుగా తేలికైన భాషలో లౌకిక ధోరణిలో వ్రాసుకున్న అర్జీలు కాబట్టి వీటి ప్రాతిపదికపై తెలుగు పాఠాలు చెప్పడం సులభమని తోచివుండాలి. దొరల భాషాధ్యయనం కూడా పరిపాలనా విషయాలవరకే పరిమితమైంది గనుక ఈ అర్జీల ఆధారమే శరణ్యమై వుండాలి.

అప్పటికి తెలుగు రీడర్లలో ఈ అర్జీల ప్రకరణ మొకటి విధిగా వుండేవంటే, భాషాబోధన విషయంలో అప్పట్లో వీటి ప్రాధాన్యాన్ని మనం వూహించుకోవచ్చు. అప్పటి తెలుగు రీడర్లు ఎట్లా వుండేవి? వాటి స్వరూప స్వభావాల గురించి టూకీగా నైనా ఈ ఘట్టంలో చెప్పుకోకుండా వుండలేం. మొదట మొదట విదేశీయులకు మన భాషలు చెప్పడానికి ఎన్నెన్ని ఇబ్బందులు పడ్డారోగానీ క్రమక్రమంగా కొన్ని పద్ధతులు కనిపెట్టారు. పరాయి దేశాలవారికి తెలుగు భాష బోధించే కిటుకులు తెలిసివచ్చాయి. గ్రామర్లు, గ్లాజరీలు, రీడర్లు—ఇట్లా కొన్ని సాధనాలు వచ్చాయి. తెలుగు ఏదో నేర్చు కోవాలని వచ్చే ఇంగ్లీషువాళ్ళను దృష్టిలో పెట్టుకొని వ్రాసినవే గనుక వాటి పరిమితిని మనం గుర్తుంచుకోవాలి.

సి. పి. బ్రౌన్‌కి కాస్త ముందువాడైన విలియం బ్రౌన్ (William Brown, 1765?-1837) తెలుగు వ్యాకరణ రచన 1810 లోనే జరిగినా 1817 లోగానీ ఆయన జెంటూ గ్రామర్ ముద్రణకు నోచుకోలేదు. 1818 లో ఈ విలియం బ్రౌన్‌దే తెలుగు-ఇంగ్లీషు నిఘంటువు వచ్చింది. 1816లో ఎ. డి. కాంబెల్ తెలుగు వ్యాకరణం విడుద లైంది. దీనికి కాస్త ముందు జె. మ్యాక్రెల్ (J. M' Kerrell, 1786?-1835) 'తెలుగు వకాబ్యులరీ' వచ్చింది. వీటన్నిటికంటే ముందు 1814లో విలియం క్యారీ (William

Carey, 1761-1834) 'తెలింగ వ్యాకరణం' కలకత్తా (సిరాంపూర్)లో ముద్రణైంది. 1819లో రావిపాటి గురుమూర్తిశాస్త్రి విక్రమార్క కథలు, ఆ తర్వాత 1821లో కాంబెల్ తెలుగు-ఇంగ్లీషు నిఘంటువూ వచ్చాయి. ఇన్ని వచ్చినా బోధనాదృష్టితో తెలుగులో 'గ్రేడెడ్'గా పకడ్బందీగా పాఠాలు చెప్పే రీడర్లు అవసరమయ్యాయి. ఈ అవసరాన్ని బాగా గుర్తెరిగినవాడు కాబట్టే జె. సి. మారిస్ (J. C. Morris, 1798-1858) 'టెలుగూ సెలక్షన్స్' (Teloogoo Selections) అనే గ్రంథాన్ని 1823లో ప్రకటించాడు. విదేశస్థులను దృష్టిలో పెట్టుకొని వచ్చిన మొదటి 'తెలుగు రీడర్' బహుశా ఇదేననవచ్చు.

ఇంకా పూర్వానికి వెళ్ళి చెప్పాలంటే, దీనికి దాదాపు 80 ఏళ్ళ క్రితం బెంజమిన్ షూల్జ్ జర్మనీలో అచ్చువేయించిన బైబిల్ సంబంధమైన తెలుగు తర్జుమాలుగాక, మరి రెండుమూడు తెలుగు శిక్షా గ్రంథాలను ఈ శ్రేణిలో చేర్చవలసివుంది.

ఒకటి : "Conspectus Litteraturae Telugicae Vulgo Warugicae ..." అనే గ్రంథంలో తెలుగు అక్షరాలు, గుణింతాలు, వత్తులతోసహా మొత్తం తెలుగు వర్ణమాలనంతటినీ సాక్షాత్తు తెలుగు లిపిలో ముద్రించి కిందివరసలో రోమన్ లిపిలో కూడా అచ్చువేయించాడు. 12 పేజీల చిన్న పుస్తకం ఇది.* తెలుగుకు సంబంధించినంతవరకు అప్పట్లో పాశ్చాత్యులకు ఇదొక చిన్న సైజు 'పెద్దబాలశిక్ష'. క్రైస్తవ మత ప్రచారానికని దక్షిణ భారతానికి వచ్చే యూరోపియన్లకు తెలుగు భాషనూ లిపినీ తెలివిడి చేద్దామనే వుద్దేశంతో షూల్జ్ తెలుగు రీడర్‌వంటి ఈ సెక్యులర్ గ్రంథాన్ని 1747లో హాలే (జర్మనీ)లో ప్రకటించాడు.

రెండు : 1755లో ఆయనే మరొక గ్రంథాన్ని ప్రకటించాడు. పెద్ద పేరుగల ఈ చిన్న పుస్తకానికి సంక్షిప్త నామధేయం "తర్టీ ఫెమిలియర్ డైలాగ్స్". ఈ దేశానికి వచ్చే విదేశస్థులకు సహాయకారిగా వుండేలాగా సేవకులు, వంటవాళ్లు, ధోబీ, అంగటివాడు వగైరాలతో ఎట్లా మాట్లాడాలో తెలుపుతూ సంభాషణాధోరణిలో వున్న పుస్తకమిది. కాను, వడ్లు (Paddy) వగైరా శబ్దాలకు ఈ పుస్తకం మొదట్లోనే అర్థ వివరణలిచ్చాడు. ఇది మొదట తెలుగులో వ్రాసివుంటే దాన్ని ఇంగ్లీసులోకి తర్జుమాచేసి ప్రకటించాడు. విదేశీ భాషలోకి అనూదితమైన మొదటి తెలుగు పుస్తకం ఇదేనేమో.

*చూడు : Book Printing in India with special reference to the contribution of European Scholors to Telugu (1746-1857), Dr. J. Mangamma, Nellore, 1975, Pp. 8-11, 125.

మూడు: "The Symphona Symphona sive Undecim Lingvaram Orientalism..." అనే పదాల పట్టికవంటి డిక్షనరీ పుస్తకం జర్మనీనుంచి 1782లో అమరకోశం వచనబాణీలో వెలువడింది. పదకొండు భారతీయ భాషల్లో రకరకాల పదజాలాన్ని రోమన్ లిపిలో ఇవ్వడం జరిగింది. వీటిలో తెలుగు కూడా ఒకటి, తెలుగులో మిడిమిడి జ్ఞానాన్నయినా సంపాదించుకోవాలనుకున్న పాశ్చాత్యులకు అప్పట్లో ఇవే శరణ్యం. వాళ్లు ఇవి చదివే తెలుగులో 'ప్రవీణులు' అవుతూ వచ్చారన్న మాట. ఈ 'ముడి' రీడర్లవంటి తొలి మూడు పుస్తకాల్ని వదిలి చూస్తే, మారిస్ రూపొందించిన 'తెలుగు సెలక్షన్స్' మాత్రమే మొదటి తెలుగు రీడర్ అవుతుంది. ఇతర ఆధారాలు లభించేదాకా మారిస్‌కే ఆ పట్టం కడదాం.

మారిస్ తెలుగు సెలక్షన్స్‌లో మొత్తం నాలుగు భాగాలున్నాయి. మొదటి భాగంలో 'టేల్స్' (కథలు). మొదట 5, 6 వాక్యాలలో ముగిసే కథలతో ప్రారంభమై, ఆ తర్వాత 10, 15 వాక్యాలు, ఇంకా పోనుపోను ఒకటిరెండు పేజీల కథలున్నాయి. వీటన్నిటికీ ఇంగ్లీషు తర్జుమాలు, ప్రతి కథలో వచ్చే పదాలకు అర్థాలు, వాటి తాలూకు వ్యాకరణాత్మక వివరణలు—ఇట్లా ఇచ్చుకొంటూపోయాడు మారిస్. రెండో భాగంలో కచ్చేరీ పేపర్స్. అంటే అర్జీలు, జాబులు. వీటికి తర్జుమాలు, అర్థవివరణలు వున్నాయి. 'డైలాగ్స్' అనేది మూడో భాగం. ఇందులో సంభాషణాత్మక వాక్యాలు. వాటికి అర్థాలు, వివరణలు. ఆ తర్వాత ఆఖర్లో నాలుగో భాగంలో అకారాదిక్రమంలో రెవిన్యూ పదాల జాబితా, వాటికి అర్థాలు. ఇదీ స్థూలంగా ఈ మారిస్ తెలుగు రీడర్ ప్రణాళిక. ఈ తెలుగు సెలక్షన్స్‌లో అర్జీల విభాగం అంటూ ఒకటి ప్రత్యేకంగా వుండడం గమనించతగింది.

1832లో వచ్చిన జె. నికలస్ (J. Nicholas) ప్రకటించిన 'తెలుగు వకాబ్యులరీ' గ్రంథంలో ఎక్కువగా పదాలు అర్థాలు, సంభాషణలు, వాటికి మొరటు తర్జుమాలు వున్నాయి కానీ అర్జీలు లేవు.

ఇక ఆ తర్వాత 1852లో వచ్చిన సి. పి. బ్రౌన్ "తెలుగు రీడర్"నిండా అర్జీలు, జాబులే. అది ప్రధానంగా జాబులు అర్జీలు ఆధారం చేసుకొని వ్రాసిన రీడరే. మొదటి సంపుటంలో మొదటి 33 పేజీల్లో సంభాషణలు, చిన్నచిన్న కథలు, ఆ తర్వాత 205 పేజీవరకూ అర్జీలే (లెటర్స్ ఆన్ పోలీస్ అఫేర్స్, రెవిన్యూ పేపర్స్). రెండో సంపుటిలో వీటన్నిటికీ ఇంగ్లీషు తర్జుమాలు, వివరణలు, మూడో సంపుటంలో వ్యాకరణ విశేషాలు, తదితర వివరణలు (గ్రెమాటికల్ ఎనాలిసిస్). నాలుగో

సంపుటంలో పదాలు, అర్థాలు. లిటిల్ లెక్సికన్ అని పేరుపెట్టాడు. ఇదీ బ్రౌన్ 'తెలుగు రీడర్' ప్రణాళిక.

ఈ తెలుగు రీడర్ల రకంలో చేరదగిన బ్రౌన్‌వే మరో రెండు గ్రంథాలున్నాయి. "తెలుగు అండ్ ఇంగ్లీష్ డైలాగ్స్ విత్ గ్రెమాటికల్ ఎనాలిసిస్". మొదటి ముద్రణ ఎప్పుడు వచ్చిందోగానీ 1853లో రెండో ఎడిషన్ వెలువడింది. సంభాషణల ప్రాతిపదికపై సాగే భాషాధ్యయన రీతి ఇందులో కనపడ్తుంది. తమిళం, కన్నడంలోకి కూడా దీని తర్జుమాలు వచ్చాయి. రెండో ఎడిషన్‌కు రెండే రెండు వాక్యాలతో బ్రౌన్ ఒక చిన్న పీఠిక కూడా వ్రాశాడు : "These dialogues having been found useful by beginners are now reprinted with a grammatical analysis, explaining the Telugu phraseology. The same work has also been printed in Tamil and in Kannadi." ఇండియా వదిలి వెళ్ళిన తర్వాత లండన్ యూనివర్సిటీలో బ్రౌన్ తెలుగు ప్రొఫెసర్ అయినప్పుడు, తెలుగు కోర్సును రూపొందిస్తూ జూనియర్ తరగతికి సూచించిన మొదటి పుస్తకం ఈ డైలాగ్స్.

ఇట్లాగే మరొకటి : వాక్యావళి (Vakyavali) అనే పుస్తకం. ఒక క్రమంలో వర్గీకరింపబడిన ఇంగ్లీషు గ్రామర్ పాఠాల ఆధారంతో జె. డి. పియర్సన్ (J. D. Pearson) అనే ఆయన బెంగాలీలో రూపొందించిన 'బాక్యబోలి' అనే పుస్తకాన్ని నమూనాగా తీసుకొని దాని బాణీలోనే తెలుగు, ఇంగ్లీషు వాక్య నిర్మాణ రీతుల్ని సూచిస్తూ బ్రౌన్ 1852లో సంతరించిన గ్రంథమిది. ఈ 'వాక్యావళి'ని లండన్ యూనివర్సిటీలో తెలుగు నేర్చుకొనే పై తరగతి విద్యార్థులకు పాఠ్య గ్రంథంగా సూచించాడు బ్రౌన్. తమిళం, 'దక్కనీ హిందూస్థానీ'ల్లో కూడా దీని తర్జుమాలు వచ్చాయి. (చూడు : ప్రక్క పేజీల్లో ఛాయాచిత్రం.)

ఇక ముద్రణకు నోచుకోకుండా మద్రాసు ఓరియంటల్ మేనుస్క్రిప్ట్స్ లైబ్రరీలో బ్రౌన్ సేకరించిపెట్టిపోయిన ఈ అర్జీలు జాబుల సంపుటాలు 16 వున్నాయి. ఇవిగాక మరో అయిదు సంపుటాల నిండా జాబులే. ఇంతేగాక డిక్షనరీ నోట్సు వగైరా సంపుటాలలో కూడా మరికొన్ని జాబులున్నాయి. బ్రౌన్ తన కాలంలో వచ్చిన తెలుగు పత్రికల్లోని సంపాదక లేఖలు, వార్తలు విశేషాలను మధ్యమధ్య తన కామెంట్స్‌తోసహా ఈ సంపుటాల్లో కాపీ చేయించిపెట్టాడు. ఇప్పుడు ఈ గ్రంథంలో ఇచ్చిన లేఖలు ఈ సంపుటాలలోనుంచి ఎరినవే.

ఒక జాబుల సంపుటంలో బ్రౌన్ స్వయంగా మొదటి పేజీలో ఇట్లా వ్రాసి పెట్టిపోయాడు. "A collection of Telugu letters, stories etc., for the use of students prepared in the year 1839". ఎమ్. 411 సంపుటిలో ఈ జాబుల్ని గురించి ఇట్లా వ్రాశాడు: "Prepared for the students' Miscellany బాలబోధ to be printed in monthly parts at a rupee per number". ఇట్లా ఈ జాబుల్ని ఆధారం చేసుకొని బ్రౌన్ ఏమేమో చేయాలనుకొన్నాడు మరి.

బ్రౌన్ రీడర్ల తర్వాత, తెలుగు నేర్చుకొనే ఇంగ్లీషువాళ్ళ సౌకర్యార్థమై "A collectin of Official Documents in the Telugu Language consisting Urgees and other papers filed in the Courts of Justice" అనే పేరుతో 1868లో ఏకంగా ఒక అర్జీల పుస్తకమే వచ్చింది. దీని ముద్రణ కూడా ఒక విశేషమే. అచ్చం తెలుగు వ్రాతలిపిలో మొత్తం లిథోగ్రాఫ్‌లో ముద్రణైంది. వివిధ జిల్లాల కలెక్టర్లు, జడ్జీల దగ్గరనుంచి సేకరించిన అర్జీలను సంకలనం చేశారు ఈ గ్రంథంలో. మళ్ళీ ఈ తెలుగు అర్జీలన్నిటికీ ఇంగ్లీషు అనువాదాలను కూడా వేరే సంపుటిగా ప్రభుత్వంవారే ముద్రించినట్లున్నారు.* అప్పటి మద్రాసు ప్రభుత్వ తెలుగు ట్రాన్స్‌లేటర్ మేజర్ టి. జి. ఎమ్. లేన్ (Major T. G. M. Lane) ఈ గ్రంథానికి సంకలనకర్త.

దీని తర్వాత పేర్కొనవలసింది ఎ. హెచ్. ఆర్డెన్ (A. H. Arden) 1879లో ప్రకటించిన A Companion to Telugu Reader మరొక ఉత్తమ శ్రేణి రీడర్. 1870లో ఆర్డెన్ వ్రాసిన 'ప్రొగ్రెసివ్ గ్రామర్ ఆఫ్ తెలుగు'కు అనుబంధంగా పై రీడర్ను ప్రకటించాడు. ఇందులో జాబులు బహుకొద్ది మాత్రమే. 19 శతాబ్దిలో తెలుగు భాషాబోధనకు సాధనాలుగా ఉపయోగపడిన రీడర్లు, రీడర్లవంటి రచనల స్థూలసమీక్ష మాత్రమే ఇది. న్యూఢిల్లీ నేషనల్ ఆర్కైవ్స్‌వారు 1957లో కొన్ని 19 శతాబ్ది తెలుగు అర్జీలను ఆచార్య గంటిజోగి సోమయాజి సంపాదకత్వాన వెలువరించారు. ఇట్లా ఈ అర్జీలు, జాబులు ఒక సారస్వత శాఖగా కొంతకాలంపాటు 'రాజ్యం' చేశాయి.

---

* అరవంలో కూడా సరిగ్గా ఇదే కాలంలో అప్పటి మద్రాసు తమిళ ట్రాన్స్‌లేటర్ ఇట్లాటి తమిళ అర్జీలను ప్రకటించడమేగాక వేరేగా ఇంగ్లీషు తర్జుమాను కూడా ప్రకటించివున్నారు గనుక తెలుగులో కూడా ఇట్లా జరిగుండాలని వూహిస్తున్నాను.

ఇటీవల భాషాశాస్త్రం (Linguistics) ఒక కొత్త విజ్ఞాన శాఖగా ఆవిర్భవించింది గాబట్టి ఈ అర్జీల ఆధారంతోగాక, వేరే ప్రాతిపదికలపై విదేశీయులకు తెలుగు బోధించే రీడర్లు వచ్చాయి, వస్తున్నాయి. అధునాతనమైన శాస్త్రీయ పంథాలో తెలుగు 'టీచింగ్ మెటీరియల్స్' వస్తున్నాయి. తెలుగేతరులకు తెలుగు బోధించే ప్రణాళికతో Leigh Lisker అనే ఆయన "ఎన్ ఇంట్రడక్షన్ టు స్పోకెన్ తెలుగు" అనే గ్రంథాన్ని 1962లో ప్రకటించాడు. ఇందులో కొత్తగా భాష నేర్చుకొనేవారికి సన్నివేశగతమైన వ్యవహారజ్ఞానం అవసరమవుతుందనే దృక్పథంతో పాఠాల విభజన కనపడుతుంది.

విస్కాన్సిన్ విశ్వవిద్యాలయంలో అమెరికన్ విద్యార్థులకు తెలుగు బోధించవలసి వచ్చినపుడు ప్రొఫెసర్ జి. యన్. రెడ్డి, డ్యామ్ యమ్. మేట్సన్ (Dam M. Matson) అనే ఆయనతో కలిసి రెండురకాల రీడర్లు రూపొందించారు. ఒకటి; సమకాలిక తెలుగు వార్తాపత్రికల్లోనుంచి ఏర్చికూర్చిన వివిధరకాల వార్తలు, ప్రకటనలతో కూడిన రీడర్ ("గ్రేడెడ్ రీడింగ్స్ ఇన్ న్యూస్‌పేపర్ తెలుగు"). రెండు: ఆధునిక తెలుగు కల్పనా సాహిత్యంలో కొన్ని కథానికలు, నాటికలతో కూడిన సంకలనం ("గ్రేడెడ్ రీడింగ్స్ ఇన్ మాడ్రన్ లిటరరీ తెలుగు"). విద్యార్థులకు స్వయంసహాయంగా వుండేలాగున ఈ రెండింటికీ విడివిడిగా గ్లాజరీలు రూపొందించారు. ఈ గ్లాజరీల్లో కేవలం పదాలు, అర్థాలు, వివరణలే గాకుండా వ్యాకరణ విశేషాలు, నుడికారపు విశదీకరణలూ చేర్చారు. 1966 లో మొదట ఈ రీడర్లు, గ్లాజరీలు మిమియోగ్రాఫ్ ప్రతులుగా విడుదలయ్యాయి. తర్వాత 1967 లో రెండవది మాత్రం ముద్రణ ప్రతులుగా కూడా వచ్చింది.

ఇక మరో ఫక్కీలో అధునాతన భాషాశాస్త్రరీత్యా ప్రొఫెసర్ బిహెచ్. కృష్ణమూర్తి, పి. శివానందశర్మ కలిసి "ఎ బేసిక్ కోర్స్ ఇన్ మాడ్రన్ తెలుగు" అనే గ్రంథాన్ని 1968 లో ప్రకటించారు. ఇందులో పాఠాలను క్లిష్టతాక్రమంలో రూపొందించడం, వాక్యనిర్మాణ రీతుల్ని ఆ క్రమంలోనే ప్రవేశపెట్టడం, ప్రతి బోధనా విభాగం కింద విరివిగా వ్యాకరణ వివరణ ఇవ్వడం కనిపిస్తుంది. ఒకవిధంగా బోధనానుభవపూర్వకమైన రచన ఇది.

కేరళ యూనివర్సిటీవారు శ్రీ ఎన్. శివరామమూర్తి వ్రాసిన (వి. ఐ. సుబ్రమణ్యం సమకూర్చిన పద్ధతిలో) "ఇంటెన్సివ్ కోర్సు ఇన్ తెలుగు" అనే పుస్తకాన్ని ప్రకటించారు 1971 లో. ఇది సజాతీయభాషల్లో భాషాబోధన (cognate method)

అనే ప్రణాళిక ఆధారంగా రచించారు. అంటే తమిళ, కన్నడ, మళయాళభాషల్లోనూ ఈ పద్ధతి ఇంటెన్సివ్ కోర్సులు ప్రచురించారు. రచన ఇంగ్లీషులో వున్నా, ప్రణాళిక దృష్ట్యా ఇది ద్రావిడ భాషావ్యవహర్తల పరస్పర భాషార్జనకు అనువుగా రూపొందించినదని చెప్పవచ్చు. ఇంతకుపూర్వం వచ్చినవి ఇతర ద్రావిడభాషలవారికి కూడా పనికివచ్చినా, అవి ప్రధానంగా విదేశస్థుల కోసం రచించారని చెప్పవచ్చు. శ్రీ పి. ఎస్. సుబ్రహ్మణ్యం వ్రాసిన "ఎన్ ఇంట్రడక్షన్ టు మాడ్రన్ తెలుగు" అనే గ్రంథాన్ని 1975 లో అన్నామలై యూనివర్సిటీ ప్రకటించింది. ఇదీ బోధనాను పూర్వకమైన రచనే. ముఖ్యంగా తమిళభాషావ్యవహర్తలకు తెలుగు నేర్పడానికి రూపొందించిన ప్రణాళికలో కుదిర్చిన పాఠాలున్న రచన.

జె. వెంకటేశ్వరశాస్త్రి, ఎన్. డి. కృష్ణమూర్తిగారలు కలిసి 1975 లో "కాన్వర్సేషనల్ తెలుగు: మైక్రోవేవ్ అప్రోచ్" అనే గ్రంథాన్ని ప్రకటించారు. పేరులో కొత్తదనమున్నా, ఇది చాలావరకు బిహెచ్. కృష్ణమూర్తిగారి గ్రంథాన్నే అనుసరించిందని చెప్పవచ్చు. అదనంగా సాధన (drill)కు వీలుగా విరివిగా సాల్యాంశాల్ని కూర్చుకోవడం ఇందులో కనిపిస్తుంది. ఈ పద్ధతి ఇంత విస్తృతిలో గాక పోయినా పూర్వబోధనా గ్రంథాల్లోనూ లేకపోలేదు. ఇందులో 'మైక్రోవేవ్ అప్రోచ్' అని చెప్పబడుతున్న పద్ధతి శ్రీ ఎన్. డి. కృష్ణమూర్తి రూపొందించినది. జె. వెంకటేశ్వరశాస్త్రిగారే వ్రాసిన "తెలుగు ఫోనెటిక్ రీడర్"ను మైసూర్ సెంట్రల్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ ఇండియన్ లాంగ్వేజెస్‌వారు 1972 లో ప్రచురించారు. ఇలాంటి ఫోనెటిక్ రీడర్లు ఇతర భారతీయ భాషలకు కూడా ఆ సంస్థవారు రూపొందించి ప్రచురించారు.

ఎందరు భాషాశాస్త్రజ్ఞులు గమనించారోగానీ 1918 లోనే పి. ఎల్. ఎస్. వారు "A Manual of Telugu grammar and phonetics. Part 1. phonetics, Part 11. etymology" అనే గ్రంథాన్ని ప్రచురించారు. దీని రచయిత ఎవరో తెలియడంలేదు. కానీ ఒక మిషనరీ అయివుండాలని వూహించవచ్చు. మొదట పీఠికా ప్రాయంగా వ్రాసిన అధ్యాయంలో భాషార్జనకు సంబంధించిన సిద్ధాంతపరమైన వివరణ ఆలోచనాత్మకంగా సాగింది. 'ఫోనెటిక్స్' అధ్యాయంలో తెలుగుధ్వనుల ఉచ్చారణారీతుల్ని స్థాన, కరణ, ప్రయత్నభేదాల సహితంగా వివరించారు. ఈనాడు ధ్వన్యుచ్చారణశాస్త్రం (Articulatory phonetics) లో వాడే palatographic technique అనే పద్ధతిని ఆనాడే వుపయోగించి సచిత్రంగా విపులీకరించి algebric

notations తో సూత్రబద్ధం చేయడం జరిగింది. ఇది ఈ నాటికీ, ముఖ్యంగా తెలుగులో, అందుకోలేని ప్రామాణిక పద్ధతివలె గోచరిస్తున్నది. రెండోభాగం 'ఎటిమాలజీ' మామూలే.

ఇక ఆం. ప్ర. సా. అకాడమీవారు వెలువరించిన డాక్టర్ దివాకర్ల వెంకటావధాని గారి "తెలుగు ఇన్ తర్టీ డేస్" గురించి రెండు మాటలు. పైవన్నీ వ్యావహారిక తెలుగువి గనుక, గ్రాంథిక తెలుగు అనబడే తెలుగుది ఒక్కటీ లేదనే ఆవేదనతో కాబోలు దివాకర్లగారు దీని రచనకు గడంగినారు. మొదటి పేజీలోనే తారసిల్లే విడ్డూర పాఠం తిలకించండి. He అంటే 'వాడు' అన్నారు. మరి She అంటే? 'అది' అన్నారు. ఏదో విశుద్ధ తెలుగు 'సాహిత్య' భాషాపదంకదా అని విదేశీయుడెవడైనా She ని పట్టుకొని 'అది' అని (అందునా ఈ అంతర్జాతీయ మహిళా దశాబ్దిరోజులలో) అన్నాడంటే, పాపం అతను వెంటనే ఎదుర్కొనవలసి వచ్చే ప్రమాదాన్ని సులభంగా వూహించుకోవచ్చు. 'తల్లి కుమార్తెను విడుచుచున్నది'— Mothers are leaving the children (పేజీలు 22, 23). 'తమ్ముడు నన్ను పంటితో కరచెను' (పే. 38). 'నాన్నచే చాకలివానిచే బట్టలు ఉతికింపబడెను' (పే. 107). — ఇటువంటి పెక్కు వాక్యాలకు literary Telugu క్రింద చెలామణి కల్పించబూనడం, పైపెచ్చు ఆంధ్రేతరులకు నూరిపోయడం మన కావ్యభాషను కించపరచడమే కాగలదు. ఇదే పేరుతో ఇటీవల కొన్ని వ్యాపార సంస్థలు ప్రచురించిన రీడర్ పుస్తకాలు ఇంతకంటే ఎంతో మెరుగు.

బేతపూడివారు అర్జీలమీద 'పాటుచేయిస్తూ' దొరలకు తెలుగు బోధించడమనే విషయాన్ని తీసుకొని, ఇంతవరకూ వచ్చిన తెలుగు రీడర్ల గురించి ఇంతదూరం చర్చచేసుకోవలసి వచ్చింది.

ఇక అసలు విషయానికి పోదాం. బేతపూడి "నీలగిరి చరిత్ర"లో 'కాలేజీ వృత్తాంతం' శీర్షిక క్రింద ఈ కింది వాక్యాలు గమనించదగ్గవి:

"....నేను మచిలీపట్టణంనుంచి వచ్చి చెన్నపట్టణపు కాలేజియను పాఠశాల యందు ప్రవేశించి సంస్కృతము-తెలుగు-ఇంగిలీషు- యీ మూడుభాషలు అభ్యసించుటకై సర్కారువారివల్ల నెల కి రూ. 15 జీతముగల కల్కటరే టీచర్ పనిలో యేడు సంవత్సరములు వుండిటిని*— తరువాత గౌరన్మెంటు రిడక్షన్‌లో 1836

* అక్షరాలా నిజమని మద్రాసులోని తమిళనాడు ఆర్కివ్స్‌లోని 1829 జూలై 24 నాటి 11, 12 నెంబర్లుగల పబ్లిక్ కన్సల్టేషన్లు చెప్తున్నాయి.

సంవత్సరములో ఆ పని నిల్చినది— వెంటనే ఏ. డి. కేంబిల్ దొరగారి ప్రాపకమువల్ల కేపటన్ రాల్యాండ్సన్ దొర శక్రచేరిగా వుండేటప్పుడు తిరిగి కాలేజిలో ప్రవేశించి మునిషి పనులవల్ల జీవనము జరుపుకొంటూ— దొరల దగ్గర యోగ్యతా పత్రికలను పొందుతూ బహుకాలము జరిపినాను. ఇదిన్నిగాక యీ చెన్నపట్టణపు రాజధానికి వచ్చే సదరహి కాలేజిలోనే కొందరు మునిషీలవల్ల ఆ యా దేశభాషలు చదివి ఆదినుంచి తెలుగు పరీక్షాధికారులగు దొరలలో మహారాజేశ్రీ జాన్-మక్కెరల్, ఏ-డి-కాంబెల్, జె. సి. మారీసు, సి-పి-బ్రౌన్. జే-డి-సిం, కేప్టన్ జే-సి-మగ్దానల్ అనే దొరలవల్ల— వారి దగ్గర హిందువులలో పరంపరగా సన్నిధానవర్తులున్న ఇంగిలీషు సంస్కృతాంధ్ర బాషలయందు పూర్ణపండితులున్నగు—శ్రీ సైదాపేట మీనాక్షయ్య, రావిపాటి గురుమూర్తిశాస్త్రి, అడక్కి సుబ్బారావు, శ్రీపెరుంభూదూరు కృష్ణమాచార్యులు, రావిపాటి గురవయ్య వీరిద్వారా పరీక్షింపబడి...." ఈ వాక్యాలనుబట్టి అప్పటి కాలేజీ వ్యవహారాలను గూర్చి స్థూలంగానైనా కొంత తెలియవస్తున్నది.

బేతపూడి సుందరరాయడు తొలి తెలుగు జర్నలిస్టులలో ఒకడు కూడానా? శ్రీ నార్ల షష్ట్యబ్దపూర్తి సందర్భంలో వెలువరించిన "స్టడీస్ ఇన్ ది హిస్టరీ ఆఫ్ తెలుగు జర్నలిజం" అనే గ్రంథంలోని "బిగినింగ్స్ ఆఫ్ తెలుగు జర్నలిజం" అనే ఆరుద్రగారి వ్యాసంలో మొదటి తెలుగు పత్రిక (?) 'వృత్తాంతిని' (1838-41) గురించి వ్రాస్తూ—ఈ పత్రికలో వట్టి వార్తలే గాకుండా ఇటీవలి చరిత్రాంశాలు గూర్చి కూడా వ్రాసేశారు. ఫోర్టు సెంట్ జార్జి కాలేజీలో తెలుగు పండితులుగా వుండే బేతపూడి ఇందులో వ్రాసేవాడు— అని పేర్కొన్నారు. వృత్తాంతినికి వ్రాసేవాడా? వేటిని గురించి వ్రాసేవాడు? భావి పరిశోధకులు తేల్చవలసిన విషయమిది.

'వృత్తాంతిని' గిట్టిన తర్వాత 1842లో క్రొత్తగా వెలసిన 'వర్తమాన తరంగిణి' పత్రికలో వృత్తాంతిని మాజీ ఎడిటర్ మండిగల వెంకట్రాయశాస్త్రి 1842 డిసెంబర్ 8 తేదీ 'వర్తమాన తరంగిణి' సంచికలో సంపాదక లేఖ వ్రాస్తూ: "....మరిన్ని లోగడ నేను వృత్తాంతిని పత్రికకు ఎడిటరుగా నున్నప్పుడు 'నీలగిరి చరిత్ర'లో కొంత భాగమును సదరు పేపరులో ప్రచురపరచినంతట బహుమంది చందాదారులు అది అతిశయముగానున్ను మనోజ్ఞముగానున్ను వున్నదని మిక్కిలి

* తెలుగు సాహిత్యముపై ఇంగ్లీషు ప్రభావము, కొత్తపల్లి వీరభద్రరావు, సికింద్రాబాదు, 1960, పేజీ 209.

సంతోషముతో ఆ చరిత్ర అశేషంగా వేయించవలెనని చెప్పుకొనిరిగాని అప్పట్లో అది సమగ్రముగా ప్రచురపరచడము వల్లపడకపోయినది గనుక...." అని తెలియజేశాడు.

ఈ నీలగిరి చరిత్రేనా బేతపూడి నీలగిరి చరిత్ర? అవునని చెప్పడానికి తేదీల రీత్యా కొన్ని తేడాలు కనపడుతున్నవి గనుక ప్రస్తుతానికి ఈ ప్రశ్నల దగ్గరే ముగిద్దాం.

2

మహారాజశ్రీ చార్లెస్ ఫిలిప్ బ్రౌన్ దొరగారి సముఖమునకు ఆశ్రితుడు రావిపాటి గురుమూర్తిశాస్త్రి అనేకములయిన సలాములుచేసి వ్రాసుకొన్న విజ్ఞాపన పత్రిక.

ఈ లోపయినం తాము వ్రాయించి పంపించిన ఆజ్ఞాపత్రిక చేరి అందుల సంగతులు యావత్తున్ను విశదమాయెను.

అచ్చుల సంగతి గురించి తాము యిక్కడికి కొందరిని అంపించి జాగ్రత్త చేయిస్తామని వ్రాయించినారు గనుక చాలా సంతోషమయినది— పయిడిపాటి చివంబరరావు యిక్కడికి వచ్చివున్నాడని తమ పేరిట లోగడ మనవి వ్రాసుకొని వుంటినిగదా. ఆయనకు లాయరు సర్టఫకెట్టు అయినది. యీ సంగతి అయన యిదివరకే కంభంనుంచి తమ పేరిట వ్రాసుకొని వుండును గనుక చిత్తగించే వుందురు.

ఇటీవల తాము వ్రాయించి పంపించిన కొల్లా రాఘవశెట్టిగారి గుండా తెనుగు అక్షరాల స్పంజి మేతర్సు సీసము అక్కడికి తెప్పించుకొన్నట్టు సమాచారము విన్నాను. యిదివరకు సీసము కరిగి అక్షరాలు పూయించి వుందురుగదా. తమరు దిద్దించిన భారతము మొదలయిన తెలుగు గ్రంథములు అచ్చుపడి యెప్పుడు వచ్చునో అని నేనున్ను యింకా అనేకులున్ను యెదురు చూస్తూ వున్నాము— ముందుగా ఆదిపర్వము అచ్చువేయించేటట్టు చేస్తే అనేకులకు వుపయోగించునని తోస్తున్నది— తమరు అచ్చువేయించేడందుకు ఆరంభించిన సమాచారము వినగోరియున్నాను.

ఇప్పుడు మాకు బంధువుడున్ను, ఆప్తుడున్ను అయిన మద్దాలి వెంకట్రాచలం అనే ఆయన బందరులో ఏదైనా ఒక పని కావలెనని అపేక్షించి

సముఖానకు వచ్చినాడు. తమ కోర్టులో యేదైనా ఒక పని అనుకూల పరిచి యిప్పిస్తే తమ అనుగ్రహానికి పాత్రుడై కనిపెట్టుకొని వుంటాడు. ప్రస్తుతం తమ కోర్టులో పని తటస్థంకాని పక్షమందు కలక్టరు దొరగారితో యీయనను గురించి శిఫారసుచేసి కలక్టరు కచ్చేరీలోనైనా, తాలూకా కచ్చేర్లలోనయినా ఒక పని యిచ్చేటట్టు దయచేయించవలెనని మిక్కిలి ప్రార్థిస్తున్నాను.

పూర్వం శంకరశరభయ్య అనే అతనికి నా మనవిమీద తమ కోర్టులో లాయరుపని యిప్పించి సంరక్షిస్తున్నారు. తమరు ఆశ్రితులయందు నిండా పక్షం గలవారు. నేను తమ ముఖ్యాశ్రితులలో చేరినవాణ్ని గనక నాకు అవశ్యం కావలసిన పనిని గురించి మనవి వ్రాసుకున్నాను— యీయన బహుకుటుంబుడు గనక ఆ కుటుంబ సంరక్షణ మీగుండా కావలెనని ప్రార్థిస్తున్నాను. సర్వజ్ఞులకు విశేషించి వ్రాసుకోవలసినదేమి వున్నది— చిత్తగించి నేను నడుచుకోగలందులకు ఆజ్ఞాపత్రిక దయచేయించ కర్తలు.

జే॥ సీ॥ మారీసు దొరగారు సీమనుంచి వచ్చినారు. రాగానే బోర్డు ఆఫ్ రెవిన్యూలో సెక్రటేరిగా వున్నారు. యీ నెలలో గవర్నమెంటు తెలుగు ట్రాన్సులేటరు ఉద్యోగము కూడా అయినది. న్యూస్‌పేపర్లవల్ల యీ సంగతి తాము చిత్తగించే వుందురు. వారు ఇంకా కొన్ని కార్యములు కొత్తగా జరిగించ వలెనని ప్రయత్నపడుతూ వున్నారు. రూఢముగా తెలిసిన తర్వాత సముఖానకు వ్రాసికొంటున్నాను. చిత్తగించవలెను. యిదే అనేకములయిన విజ్ఞాపనములు. 1832 జనవరి 13, చెన్నపట్ణం.*

* * *

ఈ జాబులో ఒకముఖ్యమైన విషయం ప్రస్తావన కొచ్చింది. అచ్చుల విషయమై బ్రౌన్ కొందరు మనుషుల్ని మద్రాసుకు పంపించడం, తెలుగు అక్షరాల స్పంజి మేతర్సు సీసము తెప్పించుకోవడం, సీసం కరిగించి అక్షరాలు పోయించడం, మహా భారతం ఆదిపర్వం అచ్చువేయించేటట్లు చూడమనడం వగైరా ప్రస్తావనలు చూస్తుంటే బ్రౌన్ ఏమైనా సొంత ప్రెస్‌పెట్టి తెలుగు కావ్యాలు అచ్చువేయించాడా అనిపిస్తున్నది గదా. అనిపించడం ఏమిటి? అక్షరాలా అంతపనే చేసున్నాడు బ్రౌన్. ఈ విషయం

* మ.ఓ.మే.లై.లోని బ్రౌన్ జాబుల సంపుటం ఎమ్. 425, పేజీ 109.

గురించి మరెప్పుడైనా వివరంగా చర్చించుకొంటాం గనుక ప్రస్తుతానికి ఈ ప్రెస్ విషయం వదిలి మిగతా సంగతులు చూద్దాం.

ఈ జాబు వ్రాసిన రావిపాటి గురుమూర్తిశాస్త్రి గురించి చెప్పుకోవలసింది చాలా వుంది. నేను చూచినంతవరకు రావిపాటి పేరు ప్రభుత్వ రికార్డుల్లో నమోదై వున్నది 1819 సంవత్సరంలో. ఇంకా లోతుకు వెళ్ళి పరిశీలిస్తే మరింత పూర్వం కూడా ఆయన ప్రస్తావన కనపడే అవకాశం లేకపోలేదు. తమిళనాడు ఆర్కైవ్స్‌లో 1819 ఏప్రెల్ 28 తేదీనాటి 31, 32 నెంబర్ల పబ్లిక్ కన్సల్టేషన్లలోను మే నెల 15 నాటి 11 నెంబర్ కన్సల్టేషన్‌లోనూ రావిపాటి గురుమూర్తి (అని మాత్రమే వుంది, అప్పటికింకా 'శాస్త్రి' లేదు) ప్రస్తావన వుంది. ఆయన వ్రాసిన "విక్రమార్క కథలు" పుస్తకం కాపీలు ఇంగ్లాండుకు పంపించేందుకు ఆర్డర్ వేయడమూ, ఆయన జీతం పెంచడమేగాక, బంగారు కడియాల జత ఒకటి ఆయనకు బహూకరించడానికి కూడా ఆర్డర్ పడడమూ పై కన్సల్టేషన్లలో కనపడుతుంది. అప్పటికింకా ఆయన ఆ కాలేజిలో తెలుగుశాఖకు 'మాస్టర్' అని మాత్రమే వుంది. 'హెడ్' కాలేదు. (డెప్యూటీ తెలుగుమాస్టర్ అని విక్రమార్క కథల ముఖపత్రం చెప్తున్నది). 1836 తాలూకు ఒక కన్సల్టేషన్‌లో 'గురుమూర్తిశాస్త్రి' అనే ప్రస్తావన ఎదురవుతుంది. ఈ మధ్యకాలంలోనే రావిపాటికి శాస్త్రి బిరుదు వచ్చివుండాలి. ఈ పరిణామాన్ని గుర్తెరిగినవాడు కాబట్టే, వావిళ్ళవారు 1951 లో గురుమూర్తిశాస్త్రి తెలుగు వ్యాకరణాన్ని పునర్ముద్రించినప్పుడు వేదము లక్ష్మీనారాయణశాస్త్రి పీఠిక వ్రాస్తూ రావిపాటి వారు 'పెట్టుశాస్త్రి' గానీ 'పుట్టుశాస్త్రి' కాదు అన్నాడు.

శాఖా చంక్రమణం అనుకోకపోతే, ఇక్కడ ఒక సామ్యం గమనించాలి. ఇట్లాగే మొదట చిన్నయ్యగా ప్రారంభమై తర్వాత తర్వాత చిన్నయసూరిగా ప్రఖ్యాతి లోకి వచ్చిన సన్నివేశం గుర్తుకొస్తుంది. రావిపాటివారికి బంగారుకడియాలు బహూకరించినట్లుగానే చిన్నయసూరికి కూడా బంగారు కడియ బహూకరణం జరిగిందని కొందరు చెప్తున్నారు. దువ్వూరి వేంకటరమణశాస్త్రి "రమణీయము- బాలవ్యాకరణ సమీక్ష" గ్రంథంలో ఇట్లన్నాడు :

"....ఈతని (చిన్నయసూరి) పాండిత్యమునకును, బోధనాసక్తికిని, రచనా శక్తికిని నచ్చురపడి కళాశాలాధికారి యగు ఆర్బత్‌నాట్ దొర అంతకు మున్నున్న 'చిన్నయ' అను నామమునకు 'సూరి' అను బిరుదము చేర్చి 'చిన్నయసూరి' యను

నామాక్షరములు చెక్కబడిన బంగారు కడియమును సీమనుండి తెప్పించి యీతనికి పారితోషిక మొసంగి సన్మానించినాడట."*

ఈ 'అట'లతో దబాయించడం మన తెలుగుపండితులకు రివాజుగా వస్తున్న విద్య. నిజంగా చిన్నయసూరికి బంగారుకడియ బహూకరణం జరిగిందా అని ప్రభుత్వ రికార్డులకోసం బహుకాలంక్రితం శోధనచేశాను. నేను చూసిన మేరకు దాఖలా కనపళ్లేదు. కొందరు పండితులు బహుశా నేను అంత నిశితంగా వెతకలేదని ఆడిపోయ వచ్చుగానీ, దాఖలాలతో చర్చచేయడం మనవాళ్ళు ఎప్పుడు నేర్చుకొంటారా అని ప్రశ్నించక మానలేను.

ఇదే దువ్వూరి వేంకటరమణశాస్త్రి ఇదే రమణీయంలో "తాను (చిన్నయసూరి) గావించు పరిశోధనము సార్థకమగుటకు వాణీదర్పణమను ముద్రాక్షరశాలను నెలకొల్పి, సుజనరంజని యను మాసపత్రికను ముద్రించుచు, నందనేకవిధములగు వ్యాసములను గ్రంథములను బ్రకటించుచు భాషాసేవ యొనరించుచుండెడివాడు" అని వ్రాశాడు. ఇదొక శుద్ధ తప్పు.

1862 లో చనిపోయాడన్న చిన్నయసూరి 1865 లో వెలసిన 'సుజనరంజని' పత్రికను నడిపాడనడమేమిటి? 1865 జూన్‌లో వెలువడిన రెండవ సంచిక నుంచి 1866 జనవరి వరకు వచ్చిన సంచికలను చూచి చెప్తున్నమాట ఇది. దీనికి ముందు ఒక్క సంచికనైనా చిన్నయసూరి నడిపివుండవచ్చుగదా అంటే దాఖలా చూప మంటాను. పోనీ ఈ పత్రిక చి. సూ. వాణీదర్పణమనే ప్రెస్సులో అచ్చయ్యేదా అంటే అదీకాదు. ఈ పత్రికను అచ్చువేస్తుండినది 'చెన్నపట్టణము ఉత్తరపు గోవిందప్పనాయనివీధి 27 సంఖ్యగల యింట సుజనరంజనీ ముద్రాక్షరశాల'. అప్పటి 'యూనివర్సిటి పరీక్షా విద్యార్థుల కుపకారకంగా' భాషావిషయక పాఠ్యాంశాలకు సంబంధించిన గైడ్ మాదిరిగా వున్న ఈ పత్రికకు ఎడిటర్లు ("పత్రికా ప్రవర్తకులు") ముగ్గురు: వి. కృష్ణమాచార్యులు, బ. సీతారామాచార్యులు, కా. సుబ్బరాయలునాయడు.

'సుజనరంజని' పత్రికకు సంబంధించిన వాస్తవవిషయాలు ఇట్లుండగా, దానిని పట్టుకొని చి. సూ. కి అంటగట్టి ఇంత తప్పు వ్రాసిన వేంకటరమణశాస్త్రి, పైన చెప్పిన బంగారు కడియ బహూకరణ విషయంలో వ్రాసింది మాత్రం ఒప్పు ఎట్లవు

---

* అరసున్నలు బండిరాలు పరిహరించి 'కోట్' చేశానని పాఠకులు గమనించ ప్రార్థన.

తుందనే వితండవాదంకాదుగానీ ఇంతవరకు మనవాళ్ళు ఇట్లాంటివి చిలకపలుకుల్లా వల్లిస్తున్నారే తప్ప ఆధారాలు చూపి, దాఖలాలు చెప్పి వ్రాసిన మాటలుగా కనపడ్డం లేదని సవినయంగా మనవిచేస్తున్నాను. అంతే. శాస్త్రిని వదిలి సూరిని గూర్చి ఇంత దూరం చర్చించడం సబబుకాదు గనుక ఇక అసలు విషయానికి వస్తాం.

రావిపాటి గురుమూర్తిశాస్త్రి ఎప్పుడు పుట్టాడు? ఎప్పుడు మరణించాడు? అనే విషయాలుకూడా అసందిగ్ధంగానే వున్నాయి. పైన పేర్కొన్న వేదము లక్ష్మీనారాయణ శాస్త్రి రావిపాటి జీవితకాలం 1770—1836 అన్నాడు. నిడుదవోలు వెంకటరావు దీనికి 'డిటో' అంటూ 1770—1837 అని ఒక ఏడాది కలిపారు. జననకాలం ఇద్దరూ ఒకటిగానే పేర్కొన్నారు గనుక అది రైట్ అనుకోడానికి లేదుగానీ మరణకాలంలో మాత్రం తఫిసీలు కానవస్తున్నది ఇద్దరిమధ్యా. ఇంతకూ వీళ్ళ యీ వ్రాతలకు ఆధారం ఏమిటి? బ్రౌన్ ఒకచోట ఇట్లా వ్రాసిపెట్టిపోయాడు:

"That distinguished scholar, the late Head Telugu Examiner of the College, Gurumurthy Sastry, who died about three years ago fully concurred in the opinions given in the present Essay. I mention his name because, his talents, learning, and good sense always entitled his Judgement and respect."*

ఇది 1839 జూలై-డిసెంబరు సంచికల్లో (1840 లో కూడా) బ్రౌన్ పేర అచ్చుపడ్డ వ్యాసంలోది కాబట్టి, మూడేళ్ళక్రితం చనిపోయాడని వున్నది గనుక మూడేళ్ళు తీసేసి 1836 అన్నాడు వేదం లక్ష్మీనారాయణశాస్త్రి. ఈ వ్యాసం కొరవ భాగం మలిసంచికలో అచ్చయింది కాబట్టి కొసనుంచి మూడేళ్ళు తీసేసి 1837 అన్నారు నిడుదవోలు వేంకటరావుగారు. ఇట్లా ఊహాపోహల పోషాలింపు మాటలతో వ్రాస్తుంటారు మనవాళ్ళు ఆధారాలు చెప్పకుండా. ఫోర్ట్ సెంట్ జార్జి కాలేజిలో హెడ్ తెలుగు మాస్టర్‌గా రిటైరైన మీదట అప్పట్లో కడపజిల్లాలో చేరిన కదిరి డిస్ట్రిక్ట్ మున్సిఫ్‌గా రావిపాటికి ఒక కొత్త ఉద్యోగమిచ్చినట్లూ, ఆయన 'డ్రా' చేసిన 'గ్రాచుయిటీ' 'రీఫండ్' చేయమన్నట్లూ తమిళనాడు ఆర్కైవ్స్‌లో 1836 అక్టోబరు 25 తేదీనాటి 22, 23 నెంబర్ల పబ్లిక్ కన్సల్టేషన్లలో కనపడుతున్నది. అంటే కదిరి

---

*చూడు: The Madras Journal of Literature and Science, (Eds.) R. Cole and C. P. Brown, July–December 1839 (Vol. X), Madras, 1839; Essay on the Language and Literature of the Telugus by C. P. Brown, P. 58.

డిస్ట్రిక్ట్ మున్సిఫ్‌గా చేరిన మందట్లో లేదా చేరకముందేనో ఆయన మరణించాడా? ఇంతకంటే నిష్కర్ష అయిన తేదీ ఇవ్వాలంటే ఇంకా లోతుకు వెళ్ళి పరిశోధించవలసి వుంది. ఒకటిమాత్రం నిజం, గురుమూర్తిశాస్త్రి మరణం తర్వాత ఆయన కుమారుడు గురవయ్యకూడా ఈ కాలేజిలోనే ఉద్యోగంచేశాడు.

ఈ తేదీల గొడవ మాని ఇతర విషయాలు పరికిద్దాం. "ఇతడు (రావిపాటి) చెన్నపురి ఫోర్ట్ సెంట్ జార్జి కళాశాలయందు తొలుత క్రీ. శ. 1816 వ సంవత్సరమున నియమితుడయ్యెను. ఆ వెనుక క్రీ. శ. 1820 సం॥లో కళాశాల ప్రధానోపాధ్యాయులును ప్రఖ్యాత పండితులునగు శ్రీ వేదం పట్టాభిరామశాస్త్రిగారు దివంగతులగుటచే వారి స్థానమున నియమితుడై క్రీ.శ. 1836 వరకు పదునారు సంవత్సరములా స్థానము మహా సమర్థతతో నిర్వహించెను. కేవలము తెలుగుపండితుడు కళాశాల ప్రధానోపాధ్యాయత్వము వహించుట కిదియే మొదటిసారియు కడసారియునని చెప్పనొప్పును"—అని వేదము వ్రాత. ఇక్కడ "హెడ్ మాస్టర్, తెలుగు" (హెడ్ తెలుగు మాస్టర్) అంటే తెలుగుశాఖకు ప్రధానాధ్యాపకుడనేగానీ మొత్తం కళాశాలకు ప్రధానోపాధ్యాయుడని అర్థంకాదు. పట్టాభిరామశాస్త్రిగానీ, గురుమూర్తిశాస్త్రిగానీ మొత్తం కళాశాలకు ప్రధానోపాధ్యాయత్వం నెరపిన దాఖలా ఏదీ లేదు. మరి ప్రధానోపాధ్యాయుడెవడు? ఎవడో? భావిపరిశోధకులు తేల్చాలి.

గురుమూర్తిశాస్త్రిని గురించిన కొన్ని ముఖ్యమైన విషయాలు ఇంకా మిగిలే వున్నాయి. పంధొమ్మిదో శతాబ్ది ప్రారంభంలో తెలుగు సారస్వతరంగంలో ఒక వెలుగు వెలిగిన వ్యక్తి, ఆధునిక తెలుగు వచనరచనకు ప్రారంభకుడైన వ్యక్తి, ఒక విధంగా నేటి వ్యావహారిక వచనరచనకు అంకురార్పణ చేసిన వ్యక్తి ఇతడే. ఇప్పుడు మన స్కూలు పిల్లలు చదివే చిన్నయసూరి గ్రాంథిక 'నీతిచంద్రిక' రాకముందు అప్పటి తెలుగుబళ్ళలో గురుమూర్తిశాస్త్రి 'విక్రమార్కకథలు' (1819), 'పంచతంత్ర కథలు' (1834) ప్రచారంలోనూ ప్రాచుర్యంలోనూ వుంటూవచ్చాయి. ఇవి రెండూ కూడా 1860 లోపుగా నాలుగేసి ముద్రణలు పొందాయంటే వాటి ఖ్యాతిని గురించి వేరుగా చెప్ప పనిలేదు. చిన్నయసూరికూడా వీటినే పాఠం చెప్పాడు. అంతేగాక చిన్నయసూరి బాలవ్యాకరణంకంటే రెండు దశాబ్దులముందే 1836 లో ఈయన తెలుగు వ్యాకరణం కూడా ప్రచురించాడు.

గురుమూర్తిశాస్త్రి 1834 లో సులభమైన తెలుగులో వ్రాసిన పంచతంత్ర కథలను, ఉపాధ్యాయుడుగా కొన్నేళ్ళపాటు విద్యార్థులకు పాఠాలు చెప్పిన చిన్నయసూరి,

ఆ తర్వాత ప్రాచుర్యంలోకి వచ్చి కఠిన లక్షణభరితమైన గ్రాంథికశైలిలో నీతిచంద్రిక అనే పేరుతో 1853 లో అచ్చు వేయించాడు. మద్రాసు యూనివర్సిటీ బోర్డు కార్యదర్శి (ఫోర్ట్ సెంట్ జార్జి కాలేజి కార్యదర్శి కూడా) ఎ.జె. ఆర్బత్‌నాట్‌కు అంకితమిచ్చాడు. ఈ గ్రాంథిక నీతిచంద్రిక ఆ తర్వాత విద్యార్థులకు పాఠ్యగ్రంథమై కూర్చున్నది. వ్యావహారికభాషకు పట్టువదిలి, గ్రాంథికభాషకు పీఠప్రతిష్ఠ జరిగింది. తెలుగు వచనం కావ్యభాష మూసలోనూ, లాక్షణికదాస్య మైకంలోనూ పడిపోయి తెలుగువారికి దూరం కాజొచ్చింది.

గురుమూర్తిశాస్త్రి మరణించిన తర్వాత విక్రమార్క కథలు మళ్ళీ పునర్ముద్రణ పొందినప్పుడు, 1850 లో కాలేజి బోర్డువారు 400 కాపీలు కొనాలనే ప్రతిపాదన వచ్చినట్లున్నది. కొందామా వద్దా అని బ్రౌన్‌ను అభిప్రాయం అడిగారు, కాలేజీ బోర్డు వారు. బ్రౌన్ సిఫార్సు సుముఖంగా లేదు. దీనికంటే మరింత ఉపయోగకరమైన సంపుటిని తయారుచేసే వుద్దేశం తనకున్నదని బ్రౌన్ వ్రాశాడు. విక్రమార్క కథల విషయమై మీ అనంగీకారానికి కారణాలు తెల్పమనీ, మీరు తయారుచేయబోయే సంపుటి గూర్చి వివరాలు తెల్పమనీ బ్రౌన్‌ను మళ్ళీ అడిగారు. బ్రౌన్ తన కారణాలు తాను సూచిస్తూ బోర్డుకు ఒక నివేదిక పంపాడు. ఆ నివేదిక విషయం ఏమైందో కానీ కాలేజిబోర్డువారు 400 కాపీలు కొనవలసినదని మాత్రం సిఫార్సు చేశారు.*

విక్రమార్క కథలు గూర్చి బ్రౌన్ నివేదిక ఆర్కైవ్స్‌లో నాకింకా లభ్యం కాలేదు. కానీ ఆ నివేదిక ఏమైవుంటుందో వూహించుకోడానికి ఆధారాలు బోలెడున్నాయి. గురుమూర్తిశాస్త్రి భావాల సంగతటుంచి, భాషలో వ్యావహారికం పాలు ఎంతవున్నా, 'పెడాంటిక్ టచ్' వున్నదనీ, కృతక గ్రాంథిక రూపాలు చాలా వున్నాయనీ, దాన్ని యింకా స్వచ్ఛ వ్యావహారికంలోకి మార్చి సరళపర్చాలనేవి బ్రౌన్ అభిమతమై వుంటుంది.

కావ్యాలలో వుండే భాషకన్నా సామాన్య జనం వాడుకలో వుండే వ్యావహారిక భాషపైన్నే బ్రౌన్‌కి ప్రీతిమెండు అనేది విస్పష్టం. ఈ సంగతిని ఆయన చాలాచోట్ల బాహాటంగానే చెప్పాడు. తర్వాత తర్వాత సి. ఆర్. రెడ్డి 'ముసలమ్మ మరణం' కావ్య కథకు ప్రేరణనూ సమిధనూ సమకూర్చిన, మెకంజీ కైఫీయతులలోని బుక్కరాయ చెరువు తాలూకు సుదీర్ఘమైన కైఫీయతులను ఇంగ్లీషు తర్జుమాతో కూడా కలిపి

* తమిళనాడు ఆర్కైవ్స్‌లోగల 1850 మార్చి 12 తేదినాటి పబ్లిక్ ప్రొసీడింగ్స్ నెంబర్లు 19, 20; ఏప్రెల్ 16 తేదినాటి నెంబర్లు 20, 21.

1853 లో బ్రౌన్ రెండు సంపుటాలలో ముద్రించాడు.* 1842-48 మధ్య సేకరించి పెట్టిన తాతాచార్ల కథలు వుండనే వున్నాయి. వీటిని 1855 లో సంకలనపరిచి ఇంగ్లీషు తర్జుమాతో కూడా ముద్రించాడు.

ఈ తాతాచారి కథలకు బ్రౌన్ పీఠిక వ్రాస్తూ:"His (Tatacharlu's) tales... furnish good models of the colloquial Telugu... (and) may supersede the prose abridgements, which are still read under the names of Panchatantra, and Tales of Vicramarca. These two are excellent compositions: but the abridgements are written in a pedantic style different from the Telugu in daily use."† అని స్పష్టంగా వివరించాడు.

"The wars of Rajas..." అనే గ్రంథానికి వ్రాసిన పీఠికలో ఇదే విషయాన్ని మరింత సూటిగా చెప్పాడు బ్రౌన్: "After perusing my Telugu Dialogues and part of my Telugu Reader, the student may undertake the present volume: the publications hitherto in vogue may be safely laid aside. They are three: commonly known as the Vicramarca Stories, Panchatanra Tales, and Teloogoo Selections. The first two are unworthy of perusal. The third is better, but is entirely needless to those who possess the Telugu Reader..."§

ఈ భావాలనే ఆ నివేదికలో బ్రౌన్ విశదీకరించి వుంటాడని అనుకోవచ్చు.

---

*చూడు: The wars of the Rajas being the History of Anantapuram written in Telugu in or about the years 1750-1810, Translated into English, C. P. Brown, Madras, 1853 (2 volumes).

† సి. పి. బ్రౌన్ సంతరించిన తాతాచార్ల కథలు: బంగోరె సంశోధన-సంకలనప్రతి, మద్రాసు, 1974, పేజీలు 221-2.

§ చూడు: The wars of the Rajas, being the History of Anantapuram, C. P. Brown, Madras, 1853, Brown's preface.

[ఈ అంశంలో బ్రౌన్ తత్వధారనూ, భావజాలాన్నీ అర్థంచేసుకోవడంలో- Notes on C. P. Brown అనే పేరున దిగవల్లి వెంకటశివరావుగారు వ్రాసి పెట్టుకున్న చిత్తు నోట్సు ప్రతిలోని 'బ్రౌన్‌దొర-చిన్నయసూరి' అనే అధ్యాయం తోడ్పడింది.]

3

మహారాజశ్రీ ఆంధ్రభాషా ప్రవీణులైన సీ-పీ- బ్రౌన్‌దొరవారి సముఖము నకు పాట్లూరి రామస్వామిశాస్త్రులు మిక్కిలి వినయంతో వ్రాసుకొనే మనవి యేమంటే—

లోగడ మా పెద్దన్నగారయిన నరసింహశాస్త్రులవారున్ను చిన్నన్న గారయిన రంగాశాస్త్రులవారున్ను యీ వుభయులు కాలేజి తెనుగు మునిషి పనిలో నుండినప్పుడు వారు అనేకమంది దొరలకు చదువుచెప్పి వారిని ఆంధ్ర భాషయందు ఘటికులను చేసియుండిరి. యిలా వుండగా మా పెద్దన్న గారయిన నరసింహశాస్త్రులవారు తెనుగు డిప్యటీ పనిలో వుండి వారున్నూ చనిపోయిరి. ఆ సమయమందు మహారాజశ్రీ జే-సీ- మారీస్ దొరవారు నన్ను పరీక్షించి నాకు తెనుగు అశిష్టాంటు పని దయచేసియుండిరి. ఆ పనిలో నేను వుండగా కాలేజి బోర్డువారు గవర్నమెంటువారి ఆర్డరు చొప్పున మా పనులను నిలుపుదల చేసినది మొదలుకొని నేను గొప్ప కుటుంబము కలవాణ్ని గనక అన్నవస్త్రానికి శ్రమపడుతూ వుండగా సదరహీ మారీస్‌దొరవారు నన్ను తమ వద్ద అడీషనాల్ మునిషీగా నుంచుకొని, కాలేజి వుంచినది మొదలుకొని కాలేజీలో దొరలను పరీక్షించిన కథలలో సెక్కండు యింక్రీజు కథలనున్ను రివార్డు కథలనున్ను యేర్పరచి వ్రాయమని వుత్తరువు చేసినందున వారి యుత్త రువు ప్రకారము నేను దరోబస్తు కథలను యేర్పరచి వ్రాసియిచ్చిన పిమ్మట—ఆ దొరవారు లోగడ జాన్‌వాన్‌దొరవారి యుత్తరువు ప్రకారము మాపెద్దన్నగారయిన నరసింహశాస్త్రులవారిచేత రచింపబడిన వచనరూపమగు హరిశ్చంద్రుని కథ మిక్కిలి శిథిలమైయుండగా సదరహీ కథను యేర్పరిచి వ్రాయమని వుత్తరువు చేసినందున నేను ఆ కథను వ్రాస్తూ వుండగా ఆ దొరవారి తావున ప్రబలులుగా వున్నవారు తమరు వినాగా మరియొకరు అచ్చట ప్రబలముగా నుండవచ్చునా యనే తాత్పర్యముచేత నేను వ్రాస్తూ వున్న కథను వ్రాయకుండాచేసి రామాయణపు కథలను యేర్పరిచి వ్రాయించమని ఆ దొరవారిగుండా చెప్పి నందున నేను ఆ రామాయణ కథలను యేర్పరచి వ్రాస్తూండగా నామీద లోలోపల తంటలుచేసి నన్ను ఆ పనిలోనుంచి తీసివేయించినారు. మరికొన్ని దినములకు వారు నా విషయమై గావించిన కృత్రిమమును ఆ దొరవారు తెలుసుకొన్నవారయి మళ్ళీ నా పనిని నాకు దయచేసి మా చిన్నన్నగారైన

రంగశాస్త్రులవారిచేత నూతనముగా రచింపబడిన విజయవిలాసమనే గ్రంథముకు వ్రాసేలాగుననున్ను శుకసప్తతి యనే కథలను నూతనముగా యేర్పరిచి వ్రాసేలాగున నన్ను వుత్తరువు చేసినందున యుత్తరువు ప్రకారము నేను వ్రాస్తూ వుండగా, నా దురదృష్టమువల్ల ఆ దొరవారు శీమకు ప్రయాణమైనందున అదివరలో నేను యేర్పరచి వ్రాసియున్న శుకసప్తతి కథలనున్ను వచనరూపమగు విజయవిలాసమునున్ను వ్రాసి వారికి నివ్వగా వారు కాలేజీ సెక్రెటరీ మహారాజరాజశ్రీ రౌలాంస్‌దొరవారికి ఒక సిపారసు కాగితమును దయచేసి యుండిరి. నేను ఆ కాగితమును తెచ్చి రౌలాంస్‌దొరవారికి నివ్వగా వారు మీకు యింగ్లీషు రానందున అడిషనాల్ మునిషీ పని అయినా యివ్వడానికి లేవనిన్ని యెక్కడనైనా టాకినీ మునిషీ పని తటస్థమయితే యిప్పిస్తున్నామనిన్ని చెప్పినందున నేను మళ్ళి మారిస్‌దొరగారి తావుకుపోయి ఆ సంగతి వారికి తెలియచేసి వేరే ఎవరికైనా దొరలకు ఒక సిఫారసు కాగితమును దయచేయుమని అడిగినందుకు వారు మంచిదని శెలవిచ్చి యుండిరి. యింతలో నాకు దేహము అశక్తముగానుండి వారి దర్శనమునకు పొయ్యేటందుకు లేక వారు ప్రయాణమై పొయ్యేనాడు నేనుపోయి వారి దర్శనము చేసుకోగా వారు నాకు వ్రాయడానికి సావకాశము లేదని చెప్పి ప్రయాణమై పోయిరి.

యీ సమయమందు నన్ను రక్షించగల ప్రభువులు ఎవ్వరు యిచ్చట లేనందున నేను అన్నవస్త్రానికి లేక పిల్లలతో కూడా నానా శ్రమలుపడుతూ వుంటడమువల్ల యేమీ తోచక అనేక కుటుంబ సంరక్షకులయిన తమ దర్శనము చేసుకొని తమ సముఖములో నా విద్యమానము యావత్తు శృతవరచుకొన్నట్టు అయితే తమరు నా గొప్ప కుటుంబంతో కూడా నన్ను సంరక్షణ చేతురని యెంచి సముఖమునకు యీ మనవి వ్రాసుకొన్నాను. అయితే — సపితా యస్తు పోషకః — అనే ధర్మశాస్త్రవచనము యున్నందున సకల న్యాయాధిపతులయిన తమరు నాయందు కటాక్షము వుంచి నన్ను పోషించి ఆ కీర్తిని చెందవలసినదని తమ శ్రేయస్సును వేడుకొంటున్నాను.

లోగడ మా చిన్నన్నగారయిన రంగశాస్త్రులవారి పేరిట తమరు వ్రాయించిన వుత్తరము యిందులో మలఫ్రూఫ్‌చేసి సముఖములో యిచ్చుకొన్నాను. అది తమరు చిత్తగించగా నేను ఫలానివాడని తమ చిత్తానకు

విశదము కావచ్చును. సకలము తెలిసిన ధర్మప్రభువులకు — నేను తరచు వ్రాయ శక్తుణ్ని కాను. యింతే నా మనవి—

1846 సెప్టెంబరు నెల తే 19 ది. —పాటూరి రామస్వామిశాస్త్రులు.*

* * *

ఈ జాబులో మూడు తరాల ప్రస్తావన కనపడుతున్నది. ఈ పాటూరి కుటుంబం యావత్తూ, సోదరులు ముగ్గురూ, ఈ మద్రాసు కాలేజీనే కనిపెట్టుకుని వుండినట్లున్నది. మొత్తంమీద విషాద ఛాయలు అలుముకొన్న జాబు. ఇప్పటి కాలేజీల్లో మాదిరిగానే గ్రూపులు, ముఠాలు, ఒకరిమీద ఒకరు తంటాలు చెప్పుకోవడం, అసూయలు పెట్టుకోవడం, వీటితో విజ్ఞానకృషికి అంతరాయాలు కలగడం—వీటికి సంబంధించిన దృక్కోణం ఒకటి ఇందులో ద్యోతకమవుతున్నది.

పాటూరి రామస్వామిశాస్త్రులు ఇందులో రకరకాల పుస్తకాలు—సెక్కెండు యింగ్రీజు కథలు, రివార్డు కథలు, దరోబస్తు కథలు, హరిశ్చంద్రుని కథ, రామాయణపు కథలు, వచన విజయవిలాసము, శుకసప్తతి కథలు—ఇట్లా వరసబెట్టి ప్రస్తావించారు. ఇవన్నీ అచ్చు అయ్యాయో లేదోకూడా తెలియదు. ఆధునిక తెలుగు వచన రచనా పరిణామంలో వీటికి ఏపాటి విలువ వున్నదో పరిశీలించవలసి వుంది.

ఆఖరుగా ఒక విషయం. ఈ అధ్యాయంలో ఇప్పటివరకు వచ్చిన ఈ ముగ్గురి జాబుల్లోను పలువురు దొరల ప్రస్తావన కనబడుతున్నది. జాన్ మక్కెరల్, ఎ. డి. కేంబెల్, జె. సి. మారిస్, జె. డి. సిం, జె. సి. మగ్డానల్—ఇట్లా ప్రస్తావనకొచ్చారు. ముఖ్యంగా కేంబెల్ వంటివారిని గురించి ఏకంగా చిన్న పుస్తకం వ్రాయతగ్గంత మెటీరియలే వుంది. వ్యాస విస్తరణ భీతిచేత ఒక్కరిని గురించి మాత్రం చెప్పి ముగిస్తాను.

గురుమూర్తిశాస్త్రి, రామస్వామిశాస్త్రి ఈ ఇద్దరుకూడా తమ జాబుల్లో జె. సి. మారిస్ గురించి వ్రాశారు గనుక ఆయన్నుగూర్చి టూకీగా చెప్పుకొందాం. మారిస్ తెలుగులో రెండు పుస్తకాలు వ్రాశాడు. ఒకటి—తెలుగు సెలక్షన్స్. పూర్తిపేరు: Teloogoo Selections with translations and Grammatical Analysis to which is added a Glossary of Revenue terms used in the Northern Circars. రెండు— తెలుగు నిఘంటువు. పూర్తిపేరు: A Dictionary English and Teloogoo.

* మ. ఓ. మే. లై. లోని బ్రౌన్ జాబుల సంపుటం ఎమ్. 419, పేజీలు 129–132.

మొదటిదైన తెలుగు సెలక్షన్స్ గురించి మొదట కొంత ప్రస్తావించుకొన్నాం. ఇది 1823 లో కాలేజి ప్రెస్సులో ముద్రణైంది. నాలుగు భాగాలున్న పుస్తకమిది, కథలు, కచ్చేరీ పేపర్లు (అర్జీలు), డైలాగులు, రెవిన్యూ పదాల జాబితా. విదేశీయులు తెలుగు నేర్చుకోడానికి అనువైన ప్రాథమిక గ్రంథం. దీని ద్వితీయ ముద్రణ 1845 లోనూ, తృతీయ ముద్రణ 1858 లోనూ వచ్చింది. మూడో ముద్రణ రావిపాటి గురవయ్య పర్యవేక్షణ—సంపాదకత్వంలో వచ్చింది కాబట్టి చాలా విస్తృతపరచడం జరిగింది. సెలక్షన్స్‌లో విక్రమార్క కథలు, వేమన పద్యాలు వగైరాలు చేర్చాడు.

ఇక మారిస్ తెలుగు నిఘంటువు. రెండు సంపుటాలుగా అచ్చయింది. మొదటి సంపుటం 1835 లోనూ, రెండోది 1839 లోనూ. పబ్లిషర్లు ఫోర్ట్ సెంట్ జార్జి కాలేజి బోర్డువారు. మొత్తం 1118 పేజీలు. పీఠికలో మారిస్ గురుమూర్తి శాస్త్రికి కృతజ్ఞతలు తెలిపివున్నాడు. తెలుగు పదాలకు అర్థనిర్ణయంలో కావ్యప్రయోగాలు సూచించే ఆచారాన్ని మొదటిసారి ప్రవేశపెట్టింది ఈ మారిస్సేనని, 'తెలుగు నిఘంటువులు' మీద సిద్ధాంత వ్యాసం వ్రాసి శ్రీ వెంకటేశ్వర విద్యాలయంనుంచి డాక్టర్ పట్టా పొందిన కుమారి టి. ఉషారాణి పేర్కొన్నారు. ఈ కీర్తిని మారిస్‌కు అంటగట్టడం తప్పు. 'కావ్యప్రయోగం' అంటూ మారిస్ చూపింది ఒకే ఒక్క పదం విషయంలోనే. కావ్య ప్రయోగాల ఆధారంతో అర్థనిర్ణయాలు వింగడించి వివరించి చెప్పిన విస్తృత వైదుష్యం ఒక్క బ్రౌన్‌దే. బ్రౌన్‌కంటే ముందు ఒక్క పదం విషయంలోనైనా వేమన కవి ప్రయోగాన్ని చూపి ఈ పనిచేసింది మారిస్ అని అంటున్నారు డాక్టర్ ఉషారాణి. ఒక్క పదం విషయంలోనయితే మారిస్‌కంటే 14 ఏళ్ళ ముందే ఏ. డి. కేంబెల్ ఈ పని చేసిపెట్టి పోయాడు. 1821 లో వచ్చిన కేంబెల్ 601 పేజీల నిఘంటువులో ఒకేఒక్క పదం విషయంలో కావ్యప్రయోగం చూపివున్నాడు. 'ఇంత' అనే పదానికి అర్థవివరణ చేస్తూ 'ఇంతలు' బహువచనంగా పేర్కొని ఇట్లా వ్రాశాడు: "This word is sometimes used in the plural as ఇంతలు కన్నులు, Eyes such as these. Manoo Churitra."* ఇట్లా మనుచరిత్ర ప్రయోగాన్ని పేరుచెప్పి సూచిస్తాడు కేంబెల్. ఈ విషయం గురించి బ్రౌనే ఒకచోట ఇట్లా వ్రాసున్నాడు: "The only passage (one) I find quoted by Campbell occurs under ఇంత"†

* చూడు: A. D. Campbell, A Dictionary of the Teloogoo Language, Madras, 1821, P. 74.

† మ. ఓ. మే. లై. లోని బ్రౌన్ డిక్షనరీల నోట్సు డి. 3156.

# 2.

# మహాభారత సంశోధిత ముద్రణకు అంకురార్పణ చేసింది బ్రౌనే

హెచ్చు తక్కువ 160 ఏళ్ళ క్రితం సి. పి. బ్రౌన్ అనే పరాయిదేశపు కుర్రవాడు తెలుగు గడ్డమీదకు రాకపోతే, మన కావ్యాలలో చాలామటుకు ఏ కాలగర్భంలో కనుమరుగై పోయి వుండేవో! తెలుగు కావ్యచ్యుతి జరగకుండా వాటి పునరుద్ధరణకు కారకుడై మనకు వాఙ్మయదీపం పెట్టిపోయిన మహనీయుడు బ్రౌన్. ఈ పని సి. పి. బ్రౌన్ మూలంగా గాకపోతే, మరికొంత ఆలస్యంగానైనా మరొకరివల్ల ఈ కావ్యోద్ధరణ కొనసాగి వుండేదని ఈనాడు మనం ప్రగల్భాలు పలకవచ్చుగానీ, బ్రౌన్ ఆనాడు ఒక దీక్షగా దక్షతతో చేసిన ఈ కృషి ఎనలేనిది. విస్మరించరానిది.

తెలుగు కావ్యసేకరణను ఒక వ్యసనంగా చేసుకొని జీవితమంతా వాటి శోధనలో మధనంలో వుండిపోయాడు బ్రౌన్. వ్రాయసగాళ్ళను పెట్టి మన కావ్యాలకు విశుద్ధ ప్రతులు తయారుచేసి కాగితాలమీద కెక్కించాడు. పద్య సంఖ్యనిచ్చి, అధ్యాయ విభజన చేసి క్రమబద్ధం చేశాడు. ప్రెస్‌వాళ్ళను పిలిచి పిలిచి ప్రోత్సహించి పందేరం చేసి తెలుగు కావ్యాలకు అచ్చురూప మిప్పించాడు. కావ్యభాష మెళకువలు, మర్మాలు, లక్షణాలు సామాన్యులకు కొరుకుడు పడాలంటే ప్రజాధోరణిలో సులభశైలిలో టీకలు, వ్యాఖ్యలు ఆవసరమని గుర్తించి ఆ పని చేయించాడు.

1827 లో బైచరాజు వెంగళరాజు పంచతంత్రాన్ని పరిష్కరించి శుద్ధప్రతి తయారుచేయించి టీక వ్రాయించాడు. పదాల పట్టిక సమకూర్చాడు. ఆ మందటనే పోతన భాగవతం తయారైంది. ఆ తర్వాత కవిత్రయ భారతం, మనుచరిత్ర, వసు చరిత్ర, బసవపురాణం—ఇట్లా ముఖ్యమైన తెలుగు కావ్యాలన్నిటికీ నిర్దుష్ట పాఠ

ప్రతులు, టీకలు బ్రౌన్ ఆధ్వర్యంలో తయారయ్యాయి. ఇదే వరుసక్రమంలో గాక పోయినా ఈ ధోరణిలో ఆయన కృషి కొనసాగింది. బ్రౌన్ ఆ రోజుల్లో ఈ పని చేయకపోతే, తెలుగు కావ్యాలకు శుద్ధప్రతులు సంతరించి పెట్టకపోతే మన గతి ఏమై వుండేదో వూహించడం కష్టమే. తెలుగులో ఇంచుమించు ఏ కావ్యాన్ని తీసుకున్నా బ్రౌన్ చేసిన పని అంత అప్రతిహతమైనట్టిది.

ఈనాడు ఎంతో అధునాతన సాధన సంపత్తీ, అదనపు సాక్ష్యాధారాలూ మనకు లభించిన తర్వాతకూడా, ఈ కావ్యాలను 'ఎడిట్' చేసి డబ్బులు సంపాదించుకొంటున్న వారు బ్రౌన్‌కు ఒక నమస్కారబాణం వేసి వుపక్రమిస్తున్నారంటే, బ్రౌన్ వ్రాయించిన వ్రాతప్రతులు, తయారుచేయించిన ప్రామాణిక ప్రతులు సంప్రతించనిదే ముందుకు పోలేని స్థితిలో వున్నారంటే ఆయన కృషివిలువ ఎంతటిదో ప్రత్యేకించి చెప్ప నవసరంలేదు. చాలామంది ఆ పనికూడా చేయకుండా సొంత ప్రకర్ష చేసుకొంటున్నారు. మరికొందరు ఈ నిధి వున్నదనే స్పృహసైతం లేకుండానే ఏవేవో సాముగరిడీలు చేసి వెలితిపడ్తున్నారు. బ్రౌన్ చేసిన ఈ పనిని బయటపెడితే తమ అంగుష్ట ప్రమాణపు రూపం ఎక్కడ బయటపడ్తుందేమోనని భయపడి ఆయన నామోచ్చారణైనా చేయ కుండా, ఆయన భద్రపరిచి పెట్టిపోయిన ఈ నిధిని మాత్రం యథేచ్ఛగా వాడుకొని తమ పబ్బం గడుపుకొంటున్నారు.

ఉదాహరణకు తెలుగులో మహాభారతం విషయం తీసుకొన్నప్పుడుకూడా బ్రౌన్ గావించిన కృషికి మనం సాష్టాంగపడవల్సిందే. 'ఆంధ్ర మహాభారత సంశోధిత ముద్రణ పథకం' (ఉస్మానియా విశ్వవిద్యాలయం) తాలూకు పండిత సంఘంవారు తెలుగు మహాభారత ముద్రితాముద్రిత ప్రతుల చరిత్ర వికాసంగూర్చి ఎంత అవకతవక చర్చ చేసిందీ, 1973 నాటి నా 'బ్రౌన్ జాబులు : తెలుగు జర్నలిజం చరిత్ర 1832 నుంచి 1857 దాక' అనే గ్రంథంలో కొన్ని సాక్ష్యాధారాలు చూపాను.

"సి. పి. బ్రౌన్‌గారి యాదేశమున సిద్ధము చేయబడినదానికన్న ముందు వ్రాయ బడిన కాగితపు లిఖిత ప్రతి మా కింకను గనపడలేదు" అని వ్రాతప్రతుల విషయంలో బ్రౌన్‌కు పెద్ద పీట వేసినా, ముద్రితప్రతుల విషయంలో నానా అగమ్యపు చర్చనంతా చేశారు. "(ఆంధ్ర మహాభారతాన్ని) మొట్టమొదట ప్రచురించిన వారెవ్వరో చెప్పుట కింకను ఆధారములు లభింపకున్నవి" అని సదరు పండిత సంఘంవారు సెలవిచ్చారు, ఈ చల్లని కబురు చల్లగా చెబుతూనే, "1860 వ సంవత్సరమునకు పూర్వమున్న ముద్రణలు" అనే ఒక జాబితాలో ప్రథమ ముద్రణగా "చిన్నయసూరిగారిచేతను,

రామానుజాచార్యులగారిచేతను వెల్వరింపబడిన ఆదిపర్వము (1847)" అని చిన్నయ సూరికి లేని ఒక పెద్దపీఠం వేసి కూర్చోబెట్టారు. ఇందులో చరిత్ర వక్రీకరణ పాలు ఎంత వున్నదో పై గ్రంథంలో చర్చించాను. సదరు 1847 కంటే అయిదేళ్ళముందే 1842 నాటికి తెలుగులో ఆదిపర్వం ముద్రణై వున్నట్లు ఒక ఆధారం చూపెట్టాను.

గౌరన హరిశ్చంద్ర, నవనాధ చరిత్రలను 1842 లో బ్రౌన్ ముద్రించినపుడు, పుస్తకం మొదట్లోనే తాను అచ్చువేసిన, వేయిస్తున్న ఇతర గ్రంథాల జాబితా యిస్తూ 'ఆదిపర్వం' అచ్చులో వున్నట్లు పేర్కొన్నాడు. 1866 లో బ్రౌన్ లండన్‌లో అచ్చు వేసిన తన స్వీయచరిత్ర ఆఖర్లో Telugu books printed under my direction అనే జాబితా కింద ఆంధ్రమహాభారతాన్ని మొట్టమొదటగా సూచించాడు. ఇట్లా ఈ మహాభారత ప్రథమ ముద్రణ భిక్ష పెట్టినవాడుకూడా బ్రౌనేనని చెప్పడానికి ఇప్పుడు మరికొన్ని ఆధారాలు లభిస్తున్నాయి. మచ్చుకు ఈ లేఖ ఒకటి.

ఈ జాబు వ్రాసిన వ్యక్తి పురాణం హయగ్రీవశాస్త్రి, చిన్నయసూరి సమకాలికుడు. మద్రాసు యూనివర్సిటీ స్కూలులో చిన్నయసూరి ప్రథమ పండితుడుగా వున్నపుడు, ఈ హయగ్రీవశాస్త్రి రెండో పండితుడు, ఇక ఈ జాబు పరికిద్దాం:

## 4

మహారాజశ్రీ ఆంధ్రభాషా పండితులగు బ్రౌన్‌సాహెబుగారికి—

పురాణం హయగ్రీవశాస్త్రి అనేక సలాములుచేశి వ్రాసుకున్న మనవి యేమంటే, వాల్మీకియ్యమగు శ్రీమద్రామాయణమును అనేక మూలప్రతుల నున్ను వుంచుకొని పరిష్కరించి కొన్ని దురూహములగు* ఘట్టములయందు వ్యాఖ్యానకారుల అభిప్రాయమును సంగ్రహముగానున్ను తేటగానున్ను తెలియవ్రాశి, ప్రతి అధ్యాయ కథను సంగ్రహముగా ముందు దెలిపి యింకా కొన్ని పద్ధతులను నవీనముగా నేర్పరచి ముద్రాక్షరములయందు అచ్చు వేయించేలాగున నిశ్చయిస్తిని గనక నా వుద్యమమును సఫలపరచుటకు తమ్ము వేడడమేమంటే ముందు తాము అనేక ప్రతులను వుంచుకొని పరిష్కరించియుండే రామాయణము తమ సన్నిధానమునందు వున్నదని

* 'దురవగాహములగు' అని బ్రౌన్ దిద్దుబాటు.

వింటిని గనక ఆ రామాయణమందు బాలకాండనున్ను అయోధ్యకాండ నున్ను దయచేశి పంపడము మాత్రమేగాక, రామాయణవ్యాఖ్యానములగు రామానుజియ్యము, గోవిందరాజియ్యము, భావప్రకాశిక, టీకాశిరోమణి, కతకటీక, వైద్యనాదియ్యము, నాగోజి పండితియ్యము, వీటిలో యేదివుండినా దయచేసి పంపడమువల్ల చాలా సహాయముగా వుండును. లోగడ కలకత్తాలో ముద్రాక్షర విరచిత రామాయణము తమవద్ద వున్నట్టున్ను సదరహి గ్రంథము ప్రకృతమందు నేను దిద్ది యేర్పరచబొయ్యే రామాయణగ్రంధమునకు చాలా సహాయపడుననిన్ని దాన్ని యిప్పించేలాగుననున్ను లోగా రా. యీ. పార్థసారధి శెట్టి వ్రాయించి పంపించిన జాబువల్ల తెలియనాయను.

సదరహి రామాయణము క్రౌదరు సాహేబులవద్ద బాలకాండ మాత్రము వుండగాను దాన్ని తెచ్చి యీ దేశపు పుస్తకములతో సరిచూడగా ప్రతి శ్లోకమున్ను వేరుపడియున్నది. కొన్నిచోట్ల శ్లోకములు లేకయున్ను కొన్ని స్థలములయందు అధికముగానున్ను యిట్లు న్యూనాధిక్యములచేత యీ దేశమందుగల పుస్తకములకు శానా వేరుపడియున్నది. గనుక అది యీ దేశస్థులకు చాలా విరుద్ధముగా నున్నందున నాకు సహాయపడనేరదని నమ్ముతున్నాను. యిదిన్నిగాక కాశీదేశస్థ నాగోజీ పండితియ్యమనే వ్యాఖ్యానమునకున్ను కూడా అది విరుద్ధంగానే వున్నందున అచ్చు వేయించే యెడల పండితుల కృత్రిమంవల్ల అట్లా జరిగినట్లు నాకు తోస్తున్నది.

యిదిగాక యీ దేశమందు ఫాదర్లుచేత నేర్పరిచియుండే ముద్రాక్షర శాలలయందు శ్రీ మద్రామాయణమును అచ్చువేయించుటకు సమ్మతిపడక పోయినందున నా స్వంతంలోనే అచ్చు ఆఫీసు వేయించేలాగున కొన్నిమంచి సహాయమున్ను పొందడమువల్ల నిశ్చయిస్తిని. అందులో తెలుగు అక్షరములను సిద్ధపరచితిని. ఆ అక్షరములు తమరు ప్రకృతమందు వేయించే ఆదిపర్వములో అక్షరములవంటివి అయి వాటికంటె కుదిరికెగానున్నవి. ప్రమాణమందు వాటితో జతగానున్ను కుదిరికెలో తమరు అచ్చువేయించిన లూకా గ్రంథమునందు వుండే అక్షరములకు జతగానున్నవి. యీ నెల 20 తారీఖున ఆఫీసు యేర్పరిచేలాగున నిశయిస్తిని గనక తమ్ము వేడడమేమంటె యీ క్రింద వ్రాశే పుస్తకములను దయచేసి నాకు అచ్చువేశేలాగున యిప్పించి సహాయము చేయవలెనూ.

ప్రకృతమందు కావలసిన పుస్తకములు తారాశశాంకము, కుచేలో పాఖ్యానము, సారంగధర చరిత్రము, మైరావణచరిత్ర, సుభద్రాపరిణయము, రాధికాస్వాంతము, రాఘవపాండవియ్యము సవ్యాఖ్యానము, మనుచరిత్ర సవ్యాఖ్యానము, తెలుగు పద్యములతో కూడా వుండే కర్ణామృతములు 3 శతకములున్ను. కొద్దిరోజులకు పిమ్మట కావలశిన పుస్తకములు భారతము యుద్ధపంచకము, రంగనాథరామాయణము, తెలుగు భాగవతము, హరిశ్చంద్ర నలోపాఖ్యానము సవ్యాఖ్యానము. వీటిలో యెవరికైనా అచ్చువేయుటకు యిచ్చేలాగున ముందు వాగ్దత్తము చేశియున్న పక్షమందు ఆ పుస్తకములను దక్క తక్కిన పుస్తకములను నాకే యిచ్చేలాగున దయచేయవలెనని కోరుతున్నాను.

తమరు యీ విషయమందు సర్వజ్ఞులు గనక యింకా యే పుస్తకములు అచ్చువేయించుటకు నుపయుక్తంగా తమకు తోస్తున్నదో వాటిని తెలియచేయ వలెనని కోరుతున్నాను.

యీ అచ్చువేశే విషయమును గురించి తమరు సర్వసాధారణముగా సహాయము చేయవలెనని తలంపుగల ప్రభువులయినందువల్లనున్ను, ఆంధ్ర భాషయందుగల పుస్తకములు సుష్టుగా దిద్ది వేయించవలెననే కోరికగలవారై నందుననున్ను నా విషయముగా అచ్చుకు కావలశిన పుస్తకములనిచ్చి సహాయము చేస్తామని లోగడ నొకతూరి జాబువ్రాసి పంపించియుండడము నున్ను, సదరహి మూడుహేతువులవల్ల యీ రీతిగా వ్రాయడమైనది. చిత్తగించ వలెను.

సంస్కృత గ్రంథములు ప్రాయశః వావద్దనే ప్రకృతమందు వుండడము వల్ల వాటిని గురించి తమకు వ్రాయలేదు. విశేషముగా కావలశిన పక్షమందు మనవి చేసుకొంటున్నాను. చిత్తగించవలెను. యిదే అనేక సలాములు.

తా॥ నాకు పంపే పుస్తకములను యీ జాబును తెచ్చే రా. రా. పార్థ సారథి శెట్టిగుండా పంపితే చేరుతున్నది గనుక దయచేసి పంపవలెను.

1840 యేప్రెల్ 10 తేది. —హయగ్రీవశాస్త్రి.*

* * *

*మ. ఓ. మే. లై. లోని బ్రౌన్ జాబుల సంపుటం, ఎమ్ 401, పేజీలు 297–99.

ఈ జాబులోని "తమరు ప్రకృతమందు (అచ్చు) వేయించే ఆదిపర్వములో అక్షరములవంటివి...." అనే వాక్యాన్నిబట్టి చూస్తే 1840 లోనే మహాభారత ముద్రణను బ్రౌన్ ప్రారంభించినట్లు స్పష్టమవుతున్నది గదా. 1842 ఆగస్టు 4, 18 తేదీల 'వర్తమాన తరంగిణి' పత్రిక సంచికల్లో వచ్చిన తెలుగు పుస్తకాల వ్యాపార ప్రకటనలో "ఆదిపర్వము వెల 8 రూపాయలు" అనేది ఈ బ్రౌన్ ముద్రణే అయి వుండాలి. సందేహంలేదు. తెలుగు మహాభారతం తొలిముద్రణ ప్రయత్నంచేసి ఆదిపర్వం వరకైనా సొంతంగా అచ్చువేయించింది బ్రౌనే. అంతేకాదు, ఆ తర్వాత వచ్చిన 18 పర్వాల ముద్రణలకు బ్రౌన్ వ్రాతప్రతులు, శుద్ధప్రతులు ఎంతగానో తోడ్పడ్డట్లు తద్ముద్రణకర్తలూ సంపాదకులూ చెప్పుకొన్నదే. ఆదిపర్వం తొలిముద్రణ తాలూకు ఈ చారిత్రక సత్యానికి ఉస్మానియావారి మహాభారత సంశోధిత ప్రతి పరిష్కర్తలు బొత్తిగా ప్రాధాన్యమివ్వకపోవడం శోచనీయం.

1842లో ఆదిపర్వం అచ్చువేయడానికి ముందు— 15 ఏళ్ళముందే— బ్రౌన్ తన 29వ ఏట వ్రాసి ప్రకటించిన "ఆంధ్ర గీర్వాణచ్ఛందము" అనే ఆంగ్లాంధ్ర గ్రంథంలో మహాభారతంలోనుంచి వివిధ పర్వాలలోని దాదాపు రెండు డజన్ల పద్యాలు ముద్రించాడు. ఊరకే ముద్రించడం కాదు, ఇంగ్లీషు మీటర్‌లోకి తర్జుమా చేశాడు కూడా. ప్రత్యేకించి సభాపర్వం ద్వితీయాశ్వాసంలో 155 నుంచి 168 వరకు గల 14 పద్యగద్యలను తనకు దొరికిన పది తాళపత్ర ప్రతుల్లోనుంచి పాఠ భేదాలను, లుప్త భాగాలను ఎత్తి చూపుతూ, తాను నిర్ధారణచేసి తీర్పు చేసిన పద్యాల (శుద్ధ పాఠాల)తో సహా ముద్రించాడు.*

తాళపత్ర ప్రతుల్లోనుంచి తాను గుర్తించిన పాఠభేదాలు, వాటిల్లోనుంచి తానెన్నుకొన్న శుద్ధ పాఠాలు — ఇట్లా రెండు భాగాలుగా విడివిడిగా ముద్రించాడు. ఇవి చూస్తే అర్థమవుతుంది బ్రౌన్ ఎంత శాస్త్రీయ ధోరణిలో పాఠ భేదాలను గుర్తించి, ఎంత ప్రతిభావంతంగా శుద్ధ పాఠాలను నిర్ణయించాడో అనేది. ఇన్నేళ్ళ తర్వాత, ఎన్నో ముద్రిత ప్రతులు వెలసిన తర్వాత ఉస్మానియావారి సంశోధిత ప్రతి సంఘం

---

* చూడు: "The Prosody of the Telugu and Sanscrit Languages explained (ఆంధ్ర గీర్వాణచ్ఛందము)", C.P. Brown, Madras, 1827, pp. 67-72. శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయంవారు (సి. పి. బ్రౌన్ ప్రాజెక్టు) ప్రస్తుతం దీన్ని పునర్ముద్రిస్తున్నారు. ఈ 'బ్రౌన్ లేఖలు'తోబాటుగా విడుదలవుతున్నది.

వారు గుర్తించగలిగిన పాఠాలనీ, బ్రౌన్ శుద్ధ పాఠాలనీ సరిపోల్చి చూద్దాం. మచ్చుకు మొదటి పద్యం (సభాపర్వం ద్వితీయాశ్వాసంలో బ్రౌన్ అప్పటికి దొరికిన ప్రతుల ప్రకారం 155వ పద్యం. ఉస్మానియావారి దాంట్లో ఇది 138 వ పద్యంగా వుంది)లో ఇరువురూ గుర్తించిన వివిధ పాఠభేదాలటుంచి, వారిరువురు నిర్ణయించిన శుద్ధపాఠాలు పరికిద్దాం :

బ్రౌన్ పాఠం : యిమ్ముగ ధర్మజుతో జూదమ్మాడగవలయు నాకు ధరణీశ్వర య
జ్ఞమ్మదియు సమస్తైశ్వర్యములు బడయగ నుపాయ మభిమత సిద్ధిన్.*

ఉస్మా. పాఠం : ఇమ్ముల ధర్మజుతో జూదమ్మాడగ గాన్ప నాకు ధరణీశ్వర య
జ్ఞమ్మదియు సమస్తైశ్వర్యమ్ములు వడయగ నుపాయ
మభిమత బుద్ధిన్.†

ఇందులో ఏ పాఠానికి మీరు వోటిస్తారు? దేనికైనా ఇచ్చుకోండి గానీ మన సంశోధిత ప్రతి సంఘంవారు గుర్తించలేని ఇట్లాటి విలువైన పాఠాలు మరింకెన్ని వున్నాయో అనిపిస్తున్నది. అలనాడు రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారు వ్రాసినట్లు "విమర్శకులు పరిశోధకులుగా నేర్పడని యవస్థ" యిది.

ఇక "కుదిరికెలో తమరు అచ్చువేయించిన లూకా గ్రంథమునందు వుండే అక్షరములకు జతగా నున్నవి" అని హయగ్రీవశాస్త్రి మరో వాక్యం. అదేమో 1840 నాటికి 'అచ్చు వేయిస్తున్న' ఆదిపర్వమైతే, ఇదేమో 'అచ్చు వేయించిన' లూకా గ్రంథం. ఏమిటీ లూకా గ్రంథం? బ్రౌన్ 1838 లో ప్రచురించిన "బైబిల్ (న్యూ టెస్ట్‌మెంట్—ది గాస్పెల్ అకార్డింగ్ టు సెయింట్ లూక్....) అనే లూకా సువార్త గ్రంథం అనుకోవాలి.§

---

* పై గ్రంథమే, పేజీ 70.

† ఆంధ్ర మహాభారతము, సంశోధిత ముద్రణము, ప్రథమ సంపుటము, ఉస్మానియా యూనివర్సిటీ, హైదరాబాదు, 1968, పేజీ 673.

§ చూడు: లండన్, బ్రిటిష్ మ్యూజియం (ఇప్పటి పేరు బ్రిటిష్ లైబ్రరీ)లో వున్న తెలుగు పుస్తకాల క్యాటలాగు. "A Catalogue of the Telugu Books in the Library of the British Museum", L. D. Barnett, London, 1912.

ఇక హయగ్రీవశాస్త్రి ఏర్పాటుచేసిన ప్రెస్సు, ఆయన అచ్చువేసిన పుస్తకాలు— వీటిని గూర్చి చెప్పుకోవలసిన విషయాలు చాలానే వున్నాయి. ఆయన పెట్టిన ప్రెస్సు పేరు 'వివేకాదర్శ ముద్రణాలయము'. భాగవతం, భూగోళదీపిక—ఇంకా అనేకం ప్రచురించాడు. వీటిలో బ్రౌన్ సేకరణలను ఆధారం చేసుకొని చేసిన ప్రచురణలెన్నో మరి?

ఉదాహరణకు పోతన భాగవతానికి ముద్రణయోగం కల్గించిన ప్రథముడు పురాణం హయగ్రీవశాస్త్రే. 1827లో బ్రౌన్ పరిష్కరించి తయారుచేయించిన సాధు పాఠ ప్రతిని ఆధారం చేసుకొని 1848లో హయగ్రీవశాస్త్రి ముద్రించాడు.

బ్రౌన్ తన డిక్షనరీలో ఒకచోట ఇట్లా నోట్‌చేసి వున్నాడు ;

"ఏకశిలనగరము : A name of ఒరంగల్లు Warangole. See. Local Records (Mackenzie) 1.216 — but there no modern name is given. ఒరగల్లు : ఒరంగల్లు : A touchstone. The name of a town marked on the map as Warangole called Mosipatam మోసపట్నం by Musalmans. ఒరగల్లు properly signifies the one or single rock as is proved by (Local Record 3 P. 393. town of Pratapa Rudra. ఓరుగల్లు, ఒరుగంటి) a Sanscrit verse quoted to me by Bramhaya Pandit from the Pratapa Rudriyam– wherein it is called Ecasila or The One Rock .... ఏకశిలా మహీశానాం శ్రుత్వా నరేంద్ర తజ్జనామోదం । గురుజన నియంత్రితానాం తస్యా ఆననం మలినం ॥ .... It is the village now called ఒంటిమిట్ట Wantimitta, a little south of Cuddapa, on the route to Madras, says హయగ్రీవశాస్త్రి in his introduction to the printed Telugu Bhagavat.* అంటే, బ్రౌన్ అన్ని వాదాలు ఇస్తూ, పోతన "ఏకశిలనగరం" అంటే ఒరంగల్లా లేక ఒంటిమిట్టా అనే వివాదాన్ని మొదటగా గమనించినట్లున్నాడు. తర్వాత తర్వాత ఈ వాదాన్ని వావిలకొలను సుబ్బారావు కొనసాగించాడు.

ఒక ముక్తాయింపు ; హయగ్రీవశాస్త్రి ఈ జాబుకు సంబంధించి ఇందెక్సు పేజీలో "Wretched pedantry — from an editor of Ramayan — All Sanscrit" అని బ్రౌన్ వ్రాసిపెట్టాడు.

---

* చూడు : మ.ఓ.మే.లై.లోని బ్రౌన్ డిక్షనరీ నోట్సు సంపుటాలలో డి. 1391, వాల్యూమ్ నెంబరు 1, పేజీ 534.

# 3

## పల్నాటివీర చరిత్ర కావ్యపరిష్కరణ: బ్రౌన్ పరిశ్రమ

బ్రౌన్ సేకరించిన వందలాది తెలుగు కావ్యాల ప్రతులు, పాఠభేదాలు పరిశీలించి నిర్దుష్ట పాఠాలను నిర్ణయించి 'తీర్పు' చేసిన తీరు, వాటికి ఆయన వ్రాసిన ఫుట్‌నోట్సు, పీఠికలు, వివరణలు — వీటన్నిటినీ సమగ్రంగా పరిశీలించి వెలుగులోకి తేవలసిన అవసరం ఎంతైనా వుంది. ఇది చేసినప్పుడే తెలుగుదేశం ఆయన ఋణాన్ని కొంతైనా తీర్చుకొన్నట్లు లెక్క. ఎందరెందరికి ఎన్నెన్ని రకాలుగానో జాబులు వ్రాసీ, ఆశలు జూపీ, ఎంతెంతో సొంతడబ్బు ఖర్చుపెట్టీ, కావ్యప్రతులు సేకరించీ, సాఫీ వ్రాయించీ, భద్రపరిచీ, వాటిని క్షుణ్ణంగా చదివీ, పరిశీలన చేసీ, చేయించీ, వ్యాఖ్యానాలు వ్రాయించీ, వాటితోసహా ముద్రించీ కావ్యనష్టం జరగకుండా భావి తరాలవారికి అందించి వెళ్లాడు. ఒక్క మనిషి ఒక జీవితకాలంలో అంత చేయగలగడం అపూర్వం. అందుకనే సవినయంగానూ, సగర్వంగానూ ఒక చోట ఇట్లా వ్రాసుకున్నాడు :

"...To revive the literature of a language was an ardous task for one man, and he a foreigner."*

"In 1825 I found Telugu literature dead. In thirty years I raised it to life."†

---

* చూడు : Literary Life of Charles Philip Brown, C. P. Brown, London, 1872, P. 26.

† చూడు: లండన్, ఇండియా ఆఫీస్ లైబ్రరీలో బ్రౌన్ వ్రాతప్రతుల సంపుటాలు. "European Manuscripts in the India Office Library Vol. II, Part II: Minor collections and Miscellaneous Manuscripts. Section 1., G. R. Kaye, London, 1937, P. 1053.

ఉదాహరణకు 'పల్నాటి వీరచరిత్ర' కావ్యవిషయంలో ఆయన పడిన శ్రమను, చేసిన పరిశ్రమను ఈ క్రింది జాబులు, నోట్సు కొంతమేరకైనా తెలుపుతాయి.

5

మహారాజరాజశ్రీ సీ-పీ- బ్రౌన్‌దొరవారి దివ్యసముఖానకు—

గుంటూరుజిల్లా యిలాకా బాపట్ల తాలూకాలో చేరిన పెదగంజాం కాపురస్థుడున్ను, హరిదాసున్ను అయిన గంజాం అప్పయ్య వినయ విధేయ పూర్వకముగా వ్రాసుకొన్న మనివర్జి విన్నపము—

మహారాజశ్రీ గుంటూరుజిల్లా ఆక్టింగ్ కలక్టరు పి- పార్క్సు దొరవారి పేర తమరు పల్నాటివీరచరిత్ర అనే గ్రంథమును వ్రాయించి పంపించుమని వ్రాయించినట్టుగా సదరు దొరవారు చినగంజాం సాల్టుతాణేదారువారి పేరను హుకుములు సాదరు చేయించినందున సదరుతాణేదారు నాతోను నీ తావున వుండే పల్నాటివీరచరిత్ర సహితంగా నన్ను పిలువనంపించి గ్రంథముల సహితంగా శ్రీ దొరవారి సముఖములోకి వెళ్లమని చెప్పినందున అంతట గ్రంథములు తీసుకొని దొరవారు సర్కిక్యూటులో వుండగా అక్టోబరు నెలలో దొరవారి సముఖానకు హాజరై నా దగ్గిర వుండే గ్రంథములను అగుపరచి నంతల్లో సదరు గ్రంథచరిత్రలు మొదట గంగ్గధార మడుగులో ప్రాణ లింగముల పట్టున కథ వ్రాసి దాఖలు చేసినందున సముఖంలోకి శ్రీ దొరవారు సదరు గ్రంథమును తమ సముఖములోకి పంపించి నందున ఆ గ్రంథము తమరు చిత్తగించి తిరిగీ సదరు గ్రంథం తాలూకు కొన్ని కాండల కథలు వ్రాయించి పంపించమని తమరు కలక్టరు దొరవారి పేరను వ్రాయించినందున అదేప్రకారం తిరిగీ నన్ను పిలవనంపించి సదరు గ్రంథము వ్రాసి యిప్పించవలసినదని శలవుయిచ్చి గోవకాగితాల బుక్కులు యిచ్చినందున ఆ ప్రకారం నేను యిదివరకు యెనిమిదికాండల కథలు వ్రాసి దాఖలు చేసినాను— తతిమ్మా కథలు వ్రాస్తూ వున్నాను.

కొన్ని నా దగ్గిరవున్న కథలుగాక తక్కిన కొన్ని కాండల కథలు నా తావునలేవు గనుక దేశములోకి వెళ్లి విచారించి జాగ్రతచేసి వ్రాశి దాఖలు చేస్తూ వున్నాను. నేను బహుకుటుంబినిన్ని, బీదవాణ్నిన్ని నాకు యేవిధమయిన

జీవనంలేనివాణ్ని గనక నన్ను యిప్పుడు మేలైన తమ దివ్యచిత్తానకు విశదం కొరకు మనివి వ్రాసుకొనేది యేమంటే—

నేను జన్మవ్రతంగా 40 సంవత్సరములనుంచి శ్రీరామమూర్తివారి నవరాత్రి వుత్సవాదులున్ను, శ్రీ నృసిహ్మమూర్తివారి వుత్సవాదులున్ను, శ్రీకృష్ణమూర్తివారి వుత్సవాదులున్ను బహుపురుష సద్భక్త సహాయంవల్లను జరుపుకుంటూ వున్నవాణ్నిన్ని గనక నాయందు సంపూర్ణానుగ్రహం దయచేసి గొప్ప ప్రభువులైన తమరు యీ బీదబ్రాహ్మణుని కుటుంబ సంరక్షణ చేసే కొరకు జీవనం జరగగలందులకు మా చిన్నవాడికి వకనౌకరీ దయచేయించ గలందులకు యీ జిల్లా కలక్టరు దొరగారిపేర శిఫారసు వుత్తరువు దయ చేయించవలెనని బీదవాణ్నిన్ని బహుకుటుంబినిన్ని అయిన నేను సదా కాలత్రయములయందున్ను నా కుటుంబ సంరక్షణ కర్తలయిన తమను అనే కములుగా ప్రార్థిస్తున్నాను — యీ అర్జీ తప్పు క్షమించకర్తలు — దివ్యచిత్తా నకు తేనవధరించవలెను. పెదగంజాం కాపురస్థుడున్ను-హరిదాసున్ను అయిన

ఆన 1852 సం॥ ది 14 జూన్. —గంజాం అప్పయ్యవ్రాలు.*

* * *

ఈ హరిదాసు అప్పయ్య బ్రౌన్‌ను ఇంతటితో వదల్లేదు. ఒకనెల కాగానే 1852 జూలై 24 తేదీన ఈ క్రింది మరొకజాబు వ్రాశాడు.†

6

....ఖామందులవారి దివ్యసముఖానకు—

**1852** సం॥ జూన్ **14** తేదిని నేను వ్రాసుకోబడిన మనివి అర్జికిగాను తాము **1852** సం॥ జూన్ **19** వ తేది వొక వుత్తరమున్ను సదరునెల **23** వ తేది వొక వుత్తరమున్ను జుములా రెండు వుత్తరములున్ను నాకు చేరి అందుల వుత్తర అభిప్రాయములు యావత్తున్ను గ్రహించి అందుకు మనవి వ్రాసుకొనే దేమన్నను లోవయినం తమరు మహారాజశ్రీ కలక్టరు దొరవారి ద్వారా వ్రాసి

---

*మ.ఓ.మే.లై. లోని బ్రౌన్ జాబుల సంపుటం ఎమ్. 427, పేజీలు 267-8.

†ఈ జాబుపైన బ్రౌన్—"This letter was written to me in July 1852 regarding the Palnati Charitra"—అని ఒక నోట్ వ్రాశాడు.

పంపించుమన్న పలనాటివారి చరిత్రలనే కథలు తాము వ్రాయించిన ఫేరిస్తుల ప్రకారం తమ అభిప్రాయ ప్రాపకానకు ముఖ్య ప్రాపకమును పొందవలెనని మిక్కిలి ఆపేక్షతను పొంది తమరు వ్రాయించిన ఫేరిస్తుప్రకారం గ్రంథముల యొక్క కథ చరిత్రలు యిప్పుడు పంపించుకున్న బాలునికాండ సహా తత్సమ్మంథమును అనుసరించి 2-రెండు కథలు విశేషం వ్రాయబడి వున్నది. మరిన్ని తాము వ్రాయించిన అజ్ఞప్రకారం నిల్వగ్రంథముల యొక్క వివరం—

బాదరాజ వురపు కంచర్ల యుద్ధకాండ 1-న్ని, రావీరపడాలు అనే ఝట్టి చిట్టిమల్లడనే కోడిని మాచర్లపట్నానకు తీసుకవచ్చిన కాండ 1-న్ని, పాల్వాయి రెంటాలబెళ్ల కోడిపందెం ఆడిన కాండ 1-న్ని జుములా 3-గ్రంథములున్నూ తత్కాలం వుపయోగించనందున యేతన్నిమిత్తం యీ కథలు వుండే దేశములకు వెళ్లగలందులకు తగిన ఖర్చులు జాగ్రత చేసుకొని అవి సంపాద్యం చేసి వ్రాయడానకు తాటి ఆకులమీద లిఖించడమున్ను గురించి షుమారు 1,000 ఆకుల అలేఖం అవుతున్నది— యిదిగాక గంగధారమడుగులో ప్రాణలింగాలు పట్టిన కథ చేరలేదని వ్రాయించినారు గనుక ఆ కథ పూర్వమె మహారాజశ్రీ కలక్టరు దొరవారి తావున వ్రాసి దాఖలు చేసికొనివున్నాను. పలినాటి చరిత్రలు ఆది అంత్యము వ్రాయించి పంపించుమని దయచేయించినారు. అందుకు మనివి వ్రాసుకొనేది. తమ శెలవు అయినపక్షమందు యీ గ్రంథ చారిత్రలనే ఆదిఅంత్యములు యేయే స్థళములలో వుండేది విచారించి ఖర్చుకు తీసికొనిపోయి వ్రాసుకొనివచ్చి ఖామందులకు జాహీరు చేసుకొంటున్నాను గనుక విశదంకొరకు మనివి వ్రాసుకొన్నాను.

పూర్వం మహారాజశ్రీ కలకటరు దొరవారు వినికొండలో విజయం చేసిన గంజాం సాల్తుతాశెదారు ద్వారా నన్ను పిలుపించుకొని తత్సమ్మంథ మైన గ్రంథముల నిమిత్తమై నీకు 50 రూపాయలు నిర్ణయపరచినామనిన్ని, అందు మింజుమలె రు. 5 లు నీకు ఖర్చుకు యిస్తాము పుచ్చుకోవలసినదనిన్ని, సదరు రు. 5 లు ఖర్చుకు యిచ్చి పేరిస్తులలో నిర్ణయించిన ప్రకారం గ్రంథ ములు ముగిసిన పిమ్మట సదరు ప్రకారం యిప్పిస్తామని ప్రభువువారు సెలవు యిచ్చినందున అందుకు నాయొక్క అభిప్రాయం అనగా మహారాజశ్రీగార్లతో నేను మనివిచేసుకొన్న సంగతి యేమంటె— 1818-19 సంవత్సరములలో నెల్లూరు జిల్లా యిలాకా తడ వగైరా కొఠార్లకు ర్పు. 35 యిలు జీతనిర్ణయంగల

సూపరిటిన్‌డ్యాంటు పనికి అర్హత కల్గినవాడని అప్పటి కల్కటరు మహారాజశ్రీ త్రాంసు ప్రేజరు దొరవారున్ను, అప్పట్లో కొత్వాల్ల కమిటీ దొరలు మహారాజశ్రీ జాన్ వాన్ దొరవారున్ను థాంస్ అసిస్టు దొరవారున్ను నాయందు కటాక్షించి పైన వ్రాసుకొన్న హొదాపని నిర్ణయించి హుకుం వ్రాయించి యిప్పించి నందున హుకుం ప్రకారం కొన్ని సంవత్సరములు పనిచూచి వున్నాననిన్ని, పిమ్మట బలమైన కాయిలావల్ల నవుకరి చాలించుకొని నా మిరాశి సమ్మంధమైన గ్రామంలో కాపురం వుండివున్నాననిన్ని, తత్కాలంలో కరిణీకం మిరాశి తమ్ముడు అనుభవిస్తున్నాడనిన్ని, యిప్పుడు నాకు జీవనోపాయం లేదనిన్ని, కాబట్టి ఖామందులు కటాక్షించి నాకు జీవనం కల్గజేసి నా నవుకరి యిప్పించ వలసినదిగా కోరినానే కాని తాము సెలవు యిచ్చిన ప్రకారం రు. 50 లు భుక్తంచేసి అనుభవింతామన్న అభిప్రాయం నాకు కల్గివుండలేదు— అని మహారాజశ్రీ కల్కటరు దొరగారితో మనవిచేసుకొని వున్నాను.

పూర్వం మహారాజశ్రీ కలక్టరు దొరవారి సముఖములో నేను వ్రాసి యిచ్చిన పేరిస్తు ప్రకారం పధ్నాలుగు కాండలు కథలకు అప్పట్లో హాజరు లేనివి— కంచర్ల యుద్ధం కథ 1-న్ని, అర్ధనాల చిట్టిమల్లుడనే కోడిని తెచ్చిన కథ 1-న్ని, పాల్వాయి రెంటాల బైళ్ల బాలగోపన్న పందెం ఆడిన కథ 1-న్ని, జుములా 3 కథలు లేనందున తతిమ్మా కథలు 11 న్ను పేరిస్తులోన మూడులో వ్రాయని కథలు— రెండున్ను జుమ్మిలా 13 కథలున్నూ ఈ తారీకువరకు వ్రాసి దాఖలు చెయ్యడమైనది, గనుక యీ తారీఖువరకేమి— యిఖను యేమి వ్రాయవలసిన బాకీలేదు— మరిన్ని మనివి వ్రాసుకొనే దేమంటే—

తమరు గొప్ప ప్రభువులనిన్ని మహదాశ్రయులనిన్ని యే విధంచేత నయినా తమ ప్రాపున చేరితే నేను యేమి నా కుటుంబములో చేరిన జనం యేమి సార్వకాలం జీవించడమునకు తగిన వుపాధి కల్పించి జీవనం దొరికే సాధన చేస్తారని అందువల్ల దైన్యంలేకుండా జీవించవచ్చునని నమ్మి యీ గ్రంథమును వుపక్రమణచేసి యెక్కడెక్కడ వుండే యీ సమ్మంధమైన గ్రంథం తెచ్చివ్రాస్తూ యిదివరకు వొక సంవత్సరంనుంచి మొహన్నతు చేస్తూ వున్నాను. నాయొక్క మొహన్నతు తమరు ఖుద్దున చిత్తగించినట్టయితే నా దరిద్ర విచ్ఛిత్తు అయ్యేలాగు యిదివరకే దయచేతురు. గ్రహచారస్థితివల్ల

పూర్వము యీ పల్నాటిచరిత్ర అనే గ్రంథము మీ దగ్గర కద్దనిన్ని దానికి వొకప్రతి మా తావుకు పంపిస్తామని ప్రతీతిచేత యిందున గురించి కలక్టరు సాహేబు మూలకముగా ర్పు. 5 లు వెలగల గ్రంథమునకుగాను ర్పు. 50 లు మీకు యిప్పించేలాగు కలక్టరు సాహేబు పేరటికి జాబు వ్రాసి యుంటిమి— తర్వాత ఆ తాలూకు కొంచెంపాటి భాగములు రెండు మాకు అందినవి— యివి చూస్తె మేము అపేక్షించిన గ్రంథము కాకపోయెన్ను— యిది యెవడో అల్లించిన జబ్బు కథలుగా విచారించియున్నాము— యిందున గురించి మీ పేరిట మేము తిరుగా జాబువ్రాసిన దానికి ఆ గ్రంథమునకు మాతృక అయినాసరే పుత్రిక అయినాసరే పంపిచివుంటే ఆ గ్రంథము యిక్కడ యెత్తి వ్రాయించుకొని తిరిగి మీ తావుకు అందించి యాభై రూపాయలు మీ చేతికి యివ్వడానికి సందేహముండదు.

ఆ గ్రంథము ఇక్కడికి వచ్చి ముట్టుతుందని మేము యెదురుచూస్తూ వుండగా ఆ గ్రంథము యెంతమాత్రము బంపక మీరు తిరుగా వేరే వొక జాబు వ్రాసి మీకు పూర్వములో కలిగిన వుద్యోగము యొక్క వృత్తాంతమున్ను మిమ్మున తిరుగా వుద్యోగములో పెట్టించేలాగున కలక్టరు సాహేబు పేరిట జాబు వ్రాసేటట్టున్ను యిషువంటి నిరాధారమయిన ప్రస్తాపములు వ్రాసినది చూడగా యీ గ్రంథము నిజముగా మీవద్ద లేదో యేమో, లేక యిక్కడకి పంపడానకు మీకు యిష్టములేదో యెమో అని విచారించి యున్నాము. మేము అడిగిన కొద్దిగ్రంథము నిమిత్తం మీకు యిది అది చేయవలెనని కలక్టరు సాహేబు పేరట మేము జాబులు వ్రాయవలెనని మనవి చేసుకోవడము పెద్ద మనిషి నడతకాదు. అదిగాక యాభైరూపాయలు యిచ్చేలాగున ఆమోదించ డము విశ్వాసం చేతనేకాని, మరి వేరేకాదు. ఆ గ్రంథము మాతృక అయినా పుత్రిక అయినా అనాయాసముగా మా వద్దికి పంపిస్తే మేము చెప్పిన రూపాయలు యిప్పించడానకు వొక ఆటంకములేదు. యిది త్వరగా చేయక పోతే మీ మాటలు వట్టి మాయగా తెలుసుకొని యీ గ్రంథము వేరేమార్గంగా రాబట్టుకొనేటందుకు విచారింతుము గనుక మీరు బుద్ధితెచ్చుకుని ఆ గ్రంథము అనాయాసముగా పంపించవలసినది— యీ ప్రకారం— రాజశ్రీ దొరవారి ఆనతిప్రకారం తమకు వ్రాయనైనది—*

---

*మ.ఓ.మే.లై. లోని బ్రౌన్ జాబుల సంపుటం, ఎమ్. 427, పేజీలు 285—7.

నేను తమకు దూరదేశస్తుండనై వున్నందున యిదివరకు సంవత్సరం నుంచి నేను నవుకరి చెయ్యటమున్ను ఖామందులకు దయరాకపోవటముకు హేతువు అయివున్నది. ఇంకా చాలాకాలం చాలా చోట్లనుంచి తెచ్చి వ్రాయవలసిన నిముకళాగ్రంధము వున్నది. తమరు దయచేస్తామన్న రు. 50 లు తీసుకొన్న పక్షముకు వ్రాసే కాలముకు వంటరి మనిషికి భత్త్యాఖర్చుకే చాలదు గనుక నేను లోవయినం చేసివున్నంత నవుకరీ జీతంగల పని అయినా దయచేసి యిచ్చేలాగున నెల్లూరు- గుంటూరు- బందరు- ఈ మూడు జిల్లాలలో వకచోట కల్క్టరు దొరవార్లకు వ్రాయించి దయచేయిస్తె ఆ నౌకరీవల్ల మేమందరం జీవిస్తూ తమరు శెలవు ఇచ్చిన గ్రంధము ఆది అంతము సాధ్యమైనంత త్వరితకాలములో పూర్తిచేసి వ్రాసి దాఖలు చేసుకొంటూ వున్నాను గనుక నేను సార్వకాలం జీవించవలెనని దైవాన్ని నమ్మినట్టుగా తమను నమ్మి సంవత్సరమునుంచి చేస్తూవున్న బీదనౌకరును అని చిత్తమందు వుంచి జీవనం యిప్పించి సంరక్షింపవలెనని మేలైన ఘనమును మిక్కలి వేడుకుంటూ వున్నాను. దివ్యచిత్తానకు తేనొధరించవలెను.

1852 సం॥ జూలాయినెల 24 తేది. —గంజాము పెదఅప్పయ్యహరిదాసు వ్రాలు.

* * *

ఈ జాబుకు బ్రౌన్ వ్రాయించిన ప్రత్యుత్తరం కూడా అదృష్టవశాత్తు దీని ప్రక్కనే కాపీ అయివున్నది. దానిపైన బ్రౌన్ "To which I wrote, not in my own name, this reply". అని వ్రాసిపెట్టిపోయాడు. ఆ జాబే క్రిందిది:

7

రాజమాన్య రాజపూజిత మహారాజశ్రీ గుంటూరు జిల్లా బాపట్ల తాలూకాలో చేరిన పెదగంజాం కాపురస్థుడైన హరిదాసు పెదగంజాం అప్పయగారి సముఖానకు—

ఆ. మ. వీరభద్రయగారు వినయపూర్వకముగా వ్రాసుకొన్న విజ్ఞాపన మేమన్నను— 1852 సం॥ జూన్ 23 తారీఖున మహారాజశ్రీ శ్రీ దొరవారిపేర మీరు వ్రాసుకొన్న అర్జి సునామణి అయినందుకు దొరవారు ఆనతిచ్చిన దేమన్నను—

---

*మ.ఓ.మే.లై. లోని బ్రౌన్ జాబుల సంపుటం ఎమ్. 427, పేజీలు 279_87.

పూర్వము యీ పల్నాటిచరిత్ర అనే గ్రంథము మీ దగ్గర కద్దనిన్ని దానికి వొకప్రతి మా తావుకు పంపిస్తామని ప్రతీతిచేత యిందున గురించి కలక్టరు సాహేబు మూలకముగా ర్పు. 5 లు వెలగల గ్రంథమునకుగాను ర్పు. 50 లు మీకు యిప్పించేలాగు కలక్టరు సాహేబు పేరటికి జాబు వ్రాసి యుంటిమి— తర్వాత ఆ తాలూకు కొంచెంపాటి భాగములు రెండు మాకు అందినవి— యివి చూస్తె మేము అపేక్షించిన గ్రంథము కాకపోయెన్ను— యిది యెవడో అల్లించిన జబ్బు కథలుగా విచారించియున్నాము— యిందున గురించి మీ పేరిట మేము తిరుగా జాబువ్రాసిన దానికి ఆ గ్రంథమునకు మాతృక అయినాసరే పుత్రిక అయినాసరే పంపిచివుంటే ఆ గ్రంథము యిక్కడ యెత్తి వ్రాయించుకొని తిరిగి మీ తావుకు అందించి యాభై రూపాయలు మీ చేతికి యివ్వడానికి సందేహముండదు.

ఆ గ్రంథము ఇక్కడికి వచ్చి ముట్టుతుందని మేము యెదురుచూస్తూ వుండగా ఆ గ్రంథము యెంతమాత్రము బంపక మీరు తిరుగా వేరే వొక జాబు వ్రాసి మీకు పూర్వములో కలిగిన వుద్యోగము యొక్క వృత్తాంతమున్ను మిమ్మున తిరుగా వుద్యోగములో పెట్టించేలాగున కలక్టరు సాహేబు పేరిట జాబు వ్రాసేటట్టున్ను యిషువంటి నిరాధారమయిన ప్రస్తాపములు వ్రాసినది చూడగా యీ గ్రంథము నిజముగా మీవద్ద లేదో యేమో, లేక యిక్కడకి పంపడానకు మీకు యిష్టములేదో యెమో అని విచారించి యున్నాము. మేము అడిగిన కొద్దిగ్రంథము నిమిత్తం మీకు యిది అది చేయవలెనని కలక్టరు సాహేబు పేరట మేము జాబులు వ్రాయవలెనని మనవి చేసుకోవడము పెద్ద మనిషి నడతకాదు. అదిగాక యాభైరూపాయలు యిచ్చేలాగున ఆమోదించడము విశ్వాసం చేతనేకాని, మరి వేరేకాదు. ఆ గ్రంథము మాతృక అయినా పుత్రిక అయినా అనాయాసముగా మా వద్దికి పంపిస్తే మేము చెప్పిన రూపాయలు యిప్పించడానకు వొక ఆటంకములేదు. యిది త్వరగా చేయక పోతే మీ మాటలు వట్టి మాయగా తెలుసుకొని యీ గ్రంథము వేరేమార్గంగా రాబట్టుకొనేటందుకు విచారింతుము గనుక మీరు బుద్ధితెచ్చుకుని ఆ గ్రంథము అనాయాసముగా పంపించవలసినది— యీ ప్రకారం— రాజశ్రీ దొరవారి అనతిప్రకారం తమకు వ్రాయనైనది—*

*మ.ఓ.మే.లై. లోని బ్రౌన్ జాబుల సంపుటం, ఎమ్. 427, పేజీలు 285–7.

ఈ ఉత్తరప్రత్యుత్తరాలు చూచిన తర్వాత ఎవరి వ్యాఖ్యానంతోనూ పన్లే కుండానే చాలా విషయాలు అర్థంచేసుకోవచ్చు. తెలుగు కావ్యసేకరణలో బ్రౌన్ ఎదుర్కొన్న అవస్థలు కొన్నయినా తెలిసివస్తాయి. పై జాబుల్లో దర్శనమిచ్చిన ఆ 'బీద' హరిదాసు ఆతర్వాత ఏమయ్యాడో తెలియదు. బ్రౌన్ కోరిన పల్నాటి చరిత్ర పంపాడా? పోనీ ఏదైనా వుద్యోగం సంపాదించుకొన్నాడా? ఈ ప్రశ్నలకు సమాధానాలు అంత సులభంగా దొరికేవి కావు.

బ్రౌన్ ఈ జాబు వ్రాయించేనాటికి దాదాపు తొమ్మిదేళ్ళ క్రితమే పల్నాటి వీర చరిత్రను క్షుణ్ణంగానే చదివి నిగ్గుతేర్చి వున్నాడు. అయినా ఇంకా ఏదో ఎక్కడో కొత్త వ్రాతప్రతి వున్నదని తెలిసి దానికోసమై కూడా ఆరాటపడ్డాడంటే, ఆయన నిరంతరమైన కావ్యశోధనలకు అదొక చిన్న మచ్చుతునక.

నెల్లూరుజిల్లాలో ఒక వ్యక్తి తారసపడితే బ్రౌన్ అతన్ని కూడా పల్నాటి వీర చరిత్ర ప్రతికోసమై పురమాయించాడు. అతగాడి రెండు జాబులు పరికిద్దాం:

## 8

మహారాజశ్రీ చారెల్సు ఫిలిప్ బ్రౌన్‌దొరగారి సముఖమునకు—

నెల్లూరుజిల్లా కోటతాలూకాలో చేరిన చిట్టేటి లక్ష్మీరాఘువప్పనాయుడు వ్రాసుకొన్న మనివి— నేను పట్టణమువచ్చి తమ దర్శనము సేయునప్పుడు తమరు సెలవిచ్చిన పలునాటి వీరచరిత్ర నుద్దేశించి గ్రామప్రవేశనము మొదలు కొని యావత్ ప్రయత్నమును వినియోగపరచినప్పటికిన్ని తమ సెలవు పద్ధతిని నెరవేర్చి దయాపాత్రుడనుకాక నే సేయు ప్రయత్నము నిష్ప్రయత్నమయ్యే కొరకు నీ ప్రాంతములలో ననగా నెల్లూరు జిల్లాలో యెక్కడ సంగ్రహింప పడనందున నాస్తిక వర్తమానము తెలియసేయుటకు సంకోచపడినాను గనుక క్షమించవలెను.

మరియు నన్య ప్రదేశములయందు తద్విషయక వ్యాసంగము సేయు చుండగా నొక స్తలమందు గ్రంథారంభము మొదలుకొని యర్ధభాగము లభ్యమయినందున నది వేరే లిఖితపరచియున్నాను. తక్కిన నర్ధభాగమును గూర్చి వ్యాసంగము సేయుచుండగా నొక స్తలమందు కలదని తెలిసి తన్నిమిత్త ప్రయత్నములు చేసినందున నా గ్రంథముగల గ్రహస్తు వొక దూరప్రదేశమునకు పోయి వారు రావడమునకు కొంత సావకాశమున్నట్టు

తెలిసినందున సమగ్రముగా గ్రంథం వొక తేప పంపించుకొను పాత్రుడను కాకపోయినా యిట్టి యావత్తు గ్రంథమును సముఖమునకు విశదపరచుకో వలయునని భ్రాంతివల్ల విశదపరచుకొన్నాను. గనుక సంపూర్ణాంతఃకరుణతో యే పద్ధతికి శలవు కటాక్షించుచున్నారో ఆ ప్రకారం నడుచుకొంటూ వున్నాను. చిత్తగించవలెను.

1852 నవంబరు 16 తేది. —చి. లక్ష్మిరాఘవప్పనాయుడు.*

* * *

సంపూర్ణగ్రంథం గాకపోయినా, దొరికినంతమటుకైనా పంపించమని లక్ష్మి రాఘవప్పనాయుడికి బ్రౌన్ జవాబు వ్రాయించినట్లున్నాడు. ఆమేరకు ఒక నెలరోజుల్లోనే కాపీ చేయించి బ్రౌన్‌కు చేర్చినట్లున్నాడు. అదే ఈ క్రింది లేఖ.

9

మహారాజశ్రీ సీ. పీ. బ్రౌన్‌దొరవారి సముఖానకు—

చిట్టేటి లక్ష్మిరాఘవప్పనాయుడు వ్రాసుకొన్న మనివి— తమరు పోయిన సంవత్సరం డిశంబరు 14 తేదిన వ్రాయించిన జాబు 20 తేదిన నాకు చేరినది. అందులో వుదహరించిన పల్నాటిచరిత్ర మొదటిభాగమును తక్షణమే పంపించుటకు పురాతన తాళపత్ర గ్రంథమందలి యెత్తి వ్రాయబడిన బుక్కు చక్కగా అక్షరములు బోధపడేది దుస్తరముగా వుండుటవల్ల వేరే మరివక బుక్కుయందు వ్రాయించుటవల్ల యింతమట్టుకు సావుకాశం అయి యిప్పుడు పంపించుకొన్నాను గనుక క్షమించుదురు అని కోరుతూ వున్నాను.

2 భాగమును గురించి తగుప్రయత్నం చేసివున్నాను. అందుల సంగతి త్వరలో చిత్తానకు శృతపరుచుకొంటున్నాను—

సదరు తాళపత్రగ్రంథం చాలా శిథిలమై అక్షరములు అగుపడని స్థలమందు జాగా విడిపించి గుర్తులువేసి పంపించుకొన్నాను. వుత్తరవు దయ చేయించ కోరుతూ వున్నాను. చిత్తగించవలెను.

ఆన 1853 జనవరి 18. —చి॥ లక్ష్మిరాఘవప్పనాయుడు†

---

*మ.ఓ.మే.లై. లోని బ్రౌన్ జాబుల సంపుటం ఎమ్. 432, పేజీలు 23_4.

† ఈ జాబు ఏ సంపుటంలో వున్నదీ వివరం నేను నోట్ చేసుకోలేదు. మళ్ళీ ఆ సంపుటాలన్నీ తిరిగి చూచే వ్యవధి లేక సంపుటి వివరం యివ్వలేకపోతున్నాను.

ఇట్లా నాలుగు చెరగులనుంచీ, కనపడ్డవాళ్ళందరి దగ్గరనుంచీ తెలుగు కావ్య ప్రతుల్ను గాలించి కానీ వదిలేవాడు కాదు. ఇట్లా పోగైన ప్రతుల నాధారం చేసుకొని పాఠ నిర్ణయం గావించి శుద్ధప్రతిని తయారుచేయించేవాడు బ్రౌన్.

బ్రౌన్ సేకరించిన పల్నాటి వీరచరిత్ర వ్రాతపతులు ఒకటికాదు రెండుకాదు, చాలా వున్నాయి. కొన్నిటిమీద ఇంగ్లీషులో సొంతంగా వివరణలు అనేకం వ్రాసున్నాడు. మ. ఓ. మే. లై. లో డి. 1112 నుంచి డి. 1174 దాకా 60 పైచిలుకు ప్రతులున్నాయి. వీటిలో ముప్పాతికవరకు బ్రౌన్ సేకరించినవే. తెలుగువాళ్ల అచ్చంగా సొంత ఇతివృత్తాన్ని ఎన్నుకొని నిర్మించుకొన్న కావ్యం గనుక, వేమన పద్యాల తర్వాత 'పల్నాటి వీరచరిత్ర' అంటేనే బ్రౌన్‌కు ఎక్కువ మక్కువ. ఆరోగ్యం బాగుండి ఇంక కొన్నేళ్లు ఇండియాలోనే వుండివుంటే పల్నాటి వీర చరిత్రను ముద్రించివుండేవాడు కూడానేమో.

1834 లోనే బ్రౌన్ పల్నాటి వీరచరిత్రకు ఒక శుద్ధప్రతిని వ్రాయించాడు. రాయలసీమలోని కదిరినుంచి, పల్నాటినుంచి రెండుప్రతులు సేకరించడమేగాక, ఒక వీధిగాయకుడిచేత పాడించుకొని వ్రాయించిపెట్టుకున్న ప్రతికూడా ఒకటి వున్నట్లున్నది. అరఠావు (ఫుల్‌స్కేప్ సైజు) దళసరి కాగితంమీద ఎడమపక్క సగంవరకు మాత్రమే నిడివికి కాపీ వ్రాయించి కుడిపక్క సగంలో దాదాపు ప్రతిచరణం ఎదుట ఇంగ్లీషులో వివరణాదులు వ్రాసుకుంటూ పోయాడు. ఒక వ్రాతపతి ఆఖరులో—"Finished first perusal 29 May 1843"—అని వ్రాసున్నాడు. ఇక మొదట్లో పీఠికా ప్రాయంగా సుదీర్ఘమైన నోట్సు వ్రాసున్నాడు. మరొక సంపుటంలో రెండు పేజీల బారున ఏకంగా 'ఇంట్రడక్షన్' అనే పేరుతో వ్రాసున్న అసంపూర్ణ భాగం చూస్తే, ఈ కావ్యముద్రణకు ప్రణాళిక వేసుకొన్నట్లే అర్థమవుతుంది. ఇవి చదువుతుంటే ముచ్చటేస్తుంది. ఈ రెండుచోట్లగల నోట్సును తెలుగులోకి తర్జుమాచేసి మన అనువాద ప్రజ్ఞకు పదునుపెట్టుకోకుండా యథాతథంగా ఇంగ్లీషులోనే ఉన్నది ఉన్నట్లుగా పరికిద్దాం:

"The easy flowing metre of this book is only a few steps removed from prose; and may be analogous to that used by Terence in Latin—unless they more nearly resemble the style used in the fables of Phadrus and Gay. This colloquial vein is despised by those Telugus who pretend to learning.........

"In May 1843 I received from Palnaud a second manuscript of this poem—but it contains only the latter half: BALU KATHA and is very much altered in the expressions. In july 1843 another manuscript was sent me from Kadri in Pulivendla: it likewise contains only the second part and is the BALU KATHA......newly modelled. The leading incidents and names are the same but many new incidents and episodes are inserted: the versification too is adjusted on the approved mode.........

"The author, though often a powerful writer, was no great scholar. His stanzas are often as rude as the artless verses we find in the PILGRIM'S PROGRESS: or, more precisely he is the Telugu Chaucer. yet no—He certainly does not rank lower (than Swift or Somerville).*

"Yes, on reconsideration he is the Chaucer of the language; but is not so antiquated in dialect. Many pages are in the easy dialect of the present day. To use the words of GIBBON (chapter 61 note 23). 'in a barbarous style it deserves the praise of an original and classic work'.

"There are several modern versions of this chronicle—one, the BALU KATHA is voluminous and greatly alters the story: another which is often chanted in the bazars deviates greatly from the original. From one man's dictation I caused a copy of more than a thousand lines to be written down—but like the Homeric rhapsodists these men rarely can repeat the same episode without material fluctuations. They are mere odds and ends......

"In manuscript (Vol. 565, Page 9) are the dates of Brahmi Naidu's death etc., and this is copied in Local Records Vol. X, Page 287. It was just after the death of Krishna Royal Viz., SS...

"The Palanati Vira Charita bears every mark of antiquity. The structure of the metre is rude and rhymes are careless; the PRASA rhyme is rarely used: in the YATI rhyme the consonants are generally correct but the vowels are quite at random. Many verses are without any rhyme and will not even scan.

"The language is on a par with that of the old English ballads: several words being obsolete but the style clear though

*The words in the brackets were scored out by Brown himself.

vulgar, The poet evidently had little learning: yet is forced to lower his style to suit his illiterate audience.

"The manners have a Homeric simplicity; with a chivalric degree of homage to ladies: who take a prominent part in the story.

"The Mahabharat is spoken of as a well-known work; but the poet relates several of the fables in that poem: which therefore could not have been much read. The Brahminical gods are but slightly noticed; and Brahmins are neglected. The book also is free from both the obscenity and the ranting divinity in which Brahmins delight: also from the idle mysticism they teach.

"In the battles as at page...410 the poet has pleased to introduce the kings of every country he had ever head of: as those of Bengal and Berar: and he mentions the hosts of troops as amounting to some thirty millions. The style is rude but many of the most remarkable rude words occur in the Mahabharat such as 'ఏనిక' instead of 'ఏనుగ' an elephant.

"The memorandum written at the beginning runs thus—In the year A. D. 1015 MXV in 938 of the Salivahana era, named 'RACTAXI' on Monday the 2nd of SARAVANA, began this war and lasted seven years. This is written in prose and probably was traditionally preserved. (The year 938 Salivahana - 1017 A. D. but as here noted it is reckoned to be A. D. 1015).

"In Brigg's History of the Mohomedan power (translated from FERISHTA) anno A. D. 1015 (Vol. I, Page 55) there is no notice of any transactions in the South of India—yet this poem speaks of the Musulmans as residents in the Palnaud. Hence I conclude it belongs to a later age. Yet in the description of the battle (Page 138) bows, arrows and spears are described but no guns—now this shows that the fight must have taken place many centuries back.

"Several expressions...........regarding the horse shew the great antiquity of this book—perhaps 400 years old. In ascertaining the date do not overlook the fact that the Jangams were at that time a powerful sect...The BASAVAPURAN and the MAHABHARAT are named as books of equal sanctity!

"If this war is to be dated A. D. 1015 the BASAVAPURAN must be atleast 200 years older: and the events related in that puran must be atleast 200 years preceeding. This would lead us to believe the correctness of the most remote date cited by Dr. Francis Buchanan. (see Madras Journal XII 290). Buchanan (Eastern India 3. 557) speaks of the GRAMADEVATAS as being probably older than those introduced by VYASA."*

## "PALNATI CHRONICLE"

### "INTRODUCTION"

"The Telugu language abounds in translations förm Sanscrit, Canarese and even Tamil: but possesses few original poems of any great length or merit. Those "fashionable" works that are considered original are in fact copied in every page from Sanscrit: and few are sufficiently easy to encourage a foreigner in his study of the Telugu language. He indeed must descend to a rustic class of works so low that natives of education reject with scorn. Such are the vernacular volumes which the unlearned read with delight; and which a foreigner will find not only entertaining but excellently suited to his wants. The DWIPADA "couplet" versions of the Tales of HARISCHANDRA and NALA, and SARANGA DHARA, with PRABHU LINGA LILA and the BASAVAPURAN, all seem easy to a native but all may appear somewhat difficult to a foreigner. He may therefore commence with the Palnati Chronicle which is but one grade above the Verses of Vemana. It is in fact a prolonged ballad, much in the style of the antique poems whereupon the Lay of the Last Ministrel is founded.

"But it is more profitable and more entertaining than the Brahminical works which like the MAHABHARAT, the BHAGAVAT and the RAMAYAN, are translations from Sanscrit.

"In the life of Hick, "the village Blacksmith" page 82 — "To persons in the polished circles it was a relief to the mind to be with him; one of those novel scenes but occasionally met with in the landscape of life. Instead of the dull monotonous plain,

*Madras Government Oriental Manuscripts Library, Vol. No. D. 1130 (Telugu) fol. 1-3.

whose richest garb becomes common place by constantly gazing upon it, in Samuel it was like broken rocks, wood and water: a piece of moor land, with patches of rich soil beneath the heath, with here and there a flower of surprising beauty springing up in the midst of the wilderness..."*

ఒక తెలుగు కావ్యం గురించి అప్పటివరకు లభించివున్న ఆకరాలను దృష్టిలో పెట్టుకొని కూలంకషంగా పరిశీలించి ఎడిటర్ (పరిష్కర్త)గా ఎంత శాస్త్రీయమైన ధోరణిలో చర్చచేశాడో చెప్పకనే చెప్తున్నవి పై బ్రౌన్ వ్రాతలు. కథాకాలం, ఇతివృత్తం, శైలీజాలం, కథనంలో కనపడే సాంఘిక విషయాలు మొదలైన విశేషాలనన్నీ సూక్ష్మపరిశీలనచేసి తెలుగు కావ్య స్వరూప స్వభావాలను వింగడించి చెప్పడంలో బ్రౌన్ పోకడ తర్వాతి తరాలవారికి ఎందునా తీసిపోవడంలేదు. నేను చూచినంతవరకు అక్కిరాజు ఉమాకాన్త విద్యాశేఖరుడు, పింగళి లక్ష్మీకాంతం-అవసరాల సూర్యారావు పల్నాటివీర చరిత్రకు పరిష్కర్తలనిపించుకొన్నారుగానీ వీరెవరూ వీటిని సంప్రతించిన పుణ్యం గట్టుకోలేదు. సిద్ధాన్నంగా బ్రౌన్ ఇంత సమకూర్చిపెట్టిపోయినా వీటినంతా చూచి చర్చించిన నాథుడే నేటివరకు మనకు కరువయ్యాడు!

మరచాను. ఆఖరుగా ఒక మాట. పల్నాటివీర చరిత్ర గురించి 'బ్రౌణ్యం'లో చెప్పిన మాటలు పరికిద్దాం:

"The పల్నాటివీరచరిత్ర ద్విపద or Wars of the Palnadu; to the west of Guntoor: the occurances described took place about the year A. D. 1160. Wilson (Mackenzie Mss. Vol I, P. 305) reckons the date of this war A. D. 1080—1087: which is too early. The poem is interesting as giving a picture of the primitive Telugus, as they lived before the Musulman invasion. It is written in a style sometimes learned, elsewhere rustic: in about ten thousand three hundred lines. The volume is despised by the learned but is of value to the student. It is amusing and very profitable to the beginners. An edition of this has been prepared."

బ్రౌన్ ఆరోగ్యం మధ్యలో వికటించి లండన్‌కు వెళ్ళిపోకపోతే, ఇంత మమకారాన్ని చూపిన పల్నాటివీర చరిత్రను ముద్రించి మరీ వెళ్ళివుండేవాడేమో.

*Madras G. O. M. L., Vol. No. D. 1156 (Telugu) fol. 99.

# 4

అక్షరాలా బ్రౌన్ జాబు

## వ్యాఖ్యాన సహిత వసుచరిత్ర మొదటి ముద్రణ

వసుచరిత్ర తెలుగులో వున్న జటిలమైన కావ్యాలలో ఒకటి. అటువంటి వసుచరిత్రకు వ్యాఖ్య వ్రాయించి, సామాన్యుడు కూడా గురువుతో అవసరం లేకుండా చదువుకొని తనకు తానుగానే అర్థం చేసుకొనేలాగున టీకాసహిత ముద్రణను వెలువరించాలనుకోవడం చూస్తే, ఆయన ఎంతగా సామ్రాజ్యవాద తత్వంలో కూరుకుపోయివున్నా మున్ముందు రాబోయే సామ్యవాద ధోరణిని కాస్తయినా ముందుగా వూహించుకోబట్టి ఆయన ఆలోచనాసరళి అంత ప్రజాస్వామిక ధోరణిలో పయనించిందని అర్థం చేసుకోవచ్చు.*

---

*బ్రౌన్‌లోని ఫక్త 'బ్రిటీష్ ఓరియంటలిస్ట్' వ్యక్తిత్వాన్ని చూచి అంచనా కట్టడానికి ఆయన చేసిన ఇటువంటి సాహిత్య కృషి ఎంతగానో కానవస్తుంది. దక్షిణాదిభాషా సాహిత్యాలకు సంబంధించినంతవరకు విశేషమైన కృషి చేసిన 'ఓరియంటలిస్టుల' శ్రేణిలో బ్రౌన్‌కు ఒక అగ్రస్థానం వుంది. ఒక విధంగా 'అతి'గా జరిగిన ఈ రకమైన హిందూ కావ్యావలోడనవల్లనైతేనేమి, 'అకల్చరేషన్' (acculturation) ప్రభావంవల్లనైతేనేమి సర్ విలియం జోన్స్ (Sir William Jones, 1746-1794), సర్ చార్లెస్ విల్కిన్స్ (Sir Charles Wilkins, 1750-1836), హెచ్. టి. కోల్‌బ్రూక్ (Henry Thomas Colebrook, 1765-1837) వంటి కొందరు బ్రిటీష్ ఓరియంటలిస్టులు 'వెస్ట్రన్ బ్రామిన్స్' (western Bramins) గా తయారయ్యారని ఒక విమర్శ వుంది. ఈ లక్షణాలు కొంత బ్రౌన్‌లో వున్నా ఆయన

తెలుగు కావ్యాలను ముద్రించడంపట్ల బ్రౌన్ ఎంతటి మమకారాన్ని కనపరిచాడో తాను వ్రాసిన ఈ జాబునుబట్టి కొంతకు కొంతైనా ఊహించుకోవచ్చు.

## 10

రాజశ్రీ వరెం అద్వైత బ్రహ్మయ్యశాస్త్రుల్లగారికి సల్లాం. త॥

ఆ దేశముకు మీరు చేర్ని తరువాత మీకు ఆరోగ్యమైన సంగతిన్ని కాని సంగతిన్ని వినకపోవడమువల్ల నిండా విచారముగా వున్నాము. దైవసహాయంవల్ల త్వరగా ఆరోగ్యము కావలెనని కోరియున్నాము. మెట్టుకు యిందును గురించి త్వరగా మాకు యెరుకచేస్తే బహు సంతోషిస్తూ వున్నాము.

ప్రస్తుతం వ్రాయించే సంగతి యేమంటే పోయినసెల ఆరంభంనుంచి వసుచరిత్ర ఛాపా చేశేపని బొత్తిగా నిల్చిపోయినది. యిందువల్ల మనకు చాలా ఫలం రావలశినందుక్కు ఫలంరాకుండా నష్టం సంభవించబోతున్నదని చింతపడి యున్నాము. యీ పని యెందుకు నిల్చిపోయినదో అని విచారించినంతల్లో ఛాపా చేశేవాండ్లకు మనము అయిదువందల రూపాయీలమట్టుకు బాకీపడి నట్టుగా తెల్సినది.

యీ పని యింతదూరం జర్గించివుండి మధ్య చాలించుకోవడం మహా హానికరంగాని మరి వకటికాదు. ఇంటికి గోడలు కట్టిన తర్వాత పైకప్పు మాత్రం బాకీవుంచి ఆ కొంచం కుదిరించకుండా యిల్లు యావత్తు పాడు చెయ్యడం యంతపని అవునో యిదిన్ని అలాగ్నునే వున్నది. యీ పని చాలించే బుద్ధి మీకు వకవేళ ఉదయించినదేమో అని సందేహించి మనకు ప్రత్యా

---

లోని 'క్రైస్తవమతతత్వం' ఏమాత్రం మొక్కవోలేదని హామీ యిస్తున్నాడు బిషప్ కాల్డ్వెల్ (Bishop Robert Caldwell, 1814-1891). చూడు: Reminiscences of Bishop Caldwell, Madras, 1894.

భారతీయ సాంస్కృతిక పునరుజ్జీవనానికి తోడ్పడిన మూడు ప్రధాన శక్తులు — మిషనరీలు, ఓరియంటలిస్టులు, ఆంగ్లిసిస్ట్లు — వీరి ప్రభావాన్ని మనం అంచనావేసుకోవల్సివుంది. బెంగాల్‌ను కార్యరంగంగా తీసుకొని ఈ రకమైన అంచనా వేసిన పరిశోధన గ్రంథాలు అనేకం వచ్చినా, దక్షిణాది ప్రాంతానికి సంబంధించి ఇంతవరకు చెప్పుకోదగిన ఒక్క పుస్తకమైనా లేదు! ఆ గ్రంథాలలో దక్షిణాదికి సంబంధించిన సమగ్ర చిత్రమే లభించడంలేదు.

మ్నాయం యితరులు యీ పనిమీద పడేటట్టు యోచించియున్నాముగాని ఆ చొప్పున కుదరకపోయ్నుది.

యెందునుంచి అంటే పని సఘంమట్టుకు జర్గివుండగా పరులు యిందులో చెయ్యి వేశేటందుకు సంకోచిస్తూ వున్నారు. మరిన్ని వాండ్లు అట్లా సంకోచించడం న్యాయమేలే. యెందుకంటే వకరు ఆరంభించిన పనిని మరి వకరు ఉద్యోగించి తీర్చడం అపరూపమై బుద్ధి దూరమై వుండును. యీ పని యీ తీరుగా పడియుంటే మనకు యావత్తునష్టి సంభవించకుండా మీకు యెరుకచేయడం మాకు ధర్మమే. మీరై యీ పని కడాకు జర్గించడానకు బుద్ధిలేకపోయ్ని పక్షముకు ఉత్తరోత్తరా పరులు యిందులో ప్రవేశించి కడాకు సాగించిన పక్షమందు దీనియొక్క ఫలమేమి, పెట్టుబడిరూకలు యేమి తిర్గి మనకు రావడానకు ఆకరం కనుపించలేదు.

దివ్యఫలమున్నూ శాశ్వతమైన పేరున్నూ రావలశ్ని పని యెడల సుఖం యంతమాత్రం సంభవించకుండా నష్టం తెచ్చుకోవడం లేత పన్ని అవును గన్క మీరు అవశ్యకరముగా నేను యీసారి చెప్పుకున్న బుద్ధిని ఆలోచనకు తెచ్చి, ఆ వర్సగా మన సుబ్బారావు యీ పని ఆఖరు పర్యంతం కాజేశేలాగు మీరు అవశ్యముగా యేర్పరచవలెనని యీ జాబు మీ పేరిట వ్రాయించడ మైనది.

యిదిగాక మేము చెప్పుకున్న ఆంధ్ర వ్యాకరణమున్ను ఆంధ్ర నిఘంటున్ను యింగిలీషు నిఘంటున్ను యీ మూడు గ్రంథములున్ను తామే అయి చాపా చెయ్యడముకు యిక్కడవుండే వక పుస్తకాల వర్తకుడు యత్న పడి మా దగ్గెర దరఖాస్తు చేసినాడు గన్క యీ మూడు పొస్తకాలున్ను నేను యేర్పరించిన ప్రకారమే స్వచ్ఛంగా పుట్టే సమయం వచ్చినది కాబట్టి యీ సమాచారం మీకున్ను సంతోషకరమే గన్క వ్రాయించడమైనది. యింతే సల్లాం.

1840 జనవరి 31. C. P. Brown*

* మ.ఓ.మే.లై. లోని బ్రౌన్ జాబుల సంపుటం ఎమ్. 401, పేజీలు 175-6. (ఇండెక్సు పేజీలో ఈ జాబు దగ్గర "on publishing Vasu Charitra" అని బ్రౌన్ వ్రాసున్నాడు.)

తెలుగు కావ్య ముద్రణలపట్ల బ్రౌన్ ఆవేదనను, మమకారాన్ని ఈ జాబు ధ్వనిస్తున్నది. ఖర్చుపెట్టిన డబ్బు వృథా అవుతున్నదే అనే దృష్టితో గాకుండా, కావ్య ముద్రిత ప్రతి విడుదల కాలేదే అనే కొరతే ఎక్కువగా కనపడ్తున్నది.

1832లో ప్రారంభమై 1834లో వసుచరిత్ర వ్యాఖ్యానం పూర్తయినా ముద్రణ (చాపా) 1844లోగానీ పూర్తికాలేదు. 1839-40లో ముద్రణ ప్రారంభమై ఎన్ని విఘ్నాలను ఎదుర్కోవల్సివచ్చిందో ఈ జాబునుబట్టి కొంతకు కొంతైనా అర్థం చేసుకోవచ్చు. 'అచ్చుముచ్చట్లు' అని మున్ముందు రాబోయే అధ్యాయంలో ప్రస్తావనకు వచ్చే ఒక జాబులో ప్రెస్ వర్కర్ వ్రాసినదాన్నిబట్టి 1833లో వసుచరిత్రలోనుంచి 'నాలుగు సైడ్లు' (నాలుగు పేజీలు) ముద్రణైన దాఖలా కనపడ్తుంది. 1842 ఆగస్టు 4వ తేదీ 'వర్తమాన తరంగిణి' పత్రికలో వచ్చిన వ్యాపారప్రకటనలో "వసుచరిత్ర—టీకతో 4 అశ్వాసము పర్యంతము తయారుగా వున్నవి. మిగిలిన రెండు అశ్వాసములున్నూ పూర్తికాగానే యిప్పించడమవును. రు. 10" అని వున్నది.

అంటే, 1840 జనవరి 31న ఈ జాబులో వ్రాసినట్లు ఆ మిగిలివున్న రెండు అశ్వాసాలు ఎందువల్లనో చాలా కాలందాకా—1842 ఆగస్టుదాకా—ముద్రణ గాకుండా నిల్చిపోయినట్లున్నది. కారణం ఏమై వుంటుంది? ఏమైనా, ఇక ఇప్పట్లో ఈ వసుచరిత్ర ముద్రణ పూర్తికాదేమోనని గట్టిగా తేల్చుకొన్నమీదటే, అచ్చు అయినంతవరకు సిద్ధంచేసి విడుదలకు ప్రకటన చేయించినట్లున్నది. ఈ విఘ్నానికి ఏదో ప్రబలమైన కారణం వుండివుండాలని శోధిస్తుంటే 1840 సంవత్సరంనాటి ఫోర్ట్ సెంట్ జార్జి గెజిట్ పత్రికలో కీలకమైన ఒక వార్త ఎదురైంది. బ్రౌన్ ఆవేదనతో వ్రాసిన ఈ జాబుకు బహుశా అద్వైతబ్రహ్మశాస్త్రినుంచి జవాబు కూడా వచ్చివుండదేమో కూడా. ఆరోగ్యం బాగాలేక అయిపులేకుండా మద్రాసు వదిలి (మచిలీపట్నం ప్రాంతం) వెళ్ళిన వ్యక్తి ఇంకేం జాబు వ్రాసివుంటాడు? ఈ జాబు వ్రాసిన మరో మూడు నెల్లకల్లా అద్వైతబ్రహ్మశాస్త్రి ఆరోగ్యం వికటించి పరమపదం చేరుకున్నట్లున్నది. దీనికి ఆధారం? ఇదుగో ఈ వార్తే:

"The Court of Sudr Udalut have made the following appointments:

"S. Anuntacharry, Junior Pundit of the Court of Sudr Udalut, to be Senior Pundit in the said Court, vice Advaita Brumma Sastry deceased... —4 th May, 1840."*

* చూడు: The Fort St. George Gazette, 1840 May 8, P. 1.

అంటే, అద్వైతబ్రహ్మశాస్త్రి ఏ ఏప్రెల్ నెలలోనో మరణించి వుండాలి. బ్రౌన్ మచిలీపట్నంలోని జిల్లా కోర్టు రిజిస్టర్ (రిజిస్ట్రార్)గా 1822-25 మధ్య పని చేసినప్పుడు అదే కోర్టులో పండిట్‌గా వున్న అద్వైతబ్రహ్మశాస్త్రి దరిమిలా ప్రమోషన్ మీద మద్రాసు సదర్ అదాలత్ కోర్టులో సీనియర్ పండిట్ పదవిలోకొచ్చి బ్రౌన్‌కు సాహిత్య విషయాల్లో చేదోడువాదోడుగా వుంటూ కడకు ఇట్లా కాలధర్మం చెంది వుండాలి.

ఈయన చనిపోయిన తర్వాత వసుచరిత్ర ముద్రణను పర్యవేక్షించే గట్టి వ్యక్తి కరువై వుంటాడు బ్రౌన్‌కి. దీంతో ఇక ఇప్పట్లో ముద్రణ పూర్తయ్యేట్లు లేదని తీర్మానించుకొని, అప్పటివరకు అచ్చయి నిల్చిపోయివున్న నాలుగు ఆశ్వాసాల వరకైనా అమ్మకానికి విడుదల చేసినట్లు వర్తమాన తరంగిణి పత్రిక (1842)లో ప్రకటన చేయించివుంటాడు. ఆ తర్వాత నెమ్మదిగా ఏ జూలూరి అప్పయ్యశాస్త్రినో పిలిపించి ముద్రణ పూర్తిచేయించి 1844లో పూర్తి ప్రతిని విడుదల చేయించి వుండాలి.

వసుచరిత్ర ప్రతిపదటీక వ్రాసింది జూలూరు అప్పయ్యశాస్త్రి అయితే, వర్యం పండితుడికి ముద్రణ వ్యవహారాలు అప్పగించినట్లున్నాడు బ్రౌన్. ఇట్లా ఇన్ని విఘ్నాలు దాటుకొని వసుచరిత్ర ముద్రణ ఎట్లాగో పూర్తయిందని అనిపించిన ఏడేళ్ళ తర్వాత గానీ, 1851లో గానీ మనుచరిత్ర టీకా ప్రతిని అచ్చువేయించలేకపోయాడు బ్రౌన్. అయితే 1842 నాటికే మనుచరిత్రను టీకారహితంగా వట్టి మూలం మాత్రమే అచ్చు వేయించినట్లున్నాడు.* ఈ మనుచరిత్రకు టీక రూపొందించింది కూడా జూలూరు అప్పయ్యే. చూడబోతే, టీకా బ్రహ్మలాగా బ్రౌన్‌కు అప్పయ్య దొరికినట్లున్నాడు. మనుచరిత్ర ఈ మొదటి ముద్రిత ప్రతిని చూచినవారు మనలో అట్టే ఎక్కువమంది లేరనే చెప్పాలి. చూచివుంటే, "పెద్దనార్యుని యీ మనుచరిత్రము తొట్టతొలుత క్రీ.శ. 1862లో ముద్రింపబడినది"—అని ఆచార్య తిమ్మావజ్ఝల కోదండరామయ్య తప్పుగా వ్రాసివుండేవారు కాదు.†

* చూడు: 'వర్తమాన తరంగిణి' తెలుగు వారపత్రిక, 1842 ఆగస్టు 18 తేదీ సంచికలో వచ్చిన తెలుగు పుస్తకాలకు సంబంధించిన వ్యాపారప్రకటన— "మనుచరిత్ర మూలము, రు. 2".

† మనుచరిత్రము, ఆం.ప్ర.సా. అకాడమీ ప్రతి, హైదరాబాదు, 1966, తిమ్మావజ్ఝల కోదండరామయ్య ఉపోద్ఘాతము, పేజి 47.

శ్రీ కోదండరామయ్య చెప్పిన 1862 ముద్రణను నేను చూడలేదుగానీ, "1851లో సంవత్సరము—మహారాజశ్రీ సీ-పీ-బ్రౌన్ దొరవారి అనుమతి ప్రకారము భువనగిరి చినరంగయ్యశెట్టిగారు స్వముద్రాక్షరశాలయందు అచ్చువేయించినా"రన్న ప్రతిని చూశాను. 1842 నాటికి వట్టి మూలమూ, 1851లో వ్యాఖ్యతో కూడాను అచ్చయిన బ్రౌన్ మనుచరిత్ర ఆ తర్వాత వచ్చిన ముద్రణల ధాటికి నిలవకపోనూ లేదు. అది అంతటితోనే అంతరించిపోనూలేదు. పైపెచ్చు ఆ మలి ముద్రణలకు అది ఒక 'నమూనా'గా ఎంతగానో తోడ్పడింది. 1875 దాకా బ్రౌన్ ముద్రణనే అప్పటంగా వాడుకొంటూ వచ్చామనడానికి ఆ సంవత్సరంనాటి ఒక ముద్రణ తాలూకు ముఖ పత్రమే చెప్తున్నది:

"శ్రీరస్తు. శ్రీమదాంధ్ర కవితాపితామహ సర్వతోముఖాంక పంకజాక్ష పాదాంబుజాధీన మానసేందిందిరానంద నందపురవర వంశోత్తంస శఠగోప తాపస ప్రసాదాసాదిత చతుర్విధ కవితామతల్లికాల్లసాని చొక్కయామాత్యపుత్ర పెద్దనార్య ప్రణీతంబైన, స్వారోచిష మనుసంభవంబను నిమ్మహాప్రబంధంబునకు ననవద్య విద్యాసాగర విహార సుజనోపహార తారహారహీర డిండీర విస్తార యశోదారులగు, చార్లెస్ సీ-పీ-బ్రౌన్ దొరవారి యుత్తరువు ప్రకారము, పండిత మండల మండితులగు జూలూరు అప్పయపండితులచే,సరసముగా విరచింపఁబడిన-ప్రతిపద టీకా సహితముగా ఆ-సరస్వతి-నృసింహాచార్యులచేతఁ బరిష్కరింపఁబడి, పిళ్లారిసెట్టి-రాఘవయ్య నాయని వారి స్వకీయ శ్రీ భారతీ నిలయ ముద్రాక్షరశాలయందు ముద్రింపించి ప్రచురము చేయబడియె, 1875 సం॥, చెన్నపురి."

మొన్నీమధ్యనే, హైద్రాబాదునుంచి డాక్టర్ చేకూరి రామారావు ఒక జాబులో: "తపసి(ని)—అంటే బ్రౌణ్యంలో 'the tree called అవసిచెట్టు' అనే అర్థమిస్తూ మనుచరిత్రలోని 3వ ఆశ్వాసం, 100వ పద్యం 'అపరిమితానురాగ....దపసిని గౌగ లించె....' అనే పద్యాన్ని ప్రమాణంగా చూపాడు. శ.ర.లోనూ, సూ.ని.లోనూ ఇదే పద్యాన్ని ఇచ్చారు. కానీ సూ.ని.లో ఈ పద్యాన్ని 3వ ఆశ్వాసం, 77వ పద్యం అని పేర్కొన్నారు. ఈ తఫిసీలేమిటి"—అని ప్రశ్నించారు. తెలుగు కావ్యాల పద్య సంఖ్యా క్రమం బ్రౌన్ ముద్రణల్లోనూ, వ్రాతప్రతుల్లోనూ భిన్నంగా వుంది. సీసపద్యం కింద వచ్చే ఆటవెలది, తేటగీతులకు కూడా వేరే సంఖ్య యిచ్చుకుంటూ వచ్చాడు. పద్యాల మధ్య వచ్చే వచనాన్ని కూడా విభజించి రెండు, మూడు, నాలుగు సంఖ్యలు యిచ్చు కుంటూ వచ్చాడు. ప్రధానంగా ఇందువల్లనే ఈ తేడా కనపడ్తున్నది. అంతేగాక,

బ్రౌన్ ముద్రణలకూ, ఇప్పుడు చదువుకుంటున్నవాటికీ వున్న ఇంకా ముఖ్యమైన తేడాలేమిటో చూచి చెప్పినవాడేడీ?

వసుచరిత్రను వదిలి మనుచరిత్ర గురించి ఇంత దీర్ఘంగా ప్రస్తావించుకోవడం వుచితం కాదు. 1844 నాటి వసుచరిత్ర ముద్రణకు బ్రౌన్ పీఠికాప్రాయంగా Notice అనే పేరుతో నాలుగు ముక్కలు ఇంగ్లీషులో వ్రాశాడు:

"The Vasu Charitra, written by Bhattu Murti (about the year A. D. 1450) is esteemed the most perfect poem in the Telugu Language. Three commentaries have been framed to explain it, and of these the third, (in familiar Telugu) written at my desire by a learned bramin in my employ, (in the year 1833) is now printed. The former annotators have chiefly criticised the peculiarities of rhetoric, rhyme, or orthography; but the present notes have a very different object being intended to explain the text, word by word, in the clearest manner, so as to do away the necessity of oral instruction. Similar commentaries have been prepared, explaining the Manu Charitra, the Vijaya Vilasam, the Tara Sasanca Vijayam, the Cavi Carna Rasayanam, the Saranga Dhara Charitra, the Dasavatara Charitra and several other Telugu poems of celebrity.

Madras, Feb. 1844. C. P. Brown."

ఈ మిగతా వ్యాఖ్యానాలు, వాటితోబాటు బ్రౌన్ ఇంగ్లీషు తర్జుమాలు, నోట్సు వగైరాలు ఈనాటికీ అముద్రితంగానే పడివుండడం శోచనీయం.

# 5

బ్రౌన్ మరొక జాబు

# వేమన పద్యాల పరిష్కరణకు బ్రౌన్ పడ్డ తంటాలు

వేమన పద్యాలపై పండితదృక్కులు సారింపజేసి వాటిని మొదటిసారిగా వెలుగులోకి తెచ్చిన వ్యక్తి బ్రౌన్. రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారు అంటున్నారు చూడండి: "…. …కావుననే, అందందు కొన్ని యనావశ్యకమైన సవరణలున్నను, చిన్నదైనను, ఇప్పటికిని బ్రౌన్ దొర ముద్రణమే సర్వోత్తమమని చెప్పుటకు సిగ్గగుచున్నది. అతడు మనకుజేసిన మహోపకారమును నేనరగంట చూచుచున్నానని తలపకుడు. చెన్న పట్టణములోని ప్రాచ్యపుస్తకశాలలోని వ్రాతప్రతుల నొకమారైనను చూచినవారికి తప్ప తక్కినవారికా మహనీయుని యప్పు తెలియదు. కాని యతడు దోసిలి నిండ బెట్టినను, పెట్టినదెంత మంచి వస్తువైనను, అది బిచ్చమే. ఆతని యౌదార్యమున కతనిని పొగడుదుము. కాని మన దారిద్ర్యమునకు సిగ్గు పడవలదా? ఇందరు తిండికి దండుగ తెలుగువారుండి వేమనవంటి వాని విషయమైకూడ ఇంకను తెల్లదొరగారి తిరిపెమునకే యొడిబట్టవలసినందు కేడ్వవలదా?"*

'వేమన వంటివాని విషయమై కూడ….' అనే వాక్యంలో 'కూడ' అనేది ముఖ్యమైన పదంగా కనపడ్తున్నది. 'మహాభారతం….' అధ్యాయం (పేజీ-30)లో కూడా "తెలుగులో మహాభారతం విషయం తీసుకొన్నప్పుడుకూడా బ్రౌన్ గావించిన

* 'వేమన', రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ, వావిళ్ళ, 1945. (ప్రథమ ముద్రణ 1929), పేజీలు 20–21.

కృషికి మనం సాష్టాంగపడవల్సిందే" అని యాదృచ్ఛికంగా వ్రాశాను. ఇట్లా ఇన్ని 'కూడా'లు అనివార్యమౌతున్నాయంటే, దాదాపు ప్రతికావ్యం విషయంలోనూ బ్రౌన్ కృషి అంత విలువైనదనీ లోతుకు వెళ్ళి చూచేకొద్దీ ఎవరికైనా అనిపించకమానదు.

బ్రౌన్‌కు న్యాయంగా రావల్సిన ఖ్యాతిని ఆయనకు చెందనీకుండానే మధ్య వచ్చిన దళారులు కొందరు కొట్టేశారు. ఉదాహరణకు వేటూరి ప్రభాకరశాస్త్రి షుమారు యాభై ఏళ్ళ క్రితం 'చాటుపద్య మణిమంజరి'ని వెలువరించినప్పుడు అబ్బా వేటూరి వైదుష్యం అని అనుకొన్నాం. నిజానికి ఇందులో వేటూరి వైదుష్యం పిసరంత కూడా లేదు. బ్రౌన్ సేకరించి, భద్రపరిచి, నోట్సు వ్రాసిపెట్టి పోయిన 'చాటు పద్యాలు', 'చిల్లర పద్యాలు' అనే రెండు సంపుటాలు మద్రాసు ఓరియంటల్ మేనుస్క్రిప్ట్స్ లైబ్రరీలో వున్నవాటిని, బ్రౌన్ పేరు చెప్పకుండానే ముద్రించి ప్రచురించడం తప్ప మరేమీకాదు. వాటిలో లేని చాటుపద్యాలుగాక, వేటూరి ఒక్క అదనపు చాటువైనా చూపలేదు. దాదాపు మక్కికి మక్కీ వినియోగించుకొన్నాడు. వేటూరి గ్రంథంలో లేని (దీపాల పిచ్చయ్యశాస్త్రిగారి చాటుపద్యరత్నాకరంలోకి కూడా రాని) చాటుపద్యాలు బ్రౌన్ సేకరణలలో వెలుగులోకి రాకుండా ఇంకా ఎన్నో మిగిలే వున్నాయి.

మచ్చుకు మరొక ఉదాహరణ. ఆం.ప్ర. సాహిత్య అకాడమీ 'చౌక'గా వెలువరించిన ప్రబంధాల జాబితాలో గౌరన 'హరిశ్చంద్రోపాఖ్యానం' ద్విపదకావ్యం డాక్టర్ యశోదారెడ్డి సంపాదకత్వం క్రింద వచ్చింది. ఇందులో ఈ కావ్యాన్ని ఓం ప్రథమంగా పరిష్కరించి ప్రకటించిన బ్రౌన్ పేరు ఆమె ఎక్కడా ఉచ్చరించక పోయినా ఆయన 1842 లో వెలువరించిన ముద్రణకు ఇది అచ్చు కాపీయే. అదనంగా ఒక్క పాఠాంతరమైనా లేదు. బ్రౌన్ గమనించిన పెక్కు విషయాలు ఆమె ఎరుకకు వచ్చినట్లుకూడా లేదు. వీరి ముద్రణకన్నా బ్రౌన్ ఎడిషనే ఉత్కృష్టంగా వుంది. ఇట్లాటివన్నిటినీ ఏకరువుపెట్టి బ్రౌన్‌కు న్యాయంగా చెందవలసిన ఖ్యాతిని ఆయనకు చేరేటట్లు చేసి న్యాయ రక్షణ చేయడం నా ధ్యేయం కాదు.

వేమన పద్యాల కోవకు చెందిన సుమతిశతకం విషయమై కూడా బ్రౌన్ గావించిన కృషి ఇటీవలదాకా వెలుగులోకి రాకుండా మన పండితులు ఇంత కాలం జాగ్రత్త పడ్డారంటే మన కృతఘ్నతకు అదొక సాదృశ్యంగాక మరేమవు తుంది? బ్రౌన్ సుమతిశతకాన్నీ ఆయన ఇంగ్లీషు తర్జుమానీ, ఆయన గుర్తించిన పాఠభేదాలనీ వళ్ళు దగ్గరబెట్టుకొని చూస్తే కొత్త విషయాలెన్నో కనపడ్తాయి. ఉదాహరణకు ఆదిలోనే హంసపాదన్నట్లు "శ్రీరాముని దయచేతను నారూఢిగ

సకల జనులు .. " అనే పద్యం సుమతిశతకకారుడిదిగా కానరాదు. అయినా దాన్ని సుమతి పద్యంగానే ఇప్పటికీ చెప్పుకొంటున్నాం. మన పిల్లలచేత చెప్పించుకుని ఆనందిస్తూనే వున్నాం. కానీ ఈ సదరు "శ్రీరాముని దయ" సుమతి శతకంలోదికాదు. బ్రౌన్ సేకరించిన తాళపత్ర ప్రతుల్లోగానీ, ఆయన వ్రాయించిన వ్రాతప్రతుల్లోగానీ అంతేగాక తంజావూరు గ్రంథాలయంలో వున్న తాళపత్ర ప్రతుల్లోనూ ఈ పద్యం లేదంటున్నారు డాక్టర్ చల్లా రాధాకృష్ణశర్మ.*

మరి ఈ పద్యాన్ని ఎవరు చేర్చినట్లు? ఎందుకు చేర్చినట్లు? ఎప్పుడు చేర్చినట్లు? శ్రీకారంతో ప్రారంభం కావాలనే ఏ 'కావ్యలక్షణ' సంప్రదాయ దాసుడో లేదా ఏ రామభక్త హనుమానుడో ఈ పద్యం వ్రాసేసి సుమతీ మకుటాయమానంతో శతకంలో పైగ్గా తగిలేచ్చి వుంటాడు అనే అనుకోవాలి.

సుమతి శతకాన్ని ఓం ప్రథమంగా అచ్చువేయించిన వాడు కూడా బ్రౌనే.† ఆ ముద్రణలో ఈ సదరు శ్రీరాముని దయ పద్యమేమైనా వున్నదో చూచి చెప్పిన వాడెవడూ లేడు. ఇదీ ఏ చిన్న విషయం తీసుకొన్నా ఎదురయ్యే పరిస్థితి.

ఇటీవల వేదం (చిన) వెంకటరాయశాస్త్రిగారితో మాట్లాడుతుంటే వేమన పద్యాల ప్రస్తావన తెచ్చి ఆయన నాతో ఇట్లన్నాడు:

---

* చూడు: "Sumati Satakam" in the Telugu original with English rendering, C. P. Brown (ed. C. R. Sarma), Hyderabad, 1973, p. IX.

† పైన పేర్కొన్న చల్లా రాధాకృష్ణశర్మగారి సుమతిశతక ముద్రణ పీఠికలో "Its first publication in 1868 (?)" అని ప్రశ్నార్థకం పెట్టారు. దీనికి 26 ఏళ్ళ క్రితమే సుమతి శతకం ముద్రణైనట్లు 1842 నాటి వర్తమాన తరంగిణి పత్రిలో వచ్చిన ప్రకటనను బట్టేగాక, 1842 లో బ్రౌన్ ముద్రించిన గౌరన హరిశ్చంద్రో పాఖ్యానం ముఖపత్రం వెనుక ప్రకటించిన తెలుగు పుస్తకాల ముద్రణప్రతుల జాబితానుబట్టి కూడా చెప్పవచ్చు. చల్లావారు చర్చించలేదుగానీ బ్రౌన్ సుమతి శతక సవ్యాఖ్య ప్రతీ, పద సూచిక (భాస్కర శతకానికి కూడా) ప్రతీ ఇవి రెండూ కూడా వున్నాయి మ.ఓ.మే.లై. లో. బ్రౌన్ డి.3091-92 లో ఇట్లా వ్రాసి పెట్టాడు: "In this volume are verbal indexes to the Sumati Satacum & Bhaskara Satacum followed by the same words arranged as a glossary: which I planned to facilitate a knowledge of these two initiatory school books."

"చంపదగినయట్టి శత్రువు తనచేత జిక్కెనేని కీడు సేయరాదు, పొసగ మేలు జేసి పొమ్మనుటే చాలు, విశ్వదాభిరామ వినురవేమ" అని కదూ నేడు మనం చదువు కొంటున్నది. కానీ మా తాతగారు (కీ.శే. వేదం వెంకట్రాయశాస్త్రి) చూపిన పాఠం తెలుసా? 'పొసగ మేలుచేసి పొమ్మనుటే చావు.' ఔరా అని ముక్కుమీద వేలేసు కొన్నారు శిష్యులు మా తాతగారి పాండిత్య వైభవాన్నిచూచి. ఈ 'చావు' చేర్చినందు వల్ల ఎంత తేడా కనపడ్తున్నదో. వేమన్న చెప్పిన భావానికి ఎంత పదును కనపడ్తుందో గమనించారా? అచ్చం మృచ్ఛకటికంలోని చారుదత్తుడు చెప్పిన శ్లోకానికి వేమన తెలుగులో సూటిగా దీటైన తర్జుమా చేశాడనిపిస్తున్నది ఈ'లు' బదులు'వు' చేర్చినందు వల్ల. దీనివల్ల వేమన వట్టి అవ్యుత్పన్నుడు కాడు, మన సంప్రదాయ కావ్య నాటకా లను ఔపోసన పట్టినవాడు అని చెప్పుకోడానికి ఆస్కారం కల్గుతున్నది" అని అన్నారు చినవెంకట్రాయ శాస్త్రిగారు.

"సార్, బాగుందిగానీ, మీ తాతగారు ఈ 'చావు' పాఠాన్ని దిద్దిచెప్పినట్లు దాఖలా ఏమైనా చూపగలరా?" అని అడిగాను.

"ఓ. లేకేమి? ఇటీవల, మా తాతగారి శిష్యులు శ్రీమాన్ నేలటూరు రామదాస య్యంగార్ తెలుగు రసాస్వాదినీ వ్యాఖ్యలో (ఆం. ప్ర. సా. అకాడమీ 1974 లో ముద్రించిన మృచ్ఛకటిక సంస్కృత నాటకం దశమాంకం 649 పేజీలో) చారు దత్తుడు చెప్పిన 'శత్రుః కృతాపరాధః శరణముపేత్య పాదయోః పతితః శస్త్రేణ హన్తవ్యం ఉపకార హతస్తు కర్తవ్యః' అనే శ్లోకానికి తెలుగులో వ్యాఖ్యంతా వ్రాసి 'ఉపకారహతః' అనే చోట పొసగ మేలు చేసి పొమ్మనుటే చావు' అని వేదం వెంకట రాయశాస్త్రి పాఠంగా పేర్కొన్నారు చూడండి" అని చూపారాయన.

లోలోన నవ్వుకున్నాను. ఇట్లన్నాను:

"సార్, ఇది మీ తాతగారైన వేదం వెంకట్రాయశాస్త్రి సొంత పాఠమేమీ కాదు. నిజానికి అక్షరాలా ఇది బ్రౌన్ పాఠం. మొదట్లో వేమన పద్యాలను బ్రౌన్ 1829 లో అచ్చువేసినప్పుడు అందులో ఆయన ముద్రించిన పాఠం 'పొసగ మేలుచేసి పొమ్మనుటే చావు.' 'చాలు' కాదు. 'చావు'. 'లు' 'కీ' 'వు'కీ గల తేడా ఆ మ్లేచ్ఛు డైన దొరకు తెలియక అట్లా అచ్చువేశాడనుకొందామంటే, క్రింద ఇంగ్లీషు తర్జుమాలో 'This is death to him!' అని స్పష్టంగా అనువదించి వున్నాడు. ఇప్పుడేమందాం? ఈ 'చావు' పాఠ నిర్ణయంలో మీరు చెప్పే పాండిత్య వైభవమే

మైనా వున్నదనుకొంటే సదరు వైభవం న్యాయంగా బ్రౌన్‌కు చెందాల గదా?" అని ఆయన్ను ఎదురుప్రశ్న వేయక తప్పలేదు.

ఇంతకూ ఆనాడు ఆ పద్యాన్ని వేమన్న ఎట్లా చెప్పాడోగానీ, బ్రౌన్ చూపిన ఈ 'చావు' పాఠంపోయి, ఇప్పుడు మన బడిపుస్తకాల్లో ప్రజలనోళ్ళల్లో 'చాలు' అయికూర్చున్నది. ఇట్లావున్నది మన వ్యవహారం ఏ చిన్న విషయం తీసుకొన్నా.

మచ్చుకు మరి రెండు పద్యాలు తీసుకొని చూదాం:

అల్పుడెపుడు బల్కు నాడంబరముగాను
సజ్జనుండు బలుకు చల్లగాను
కంచుమోగినట్లు కనకంబు మోగునా? విశ్వ॥

ఈ పద్యానికి బ్రౌన్ సేకరించిన తాటాకు పుస్తకాల్లో కనపడిన పాఠభేదాలు కోకొల్లలు. ఒకదాంట్లో మొదటి చరణం 'అల్పనరుడు బల్కు....', మరొక దాంట్లో 'అల్పజనుడు బల్కు ...', మరీ ముఖ్యంగా మూడో చరణం 'కంచుమ్రోగినట్లు కనకంబు మ్రోగునా' అనిగాక 'కాకి కూసినట్లు కోకిల కూసునా?' అని. ఇట్లా నానా రకాల నడక.

అట్లాగే మరొక పద్యం:

ఉప్పుకప్పురంబు నొక్కపోలికనుండు
చూడ జూడ రుచుల జాడవేరు
పురుషులందు పుణ్యపురుషులు వేరయా. విశ్వ॥

దీనికీ పాఠాంతరాలు సవాలక్ష. 'ఉప్పుకప్పురంబు వొక్క రీతుననుండు, చెప్ప జెప్ప వారి చెవులు వెఱ్రి, పురుష రూపొక్కటి పుణ్యపురుషుడు వేరు. విశ్వ॥' అని ఒక ప్రతిలో వుంటే. మరొక ప్రతిలో మూడో చరణం 'పురుషులందరొకటే పుణ్యాత్ము లును వేరు.' ఇట్లాటి అగమ్యగోచరపు స్థితిలో దొరికిన తాళపత్ర ప్రతులలో నుంచి శుద్ధపాఠాలు నిర్ణయించి, వున్న వాటిలో కొన్నిటిని మాత్రమే ఏర్చి కూర్చి 1829 లో వేమన పద్యాల సంపుటాన్ని తొలిసారిగా ప్రసాదించడానికి బ్రౌన్ ఎన్ని తంటాలు పడివుంటాడో వూహించుకోవచ్చు.

వేమన పద్యాల పట్ల బ్రౌన్‌కున్న అవగాహన గూర్చి చెబుతూ డాక్టర్ నార్ల "His (Brown's) interest was more linguistic than philosphical, and he could not see the radical and humanistic elements in Vemana's

thought..." అని అన్నారు * అంతేకాదు. "Obviously, Brown could see nothing more in Vemana than in a First Reader of Telugu"అనికూడా అన్నారు.† ఇది వేమనపట్ల బ్రౌన్‌కు గల అవగాహనను గురించిన సరియైన అంచనా కాదని బ్రౌన్ 'తాతాచార్ల కథల'కు వ్రాసిన పీఠికలో నేను లోగడ చర్చించి వున్నాను.‡ దాన్ని మళ్ళీ ఇక్కడ తిరగదోడ దల్చుకో లేదు. పోనీండి ప్రస్తుతానికి, ఒకటను కొందాం. Vemana's thought లోని radical and humanistic elements ను ఇతరులెవరైనా దర్శించడానికి బ్రౌన్ ప్రత్యక్ష దోహదకారి కాగలిగాడనుకొందాం.

1829 లో వేమన పద్య సంపుటిని వెలువరించినా, ఇంకా సరికొత్త పద్యాల కోసం, సరియైన పాఠమూలాల కోసం అనునిత్యం శోధిస్తూనే వచ్చాడు బ్రౌన్. సాధిస్తూనే వచ్చాడు. వాటికి వ్యాఖ్యలు, నోట్సు వ్రాసుకుపోతూనే వచ్చాడు. ఆయన అన్వేషణకు అలుపులేదు. అంతంలేదు. బ్రౌన్ సేకరించిన, వ్రాయించిన ప్రతులెన్ని? ఎన్నో నేను లెక్కబెట్టలేదు, రాళ్ళపల్లివారు "సుమారు ఏబది వ్రాతప్రతులను జూచితిని...." అన్నారు.§ "మదరాసు ప్రాచ్యలిఖిత గ్రంథాలలో వున్న వేమన పద్యాలు 54 సంపుటాలలో వున్నాయి" అని అన్నారు ఆరుద్ర.ﻻ నా దృష్టివేరు. ఏదో అరకొరగా చూచిన వాణ్ణే తప్ప కరెక్టుగా వాటి సంఖ్య ఎన్నో లెక్కించనూలేదు. వాటి వైవిధ్య తత్వాన్ని లోతుకు వెళ్ళి పరిశోధించనూ లేదు. ఎందుకు లెక్కించలేదు. ఎందుకు పరికించలేదూ అంటే, లోతుకు వెళ్ళేకొద్దీ అదొక మహా సముద్రంగా, ఒక మహా అక్షర సామ్రాజ్యంగా ద్యోతకమైంది గనుక. వీటన్నిటినీ తాపీగా చూచి, పాఠాంతరాలను గుర్తించి, బ్రౌన్ ఇంగ్లీషు—ల్యాటిన్ తర్జుమాల సారాన్ని మనసుకు తెచ్చుకొని, బ్రౌన్ చేసిన ఈ మొత్తం కృషిని సరిగా విలువకట్టడమనేది ఇప్పట్లో నా సాధ్యమయే పనిగా కనపళ్ళేదు.

---

* చూడు : Vemana through western eyes, (ed.) Narla, V.R., Madras, 1969, P.5.

† Vemana, Narla, V.R., New Delhi, 1969, P.17.

‡ సి. పి. బ్రౌన్ సంతరించిన తాతాచార్ల కథలు, సంశోధనప్రతి—బంగోరె, మద్రాసు, 1974, పేజీలు. 25-7.

§ వేమన, రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ, వావిళ్ళ, 1945 (ప్రథమ ముద్రణ 1929), పేజీ. 12.

ﻻ వేమన్న వేదం, వ్యాఖ్యాత-ఆరుద్ర, 'స్వాతి' మాసపత్రిక (1976 నుంచి నెల నెలా వెలువడుతున్న వ్యాస పరంపర), మే, 1976, పే. 15.

యూనివర్సిటీల పరిభాషలో చెప్పాలంటే, అది ఒకటి రెండు పీహెచ్చిడీల మోయిన వ్యవహారమవుతుందనే స్పృహవున్న వాణ్ని గనుక, దానిని భావి పరిశోధకులకు అట్టి పెట్టి, నా మార్గాన్ని నేను అడుగడుగునా 'లిమిట్' చేసుకుంటూ వచ్చాను.

ఇక ఈ క్రింది జాబు చూద్దాం:

11

మహారాజశ్రీ సీ. పీ. బ్రౌన్‌ధొరగారు పైడిపాటి వెంకటనరసయ్యకు వ్రాయించినది —

వేమన పద్యములను గురించి మీరు యంతదూరం జర్గించినారో ఆ సంగతి తెలియచాయవలసినది. యిది జబ్బుకార్యం అయినాసరె దీని మీద నాకు బహు దయ కలిగినట్టు విచారించి తొందరపడి తీర్పు చేస్తూ రావలసినది. ప్రతిభేదములలో లేనషువంటి శబ్దమైనా వ్రాయించడానికి మాకు యంతమాత్రం ఆపేక్ష లేదుగాని, అట్లా వ్రాయవలసిన అవసరంవస్తే పక్కను తోచిన తీర్పు లేక సందేహము అనేమాటలు వ్రాయిస్తూరావలెను. వేరే కొండొక చోట యీ పద్యములు మహా అసాధ్యంగా వున్నది, భావం స్పుటంకాలేదు, తోచినమట్టుకు యేర్పరచుకున్నామని యిషువంటి షరాలువ్రాస్తూ రావలసినది.

కొన్ని పద్యములందు 5, 6, 8 చరణములు వుంటే సరి యెన్ని కలిగినా తగిలించి అందులో వుండరాని చరణములకు షరా పెట్టవలసినది. వేదములన్నీ వాదములు సుమ్మీ అనే పద్యం పిచ్చితప్పులతో వున్నట్టు గుర్తెరిగి వున్నాము. అది వక గణంగా లేనందున వచనంగా యేర్పరచుకొని 10, 12 చరణములు దనుకా సాగినా సరి. గాని యీ పద్యము నాకు వక దర్పు మర్యాదగా వున్నదని తెలుస్తుంది. దీని వక న్యాయం తేలలేనందున అయిన మట్టుకు కొంచం దిద్ది వ్రాయించినామని షరా వ్రాయించవలసినది.

యిదిగాక మంచి గుణంగల పద్యములు అయితే తీర్పించేటందుకు దుఃఖంపడవలసినదిగాని వట్టి పిచ్చి పద్యములు వచ్చేటప్పుడు వాటికి యేమీ దుఃఖ్కపడేదానికి అవుసరము వుండదు. యిదిగాక ప్రస్తుతం చిత్తునుంచి పుట్టించే ప్రతి అక్షరాలక్రమం చొప్పున ఫరిష్కారంగా నియమించవలసినది. యీ పని త్వరమీద వుండవలశ్నినదని మాకు తాత్పర్యం లేదుగాని నిర్దోషంగా నియమింపవలెనని మిక్కలీ తాత్పర్యము కలిగివున్నాము.

నడుమ నడుమ తగిలించిన కాగిదములు విరిగిపోకుండా పడిపోకుండా మహా పదిలంగా చెయ్యవలశినది. యేయే సెక్షన్ యొక్క పని అయిపోయిందో అది చెడిపోకుండా ప్రత్యేకంగా దాచిపెట్టవలసినది. యీ చిత్తు గ్రంథము మాకు ముఖ్యమైన దస్తావేజు అవుతూ వున్నది గనుక యిది పడిపోతే తిర్గి వకనాటికి కుదరవు. అయినమట్టుకు యెత్తివ్రాసిన గ్రంథం పునహా సరిచూచుకొని జూలూరు అప్పయ్యశాస్త్రి కూడా చిత్తులమీద ద్రిష్టి వుంచి పునహా పరిష్కారం చెప్పుతూ రావలసినది. తరువాత మీరు యిద్దరు పరిష్కరించిన గ్రంథం యిక్కడికి పంపించవలసినది. కాని నష్టపడకుండా దానికి రెండు ప్రతులు పుట్టిస్తూ రావలసినది. మరిన్ని యిందులో కష్టమైన పద్యములు వస్తే వాటి అర్థం మీరు తలుచుకున్న వెంటనే కొద్ది వక టీక తగిలించవలసినది.

యిటు పిమ్మట సర్వగ్రంథములకు మహా సులభమైన వక వ్యాఖ్య అల్లించేటందుకు బుద్ధి వున్నదిగాని ప్రస్తుతం కష్ట పద్యములకు మాత్రం అల్లించినా ప్రతిదానికి మీరు అల్లించినా మాకు సంతోషమౌను. యిది గ్రామ్యోక్త గ్రంథం అయినాసరె. అనేక పద్యములయందు కవియొక్క తాత్పర్యం బోధపడడము మహాప్రయాస వున్నది గనుక టీక అవస్యంగా వుండవలశినది. యెట్టుకు ప్రబల కావ్యములందు కావలసిన భక్కిక వేరు. దీనిది వేరు. అనగా శబ్దమునకు శబ్దము యంతమాత్రం అల్లించకుండా తేలే తాత్పర్యం మాత్రం చెప్పుకుని అపరూప శబ్దములు తాత్పర్యం బోధచేస్తే చాలుతుంది.

పైగా గూఢతత్వ పద్యములందు కళలు బెళుకులు నాదములు యిత్యాదులై ప్రసంగములు చెప్పేటప్పుడు యీ గూఢతత్వ నిర్ణయములు టీకలో విశదపరచేటందుకు మాకు యంతమాత్రం జరూరులేదు — అనగా సాధువులు గ్రహించవలసిన మాత్రం బోధపరచి లేనిపోని నిరర్థకపు విద్యలు టీకలో పరిష్కారం చేయించేటందుకు మాకు అవసరంలేదు. అయితే యిది యావత్తూ దాటవెయ్యడం మంచిదిగాదు గనుక గ్రంథముకు అవతారిక రచియించుకోని అందులో వృత్త సంభాషణ మాటలతో యీ తత్వశాస్త్రం మరియాదలు విశదపరిచితే చాలుతవి.

1834 జనేవరు 3.

తాజాకలం: కంభం నృసింహాచార్యులతో చెప్పవలసినది ప్రస్తుతం రాఘవపాండవీయ్యమ్కు వ్యాఖ్య పుట్టించవలసినది.*

*  *  *

ఇండెక్సు పేజీలో ఈ లేఖకు సంబంధించి "My directions regarding editing Vemana" అని వ్రాసిపెట్టాడు బ్రౌన్.

ఈ జాబు వ్రాసిన తర్వాత బ్రౌన్ వేమన పద్య పరిష్కరణ విషయమై ఫిబ్రవరి 16న పైడిపాటి వెంకటనరసయ్యకే మరో జాబు వ్రాయించినట్లున్నాడు. దానికి ఆయన జవాబు చూడండి:

12

మహారాజశ్రీ సీ. పీ. బ్రౌన్ యిస్కాయరు ధొరవారి సముఖమునకు....

తమకాలీజా నవుకరయ్ని పైడిపాటి వెంకటనరసయ్య వ్రాసుకున్న అర్జీ విన్నపం....

యేమంటే ది 16 ఫెబ్రేవరు తారీఖున తమరు దయచేయించిన హుకుము అంది అందుల సంగతులు గ్రహించినాను. వేమన పద్యములను గురించి యిదివరకు యెన్ని పద్యములు తీర్పు అయినవో ఆ వైనం వ్రాయ వలశినదనిన్ని, తీరిచేయడల కఠినంగా వున్న పక్షమందు ఆయాయి పద్యముకు ఫలానా హేతువచాత తీర్పు చాయలేదని షరాలు వ్రాయవలశినదనిన్ని వ్రాయించినారు.

యిదివరకు 12 వందల పద్యముల పరియంతం తీర్చినాను. యెక్కడ నైనా అర్థం సందర్భంగా వుండకుండా మిక్కిలి కఠినమని తోచ్ని పక్షమందు ఫలానా హేతువచేత యీ పద్యం తీర్చకుండా నిలపడమైనదని షరాలు వ్రాస్తూనే వున్నాను. సదరహీ నేను తీర్చిన పద్యములలో యీ దినంవరకు 200 పద్యముల పరియంతం అప్పయ్య పండితులుగారు చిత్తుప్రతి కూడా దగ్గర వుంచుకొని సాపు తీర్పు చేశినారు. అప్పయ పండితులుగారు వకపూట వసుచరిత్రకు టీక చాయడమున్ను వకపూట యీ పని జరిగించడం అయినందున్ను దినానికి 10-20 పద్యములు తీర్పు అవుతూ వున్నది.

---

*మ.ఓ.మే.లై. లోని బ్రౌన్ జాబుల సంపుటం ఎమ్. 401, పేజీలు 185-7.

అయ్యన్ను వసుచరిత్ర ఆరో ఆశ్వాసం ఆరంభించి టీక చేస్తూ వున్నారు. కంభం నరసింహాచార్యులుగారున్ను తమ శల్యు ప్రకారం రాఘవపాండవీయం ప్రతిపద టీక ఆరంభించి జరిగిస్తూ వున్నారు. యీ మట్టుకు వక ఆశ్వాసముకు టీక వ్రాయడం అయినది గనుక యీ సంగతులు చిత్తానకు విశదం కాగలందులకు విన్నపం వ్రాసుకున్నాను. దివ్యచిత్తానకు తేవలెను.

1834 ఫెబ్రేవరు 19. —వెంకటనరసయ్య వ్రాలు.*

* * *

పై బ్రౌన్ లేఖ ప్రారంభంలోనే కనపడే వాక్యం: "ఇది జబ్బు కార్యం అయినా సరి, దీనిమీద నాకు బహు దయ కల్గినట్టు విచారించి తొందరపడి తీర్పుచేస్తూ రావలసినది" అని వ్రాయడాన్నిబట్టి చూస్తే బ్రౌన్ సమకాలిక తెలుగు పండితుల దృష్టిలో ఈ 'వేమన పద్య పరిశీలన' అనేది విలువైన పని కాదనే ఈసడింపు అభిప్రాయం వుండబట్టే ఎవరెట్లా భావించినా తనకు మాత్రం ఇది ప్రీతికరమైన విషయం గనుకనే తొందరగా 'తీర్పు' జరిపించవలసినదంటూ బ్రౌన్ ప్రత్యేకంగా హెచ్చరించి వ్రాయవలసివచ్చేదికాదు. ఈ వేమన పద్యాల్లో ఏముంది? చదివితే భారత భాగవతాది పవిత్ర గ్రంథాలు చదవాలి. అవి చదవనిదే తెలుగుభాషా సాహిత్యాల స్వరూపం సరిగా పట్టుబడినట్లు లెక్కకాదు — అని బ్రౌన్ చుట్టూ చేరిన పండితులు పదేపదే పోరుబెట్టేవారు కాబోలు. వారు చెప్పిన ఆ భారతభాగవతాదులు చదవక వదిలిందిలేదుగానీ, వారు ఈసడించుకున్న వేమన్నను మాత్రం బ్రౌన్ ఆఖరుదాకా వదల్లేదు అనుకోవాలి.

వేమన్నను గూర్చి కొంతకాలంవరకూ దాదాపు అనునిత్యమూ పరిశీలించేవాడు గనుకనే, 1829 లో వేమన పద్యాలను పరిష్కరించి ప్రచురించేనాటికి వేమన పద్య తత్వాన్ని గూర్చి, పాఠవైవిధ్యం గూర్చి తన కేర్పడ్డ అవగాహన క్రమంగా విస్తృత మవుతూ మారుతూ వచ్చింది. తన స్వీయచరిత్రలో ఈ 1829 ముద్రణ గూర్చి చెప్తూ అదొక లేబ్రాయపు కృషి మాత్రమేననీ, తర్వాత క్రమంగా ఈ ప్రచురణలోని అనేక పేజీలను తిరిగి సవరిస్తూ వచ్చాననీ, మరో ముద్రణను తీసుకొచ్చే ప్రయత్నం చేయవలసివచ్చిందనీ వ్రాసుకున్నాడు:

---

*మ.ఓ.మే.లై.లోని బ్రౌన్ జాబుల సంపుటం, ఎమ్. 401, పేజీలు 303–4.

"...the book became popular among those who were learning Telugu or English. It was a juvenile effort, and I have since remodelled several pages."*

ఈ 'రీమాడల్' చేసిన, సవరణలు పొందిన పేజీలను చూసి చర్చించినవారెరీ? 1829 నాటి తొలి ముద్రణకు 1839 లో సవరణలు చేసిన మలి ముద్రణను తీసు కొచ్చినట్లు అనేక తావుల్లో అనేక సందర్భాల్లో బ్రౌన్ స్వయంగా వ్రాసున్నాడు.

జాన్సన్ ఇంగ్లీషు డిక్షనరీకి బ్రౌన్ సంతరించిపెట్టిపోయిన తెలుగు అనువాద సంపుటాల్లో ఒకచోట ఇట్లా వ్రాసున్నాడు:

"...My first publication was Telugu and Sanscrit prosody 1827. First edition of Vemana 1829, second edition 1839. Sanscrit prosody 1837 when I was in London. Shortly after publishing Grammar in 1840 (January) I began to revise my translation of Vemana and some other works..."† అని చాలా వివరాలు ఏకరువుపెట్టాడు.

వేమన పద్యాలకు సంబంధించిన వ్రాతప్రతుల సంపుటాల్లో డి. 1773 వాల్యూమ్స్ 1, 2, 3 లో ఒకచోట ఇట్లా వ్రాసిపెట్టాడు: "The verses of Vemana corrected with the text and metres from a comparison of various manuscripts and translated from the original Telugu by C. P. Brown. Translated between 1st August & 4th November 1824." ఆఖరు పేజీలో "Finished between 4th March & 4lh Nov. 1824" అని పేర్కొన్నాడు. మూడో వాల్యూమ్‌లో Containing verses from 973–1516. 5th November 1824. Finished 18th January 1825. Only near 8 verses a day or more than 8..." అని మరికొన్ని వివరాలు వ్రాసిపెట్టి పోయాడు.

1824 మార్చినుంచి 1825 జనవరిదాకా, అంటే తన 25వ ఏట ప్రారంభించి, రోజుకు రమారమి 8 పద్యాల చొప్పున సాగించిన ఈ వేమన పద్యాల తొలి

---

* చూడు: Literary Life of Charles Philip Brown, C. P. Brown, London, 1872, P. 17.

† మ. ఓ. మే. లై. లోని బ్రౌన్ డిక్షనరీ సంపుటాలలో నెంబర్ డి. 1392, వాల్యూమ్1.

పరిష్కరణ—తర్జుమాలను పట్టుకొనే మన నిర్ణయాలు చేస్తూవస్తున్నాం. వయసులోనే గాక, అనుభవంలోనూ, విజ్ఞానంలోనూ, అవగాహన పరిధిలోనూ బ్రౌన్ ఎదుగుతూ వచ్చాడు. అదనపు పద్యాలను, పాఠాలను సేకరిస్తూ ఈ పరిష్కరణ—తర్జుమాలను ఎప్పటికప్పుడు సవరిస్తూ మారుస్తూ వచ్చాడు.

డి. 1721 అనే మరో వేమన పద్యాల సంపుటంలో 1840 లో ఇట్లా వ్రాసున్నాడు :

"In this edition the text has been carefully revised by a learned Telugu pandit. The arrangement also is somewhat changed. The verses which appear spurious being placed at the end of the volume apart from the rest. The volume contains 1165 stanzas selected..." ఇట్లా బ్రౌన్ తత్వధారలో వస్తూవచ్చిన మార్పులు, చేర్పులు, సవరణలు మన పరిశీలనలోకి తెచ్చుకోవలసిన అవసరంలేదా ?

బ్రౌన్ వేమన పద్యావిష్కరణ చేసినమీదట, బడిపిల్లలకు ఈ వేమన పద్యాలను పాఠ్యాంశంగా చేసినప్పుడు వచ్చిన వివాదాలు, ప్రభుత్వం నియమించిన కమిటీలు, అప్పట్లో వారు సమర్పించిన నివేదికలు — వీటిని గూర్చి చదవదల్చుకున్నవారు నార్ల గారి "వేమన త్రూ వెస్ట్రన్ అయిజ్" (మద్రాసు, 1969) అనే గ్రంథమూ, మరుపూరు కోదండరామిరెడ్డిగారి "వేమన - పాశ్చాత్యులు" (నెల్లూరు, 1971) ఆంధ్రానుసరణమూ సంప్రదించవచ్చు.

ఇక పోతే, బ్రౌన్ 1829 లో వెలువరించిన వేమన పద్యాల ముద్రణ గూర్చిన ఒక ఉపాఖ్యానాన్ని ఈ సందర్భంలో చెప్పుకోవాలి.

వేమన పద్యాలలో ఎదురైన చిక్కులలోనుంచి తెలుగు సాహిత్య విశ్వరూపాన్నంతటినీ ఔపోసన పట్టడానికి బ్రౌన్ ఒక మహోద్యమమే సాగించవలసివచ్చింది. వివిధ తాళపత్ర గ్రంథాల్లో కొరుకుడు పడకుండా ఒక అరణ్యంలాగా ఎదురైన అనంతమైన పాఠభేదాలను నిగ్గుతేర్చి శుద్ధ పాఠనిర్ణయంచేసి ఒక ఆరామంగా తీర్చి దిద్దవలసివచ్చినప్పుడు, తెలుగు ఛందోరీతులను అవగాహనకు తెచ్చుకుని ఛందస్సహాయంతో శుద్ధ పాఠాలను నిర్ణయించడం అవసరమని తెలుసుకున్నాడు. ఈ స్పృహతో వేమన పద్య మథనాన్ని కాసేపు పక్కకునెట్టి 1824-25 లోనే ఛందస్సుపై అధికారాన్ని సంపాదించుకొన్నాడు. ఆ సూక్ష్మాలు గ్రహించి తెలుగు ఛందస్సు అంతుపంతు తేల్చుకొన్నాడు. అందుకనే, ఈ వేమన పద్యాలకంటే ముందు, తెలుగు-సంస్కృత

ఛందస్సుపై గ్రంథం వ్రాసి మద్రాసు ఫోర్ట్ సెంట్ జార్జి కాలేజీ బోర్డువారిచేత 1827 లోనే ప్రకటించాడు. ఆ తర్వాతే వేమన పద్యాల పరిష్కరణను, తర్జుమాను అదే కాలేజీ బోర్డుచేత 1829 లో ప్రకటన చేయించాడు. ఇందుకు సంబంధించిన అలనాటి ఆ ప్రాచీన ఉత్తరప్రత్యుత్తరాల ఫైళ్లు కొన్ని అదృష్టవశాత్తు తమిళనాడు ఆర్కైవ్స్‌లో భద్రంగా వున్నాయి.

బ్రౌన్ వ్రాసిన ఆ ఛందోగ్రంథం ఒక పక్క కాలేజీ ప్రెస్సులో అచ్చు జరుగుతూన్నప్పుడే, మరోవైపు ఆయన వ్రాసి సమర్పించిన వేమన పద్యాలు కూడా అచ్చువేయాలని సిఫారసుచేస్తూ, అప్పటి కాలేజీ బోర్డు కార్యదర్శి హెచ్. హార్కనెస్ (H. Harkness) 1827 జూలై 23న చీఫ్ సెక్రెటరీకి వ్రాసిన నోట్‌లో, బ్రౌన్ సమర్పించిన ఈ రెండు పుస్తకాలకు కలిసి కాపీరైట్ కింద నైతేనేమి, ఈ రెండింటి రచనలో ఆయన పడ్డ విశేష శ్రమకు పరిహారంకింద నైతేనేమి ప్రభుత్వం బ్రౌన్‌కు వెయ్యి వరహాలు (అంటే మూడువేలా ఆయిదువందల రూపాయలు అప్పట్లో) బహూమానంగా ఇవ్వడం బాగుంటుందని మరో సిఫారసు కూడా జోడించాడు. హార్కనెస్ చీఫ్ సెక్రెటరీకి వ్రాసిన ఆ జాబులోనుంచి ఇందుకు సంబంధించిన సిఫారసు వాక్యాలు పరికించండి :

"...Mr. Brown's edition of the Vemana Shattacum and his English version of the same, although not quite free from errors, the Board beg to recommend to the favourable notice of the Honorable the Governor in Council. It is the second work which that gentleman has submitted for the patronage of Government. The former one, his treatise on Telugu Prosody, will shortly leave the press; and should the Honorable the Governor in Council be pleased to countenance the labours and abilities of Mr. Brown in this instance, by authorizing the printing and publishing of the English version, when corrected, at the College Press, the Board respectfully submit that the sum of one thousand Pagodas may be presented to Mr. Brown as a remuneration for the original, and for the copy—right of his translation, and as an acknowledgement of his laudable exertions."*

* చూడు: తమిళనాడు ఆర్కైవ్స్. 1827 ఆగస్టు 4 వ తేదినాటి పబ్లిక్ డిపార్ట్‌మెంట్ కన్సల్టేషన్ నెంబర్ 660.

దీని మీదట గవర్నర్ నేరుగా వెయ్యి వరహాలు మంజూరు చేయకుండా లండన్‌లోని 'కోర్ట్ ఆఫ్ డైరెక్టర్స్'కు ఆమోదం కోసం వ్రాసినట్లున్నాడు. మూడేళ్ళయినా బ్రౌన్‌కు ఈ బహుమానం మొత్తం అందనూ లేదు. ఏ విషయమూ తెలపనూ లేదు. బ్రౌన్ మూడేళ్ళపాటు చూచి చూచి పబ్లిక్ డిపార్ట్‌మెంట్ సెక్రెటరీకి 1830 ఫిబ్రవరి 2 న ఒక మహజ్రీ పెట్టుకొన్నాడు. ఆ అర్జీలో ఇట్లా విన్నవించుకొన్నాడు బ్రౌన్.

"...In May, 1827 Government was pleased to sanction a reward of one thousand pagodas, a compensation to me for the labour and expense attendant upon two works of mine [a work on Telugu Grammar (sic. it must be prosody— ed.) and an edition and translation of a poet (Vemana— ed.) in that language] then printing and since published at the College Press.

"For some reason with which I am unaquainted, the matter was however referred Home for the approval of the Court of Directors; and from that period to the present; I have remained without any further communication on the subject; and consequently still I am, (putting the value of my labour out of the calculation) a sufferer to the extent of what I actually, disbursed from my private means, in the collection of materials and the payment of transcribers.

"For any information as to the realization of a reward which I have so long expected, I should feel most grateful."*

ప్రభుత్వానికి బ్రౌన్ ఇట్లా జాబు వ్రాసిన తర్వాత కూడా అధికార యంత్రాంగం ఏమీ కదిలినట్లు లేదు. ఏమైతేనేం. కడదాకా బ్రౌన్‌కు ఆ బహుమానం అందనే లేదను కోవాలి—1854 లో వ్రాసిపెట్టిన తన 'స్వీయచరిత్ర' లిఖిత ప్రతినిబట్టి చూస్తే. అందులో ఈ విషయం గురించి ఇట్లావుంది.

"...The Indian Government patronizes learning, and those who have published useful books have generally been liberally rewarded. My earliest publications were recommended by the College to this patronage. But Sir Thomas Munro has then died; and I was refused any reward; from that time to the close of my

*చూడు: తమిళనాడు ఆర్కైవ్స్. 1830 మార్చి 9 వ తేదీనాటి పబ్లిక్ డిపార్ట్‌మెంట్ కన్సల్టేషన్ నెంబర్ 135.

labours, no remuneration was granted me for any work. It may be said that the appointments conferred on me were equivalent to rewards. But similar appointments were bestowed on others who never did anything extraordinary."*

కాలేజీ బోర్డు సిఫారసు చేసినా కూడా, గవర్నరుగానీ, ఆ పై అధికార్లుగానీ, ఉదారంగా మంజూరు చేయకపోవడానికి కారణం అప్పటికి గవర్నర్ మన్రో మరణించడమే నంటాడు బ్రౌన్. మన్రో అనంతర గవర్నర్లు ఇట్లాంటి విషయాల్లో అంత శ్రద్ధ కనపరచలేదనేది బ్రౌన్ అభిప్రాయంగా కనపడ్తుంది. అయితే తనకు ఆ ఉదార నగదు బహూకృతి అందకపోయినందుకు ఆక్రోశమేమీ ప్రదర్శించలేదు. పైగా సదరు బహూమానాలతో సమానమైన ఉద్యోగాలు తనకిచ్చినందుకు సంతృప్తిని ప్రదర్శించకపోలేదు.

బ్రౌన్ వేమన పద్యాల ప్రచురణ వెనుక ఇంత గాధ వుంది. ఇంకా లోడితే మరెన్ని గాధలు బయటపడ్తాయో. ఇక పైడిపాటి వెంకటనరసయ్యకు వేమన పద్యాల గురించి బ్రౌన్ వ్రాసిన పై జాబు పరిశీలిద్దాం.

వేమన పద్య పరిష్కరణ విషయమై బ్రౌన్ ఎన్ని విపులమైన జాగ్రత్తలు చెబుతూ, ఎంత శాస్త్రీయమైన ధోరణిలో ఆదేశాలిస్తూ హెచ్చరికలు చేస్తూ వచ్చాడో ఈ జాబు ఒక ప్రత్యక్ష సాక్ష్యం. ఇంత శాస్త్రీయమైన పంధాలో ఆయన కృషి కొనసాగబట్టే, ఇంతటి శాస్త్రీయమైన పనిముట్లు ఏర్పరచుకోబట్టే, బ్రౌన్ అధ్యయనం ఏ కన్ఫ్యూషన్ లేకుండా అంత సులువైనదనుకోవాలి. వందమంది చేయవలసిన పనులను తాను ఒక్కడు ఒక్క చేతిమీదుగా అంత చప్పున అంత శీఘ్రంగా అంత దక్షతతో చేయగలిగాడనుకోవాలి.

పాశ్చాత్య పద్ధతిలో అకారాది సూచన, విషయం వారీ వర్గీకరణ, ఇండెక్సు, పీఠిక వంటి వాటిని జతపరుస్తూ నవ్యధోరణిలో వేమన పద్య సంపుటిని 1829 లో బ్రౌన్ వెలువరించినా. ఆ తర్వాత తర్వాత అనేకులు తీసుకొచ్చిన మలి ముద్రణలేవీ ఆ కోవలో రాలేదు గనుకనే, చిన్నదైనను ఇప్పటికినీ బ్రౌన్‌దొర ముద్రణమే సర్వోత్తమమని రాళ్ళపల్లివారు శ్లాఘించక తప్పలేదు. బ్రౌన్ ముద్రణలో పీఠికతో కలుపుకొని పట్టుమని 180 పేజీలైనా లేవు. వున్నది మూడు 'ఆశ్వాసాలు'. తర్జుమాతో

---

* మిన్నెసోటా (అమెరికా)లోని ఏమ్స్ లైబ్రరీలో భద్రపరచబడివున్న బ్రౌన్ 'స్వీయచరిత్ర' లిఖితప్రతి: "Narrative of the Literary life of Charles Philip Brown, late of the Madras Civil Service (1854)".

కూడా చేరి 693 పద్యాలు మాత్రమే వున్నాయి. అయినా రెఫరెన్సు సౌకర్యం కోసం రెండురకాల ఇండెక్సులు చేర్చాడు ఆఖర్లో— ఒకటి: గ్లాసరియల్ ఇండెక్సు, రెండు: అకారాది సూచనగా ఇండెక్సు టు ఫస్ట్ లైన్స్. దాదాపు 140 ఏళ్ళ తర్వాత, బ్రౌన్ వ్రాతప్రతులు కొన్నిటిని (అన్నిటినీ కాదు) సంప్రతించి మొత్తం 1215 పద్యాలతో ఆం. ప్ర. సా. అకాడమీ 1967 లో మొత్తం 289 పేజీల్లో మరికొంత పెద్ద సంపుటాన్ని ప్రకటించినా, పాఠభేదాల గుర్తింపులేకుండా ఏ రకమైన ఇండెక్సు చేర్చకుండా కనీసం అకారాదిక్రమంలో నైనా పద్యాలు కూర్చకుండా, అధమపక్షం ఏ విధమైన స్థూల వర్గీకరణ లేకుండా రెఫరెన్సుకు ఏ సౌలభ్యమూ లేకుండా, అన్ని అనుకూలాలకు పక్తు విరుద్ధంగా ముద్రించి ప్రచురించారంటే బ్రౌన్ సూచించిన మార్గదర్శకమైన శాస్త్రీయపంథా ఇంతలోనే ఎట్లా పిల్లెత్తుకు పోయిందా అని ఆశ్చర్యం కలగక మానదు. ఇంతకాలమైనా బ్రౌన్ నుంచి మన పండితులు ఏమీ నేర్చుకోలేక పోయారనే అనుకోవాలి.

వేమన పద్యాలను గుర్తించిన వారిలో, వేమన్నను కీర్తించిన వారిలో బ్రౌన్ ప్రథముడేమీకాదు. బ్రౌన్ కంటే ముందు, అబే డుబాయ్ వ్రాసిన "హిందూ మేనర్స్, కస్టమ్స్ అండ్ సెరిమనీస్" (1816) అనే గ్రంథంలో వేమన గుణగానం చేశాడు. కాగా, వేమన పద్యాలను సేకరించిన వారిలో కూడా బ్రౌన్ ప్రథముడేమీ కాదు.

బ్రౌన్‌కంటే దాదాపు నూరేళ్ళ క్రితమే ఫాదర్ లె గాక్ (Father Le Gac) అనే ఫ్రెంచి మిషనరీ వేమన పద్యాలను సేకరించి ఫ్రాన్సుకు పంపివున్నాడన్న దాఖలా ఒకటి నా ఇటీవలి చెదురుమదురు పరిశోధనలో తారసిల్లింది. తెలుగు-సంస్కృత నిఘంటువు, తెలుగు-ఫ్రెంచి నిఘంటువు, రుక్మాంగద చరిత్ర, విక్రమరా (?) చరిత్రలు, వేదపరీక్ష, మహాభారతం, భాగవతం, వేమన పద్యాలు, ఋగ్వేదం, వగైరా వగైరా తెలుగు సంస్కృత తమిళ గ్రంథాలను అయన ఫ్రాన్సుకు పార్సెల్ కట్టి ఓడలో పంపిస్తే, అవి ఫ్రాన్సులోని 'కింగ్స్ లైబ్రరీ'కి 1731 జూలై 30వ తేదీన చేరినట్లు ఒక దాఖలా వున్నది.*

* చూడు: జర్నల్ ఆఫ్ ది బాంబే హిస్టారికల్ సొసైటీ, వాల్యూమ్ IV, 1941 నవంబరు 1 & 2 సంచిక, పేజీలు 68_93. రెవరెండ్ హెచ్. హోస్టన్, ఎస్. జె. (Rev. H. Hosten, S.J.) వ్రాసిన "Indian Books taken to France, mostly by the Jesuits for the Library of Louis XV. 1720-1735" అనే వ్యాసం.

తాళపత్రప్రతులూ, వ్రాతప్రతులూ రెండూ ఇందులో చేరివున్నట్లున్నది. ఫ్రాన్సుకు చేరుకున్న ఆ ప్రతిలో ఎన్ని వేమన పద్యాలున్నాయో, ఎన్ని పాఠభేదాలతో వున్నాయో చూచి చెప్పిన నాథుడెవడూ లేడు. ఇంతకూ ఆ ప్రతులు భద్రంగా వున్నాయో లేదో పరిశోధించినవాడూ లేడు. ఇకనైనా మనం నిద్ర మేల్కొని వీటి కోసం శోధించవలసిన అవసరం లేదా?

ఆంధ్ర విశ్వవిద్యాలయంవారు 1929 లో రాళ్ళపల్లి అనంతకృష్ణగారిచే వ్రాయించి ప్రకటించిన 'వేమన' గ్రంథంలో ఉపోద్ఘాతం చివరన రాళ్ళపల్లివారు ఇట్లన్నారు:

"ఆంధ్ర విశ్వకళా పరిషత్తువారు ఇంక కొంత యౌదార్యము వహించి, వ్రాత ప్రతులను ప్రాత యచ్చుప్రతులను సేకరించి, సంప్రతించి, సవిమర్శముగా వేమన్న పద్యముల నూతన ముద్రణ మొకటి చేసి పుణ్యము గట్టుకొందురుగాక. సామాన్యు లొకరిద్దతో ఆ కార్యము సాధ్యము కాదు కావున నా భారము ప్రకృతము వారినే చెందియున్నది."

రాళ్ళపల్లివారు ఈ మాట చెప్పి యాభై ఏళ్ళు కావస్తున్నా నేటికీ ఈ పని జరగలేదు. ఏ పండిత పరిషత్తూ ఈ పనికి పూనుకోలేదు. వేమన పద్యాలకు ఇంత వరకూ 'వేరియోరమ్ ఎడిషన్' అంటూ రాలేదు. దీన్ని దృష్టిలో పెట్టుకొనే బ్రౌన్ సేకరించి పెట్టిపోయిన వేమన పద్యాల 54 సంపుటాల పెన్నిధి ఒకటిరెండు పీహెచ్డీలకు సరిపోయేంతగా వున్నదని మొదట్నే అన్నాను.

# 6

# తెలుగు నిఘంటు శాస్త్ర పారంగతుడుగా బ్రౌన్

"Books alone will not teach the living language. I used the everyday dialect in the police office. There cannot be a better school. Whenever I had a conversation with a plaintiff, witness, or prisoner, with a learned native judge, or an ignorant menial, every one became my teacher for the time."*

ఏ భాషాశాస్త్రవేత్త, ఏ సోషలిస్టు అనగలుగుతాడు ఈ మాటల్ని? బ్రౌన్ భాషా తత్వానికి ఇదొక గీటురాయి.

బ్రౌన్ మరేమీ చేయకుండానే ఈ ఒక్క నిఘంటువుల్ని మాత్రమే వెలువరించి తనువు చాలించివుండినా, ఆయన తెలుగువాళ్ళకు చిరస్మరణీయుడై వుండివుండేవాడు. అంతటి అమూల్యమైన, సర్వంకషమైన కృషి కానవస్తుంది బ్రౌణ్య నిఘంటువుల్లో— ప్రత్యేకించి తెలుగు-ఇంగ్లీషు నిఘంటువులో.

"సి. పి. బ్రౌన్ సంతరించిన తాతాచార్ల కథలు" (1974)కు వ్రాసిన పీఠికలో: "బ్రౌన్ నిఘంటువు మైనస్ మెనీ గుడ్ తింగ్స్ ఈజీక్వల్టు శబ్దరత్నాకరం" అని ఒక సిద్ధాంతం చేశాను. దురదృష్టవశాత్తు మన తెలుగుపండితులు బ్రౌణ్యాన్ని మర్చిపోయి శబ్దరత్నాకరాన్ని పట్టుకునే వేళ్లాడుతున్నారు. డజన్లకొద్దీ పండితులు పోగై, సంవత్సరాల

* చూడు: C. P. Brown, Literary Life of Charles Philip Brown, London, 1872, P. 12.

తరబడి కాలం ఖర్చుచేసి ఎట్లాగో వెలువరించామనిపించిన సూర్యరాయాంధ్ర నిఘంటు సంపుటాలు సైతం అర్థనిర్ణయంలో బ్రౌణ్యం ముందర వెలవెలపోతాయి.

శబ్దరత్నాకరానికీ, ఆ తర్వాత బహుకాలానికి వచ్చిన సూర్యరాయాంధ్రానికీ మూలాధారం బ్రౌణ్యమే. శ.ర.కారుడు తన పీఠికలో ఎక్కడా బ్రౌన్ పేరెత్తి మాట సామెతకైనా కృతజ్ఞతలు చెప్పి పుణ్యం గట్టుకోకపోయినా (ఈ విషయంలో సూ. ని. వాళ్ళు కొంచెం మేలు), బ్రౌన్ డిక్షనరీని దగ్గర పెట్టుకుని పదాలకు పదాలు అర్థాలకు అర్థాలు గ్రహించిన తావులనేకం వున్నాయి. అదైనా తెలివిగా చేయకుండా సర్దుబాట్లుచేసి సమగ్రత చేకూర్చే ధోరణిలో గాకుండా, సొంత పైత్యాలు చేర్చి భాషను భ్రష్టుపట్టించవోతే వాటికి ఈ రోజుల్లో కూడా విలువ నిల్చివుండేది. శ.ర.కారుడు ఇంతకూ ఒక్కడుగాదు. గుప్తంగా పలువురున్నారు. ఎందరైతేనేం, ఆ గొడవ ఇక్కడ అప్రస్తుతం.

అదేమి దురదృష్టమోకానీ, తెలుగువాళ్ళు, తెలుగుసంస్థలు చేపట్టిన నిఘంటు వుద్యమాలేవీ జయప్రదం కాలేదు. ఉదాహరణలు కావాలంటే బోలెడు. డిక్షనరీ నిర్మాణానికి ఇన్ని సౌకర్యా లేర్పడిన తర్వాతకూడా మనవాళ్ళ అవస్థలు ఇట్లా వుంటే, దాదాపు ఏ వసతులూ పనిముట్లూ లేని ఆ బడుగు రోజుల్లో, రమారమి 150 ఏళ్ళక్రితం బ్రౌన్ ఒక్కడు డిక్షనరీ నిర్మాణానికి పూనుకొని 'ఒక్క చేతిమీదుగా' అంతపెద్ద ప్రామాణికమైన నిఘంటువులను ప్రసాదించిపోవడం ఆశ్చర్యాల్లో అత్యాశ్చర్య మనిపిస్తుంది.

"To commence learning a language without the help of a Dictionary or Grammar requires some determination of purpose; however, he is but a poor workman who cannot work without tools. Beschi, Gilchrist, Carey, and Hands did the same thing with Tamil, Hindustani, Bengali and Kannadi...He who writes a Dictionary of an unexplored language is often misled..."*

అని ఎందరికో జోహార్లర్పిస్తూ ఈ కృషిలోకి దిగి తాను పడ్డ అవస్థలను గురించి బ్రౌన్ ఎన్నోచోట్ల వివరించివున్నా వాటిని మనం పట్టించుకోలేదు.

* చూడు: బ్రౌన్ స్వీయచరిత్ర. Literary Life of Charles Philip Brown, London, 1872, P. 17.

గిడుగు ఎన్నడో బ్రౌణ్యప్రాతిపదికను మెచ్చుకుంటూ, ఎన్నో ఉదాహరణ లిచ్చుకొంటూ శ.ర.నూ, సూ.ని.నీ చెడతిట్టివున్నాడు— ప్రతిభ పత్రికలో వ్రాసిన బృహద్వ్యాసంలో.* దీపాల పిచ్చయ్యశాస్త్రిగారు ఇట్లా అన్నారు:

"....శబ్దార్థ జిజ్ఞాసువులకు శ.ర. కంటెను బ్రౌణ్యమే యెక్కువగా నుపక రించుచున్నది. జాతీయములైన తెనుగు నుడుల సంప్రదాయార్థములను గుర్తించుట లోను విశదముగా వివరించుటలో బ్రౌనే సమర్థుడు.

"శ.ర.కు బ్రౌణ్యమే సంచి మొద్దలు. శ.ర.లోని పదములు చాలావరకు బ్రౌణ్యములోనివే. పదములేకాదు; ఒకకొన్ని అర్థవివరణ వాక్యములున్ను అక్కడివే. బహుజనపల్లివారు బ్రౌణ్యమునుండియు, మరికొన్ని యితర నిఘంటువులనుండియు పదములనెత్తి వ్రాసుకొని, తాము స్వయముగా సేకరణచేసిన పదసమూహమును వాటితో చేర్చి, అన్నిటికిని అర్ధానుస్వార శకటరేఫములమర్చి గ్రాంథికపరిచి ఆ నిఘంటువును తయారుచేసినారు. అప్పటినుండియు గ్రాంథికభాషకు విద్యార్థులకు— విద్వాంసులకు కూడ అదియే ప్రమాణమైనది....

"బహుజనపల్లివారు బ్రౌణ్యములోని పదములనూ— అర్థములనూ తీసికొను టలో చాలా పదములను వదలివేసినారు. అది తప్పుకాదుగాని, తీసికొన్న పదములలో కొన్నిటికి అర్థములు పూర్తిగా వ్రాసికొనక అరకొరగా వ్రాసికొన్నారు. కొన్నిటికి బ్రౌణ్యములో సరియైన అర్థమున్నను చక్కగా చూడక తప్పర్థములు చెప్పినారు.... ఈ విధముగా వారి నిఘంటువులో అసమగ్రార్థములు, అపార్థములు, అపసిద్ధాంతములు, అపశబ్దములు కూడా చేరియున్నవి.

"బ్రౌణ్యమున పొరపాటులు లేకపోలేదు. కాని బ్రౌను ఈ దేశమువాడు కాడు. ఈ భాషవాడు కాడు. కావున ఆ దొసగులు కొంతవరకు క్షంతవ్యములు కావచ్చును. కాకపోయినను అంత చిక్కులేదు. అది పండితులకు ప్రమాణముకాదు. కావున దానిని చూచువారే అరుదు. పలువురు దానిపేరు కూడా వినియుండరు...."†

---

* 'ప్రతిభ' పత్రిక (గిడుగు వెంకటరామమూర్తి స్మారక సంచిక, గుంటూరు), సంపుటి 4, తేదీ లేదు, గిడుగు వ్రాసిన 'శ్రీ సూర్యరాయాంధ్ర నిఘంటువు' అనే వ్యాసం, పేజీలు. 9–88.

†సాహిత్య సమీక్ష, దీపాల పిచ్చయ్యశాస్త్రి, నెల్లూరు, 1956, పేజీలు. 1–4.

ఇక శ.ర. ఇటీవలి ముద్రణకు పరిష్కర్త, అనుబంధకర్త అయిన నిడుదవోలు వేంకటరావుగారు ఏమన్నారో కూడా చూడాలి:

"శబ్దరత్నాకరమునకు ముందు, తెనుగున బ్రౌనుదొరవారి తెనుగు— ఇంగ్లీషు నిఘంటువును, అసమగ్రమగు పరవస్తు చిన్నయసూరి నిఘంటువును గలవు. ఆ రెండింటిలో నాంధ్రభాషోద్ధారకులగు బ్రౌన్‌దొరవారి నిఘంటువు సర్వవిధముల శ్రేష్ఠమైనది. కవిప్రయోగముల నుదాహరించుచు, గ్రంథాశ్వాస పద్యసంఖ్యలనాకరములను దెలుపుచు వ్రాయబడిన నిఘంటువుల కాచార్యపీఠము బ్రౌన్‌దొరవారి నిఘంటువే.... కాగా.... బ్రౌనుదొరవారి నిఘంటువే శబ్దరత్నాకర రచనమునకు నాదర్శమైనది. గాని, బ్రౌనుదొరవారి పేరైన తలపెట్టబడలేదు."*

శ.ర. ప్రస్తావన వచ్చింది గనుక, శాఖాచంక్రమణం అనుకోకపోతే, ఒక చిన్న విషయం. శ.ర. మొదట అచ్చయింది 1885 లో. రెండో ముద్రణ వచ్చేనాటికి శ.ర. కారుడు బహుజనపల్లి మరణించాడు 1891 లోనే. నిడుదవోలువారి వ్రాత నిజమైతే. 1912 లో శ.ర. రెండో ముద్రణను తెచ్చేటప్పుడు, 'పెద్దలు' కొందరు దాన్ని కాస్త రివైజ్ చేశారు. చేర్పులు, మార్పులు చేశారు. ఈ వైనాన్ని శ.ర. లేటెస్ట్ పరిష్కర్త నిడుదవోలుగారు ఎందువల్లనో చర్చించకుండానే దాటవేశారు.

ఉదాహరణకు, ఇప్పుడు మనం చదువుకొనే శ.ర.లో 'కి' ఆఖరున కిస్తీ, కిస్తీబందీ, కిస్మసుపండుగ అనే పదాలు కనపడ్తున్నాయి. 1885 నాటి శ,ర.లో 'కిసుమీసు' వరకే వుండి, పై మూడుపదాలూ లేవు. ఆ కొత్తపదాలు 1912 ముద్రణనుంచీ వస్తున్నాయి. ఇట్లా శ.ర.లో ఈ చేర్పులు చేర్చిన ఆ 'పెద్దలు' ఎవరు?

ఇప్పుడు మనం చదువుకొనే శ.ర.లో మొదట్నే 'నియమ విధాన క్రమము' అని రెండు పేజీల బారున ఒక వివరణపట్టీ వుంది. ఇందులో నానారకాల నియమాలు 27 వున్నాయి. మరి 1885 నాటి శ.ర.లో వున్నది 26 మాత్రమే. అంటే, 1912 ముద్రణనుంచీ ఈ 27 వ నియమం వచ్చి చేరిందన్నమాట. ఏమిటీ 27 వ నిబంధన? "తెనుగున వాడుకలోనికి వచ్చిన యన్యదేశీయ పదములు ఈ క్రొత్త కూర్పునందు జేర్పబడినవి. బ్రౌణ్యనిఘంటువులోనుండి యిట్టి శబ్దములు గొన్ని జేర్పబడినవి ..."

* శబ్దరత్నాకరము, మద్రాసు, 1969, పరిష్కర్త – అనుబంధకర్త అయిన నిడుదవోలు వేంకటరావు అనుబంధము – పీఠిక, ఆఖర్లో వున్న పేజీలలో 120.

ఇట్లా ఈ రెండో కూర్పునుంచి వచ్చిచేరిన కొత్తపదాలు ఎన్నివందలో అవన్నీ తొలగించిచూస్తే అసలుసిసలు బహుజనపల్లి శ.ర. ఇంతకంటే చిన్నదిగా వుంటుంది పరిమాణంలో. ఈ చేర్పులేగాక మార్పులుకూడా ఏమైనా వున్నాయా? లేకేమి? ఉన్నాయి. ఉదాహరణకు 'ఉభయము' అనే పదం తీసుకొందాం : "రెండవయవములు గలది; (గుడి యుత్సవము నడుపుట ఉభయమని వాడబడుచున్నది. అది ఉపాయన శబ్దమువలన గలిగిన గ్రామ్య వైకృతమని తోచెడి)" — ఇదీ 1885 శ.ర.లో కానవచ్చే అర్థవివరణ. రెండో ముద్రణ (1912) నుంచీ కానవచ్చే వివరణ: "1. రెండవయవములు గలది. 2. గుడి యుత్సవపు గట్టడ (గుడి పారుపత్తెపుకాడును లోకులును జేరి చేయు నుత్సవము గనుక దీనికి ఉభయమని పేరు కలిగెను)." చూశారా బహుజనపల్లి చెప్పిన అర్థంపోయి, ఎంతమార్పు వచ్చిందో. అట్లాగే మరొక చిన్న ఉదాహరణ: 'లంబాడి' అనే పదం 'తండా' శబ్దార్థ వివరణలో మాత్రమే వుంది మొదటి శ.ర.లో. మూలపదంగా ఇవ్వలేదు. రెండో శ.ర. నుంచి మూలపదంగా కూడా వచ్చింది.* అంటే, అసలు బహుజనపల్లి తయారుచేసిన శ.ర. ఎంత తీసికట్టుగా వున్నదో దీన్నిబట్టి అర్థమవుతుంది.

ఇట్లా బ్రౌణ్యాన్ని వీటన్నిటి సరసనపెట్టి చూచినప్పుడు ప్రమాణంలోనూ, పరిమాణంలోనూ, పద్ధతిలోనూ మార్గదర్శకమైన బృహత్స్థానం లభిస్తుంది.

బ్రౌణ్యానికి ముందు తెలుగులో నిఘంటువులనేవి లేవనికాదు. ఉన్నాయి. పద్యగద్యల్లో కూడా వున్నాయి. ఆంధ్రనామ సంగ్రహం, అంధ్రనామశేషం, ఆంధ్ర భాషార్ణవం, ఆంధ్రరత్నాకరం, శివాంధ్రం, విష్ణ్వాంధ్రం.... ఇత్యాదయః ఎన్నో వున్నాయి. పద్యాత్మకమైన నిఘంటువులవంటివి. అచ్చుగాకపోయినా, తాటాకుల్లో తప్పులు తడకలుగానైనా మిగిలేవున్నాయి. మచిలీపట్నం మామిడి వెంకయ్యశ్రేష్ఠి ఆధునిక ధోరణిలో అకారాదిక్రమంలో సంతరించగా, అప్పటి మద్రాసు బ్రిటిష్ ప్రభుత్వం వెయ్యివరహాలిచ్చి కొనిపెట్టిన 'ఆంధ్ర దీపిక' వ్రాతప్రతులున్నాయి. వీటన్నిటికీ కూడా బ్రౌన్ సొంత వ్రాతప్రతులు వ్రాయించి పెట్టుకొన్నాడు. ఇక అప్పటికి అచ్చుపడినవి— విలియంబ్రౌన్ తెలుగు - ఇంగ్లీషు (1818), ఎ.డి. కాంబెల్

---

* శ.ర. ముద్రణలలో ఈ 'లంబాడి' విషయమై చెప్పింది వేదం వెంకట్రాయ శాస్త్రి, చూడు: ఆయన సూ. ని. సంపాదకుడుగా వున్నప్పుడు వ్రాసిన చిన్న పుస్తకం: 'ఆంధ్ర భాషా సర్వస్వ నియమ కతిపయములు', మద్రాసు, 1948, పేజి. 2.

తెలుగు - ఇంగ్లీషు (1821), జె. పి. మారిస్ ఇంగ్లీషు - తెలుగు (1835 - 38), ఇంకా జె. మ్యాక్రెల్ వగైరాల వకాబ్యులరీలు—— ఇట్లా వున్నాయి. పైవాటిలో వేటికీ లేని విలువ బ్రౌణ్యానికి ఎట్లా వచ్చిందో తెలుసుకోవాలంటే, బ్రౌన్‌ను ఈ నిఘంటు రచనకు ప్రేరేపించిన పెనుశక్తులేవో స్థూలంగానైనా తెలుసుకోవాలి. అంటే బ్రౌణ్యం పుట్టుపూర్వోత్తరాలలోకి పోవాలి. ఆ నేపథ్యాన్ని మనసుకు తెచ్చుకోవాలి.

దీనికిముందు వేమనపద్యాల అధ్యాయంలో యథాలాపంగా ఒక మాటన్నాను. వేమనపద్యాలలో ఎదురైన చిక్కుల్లోనుంచి తెలుగు సాహిత్య విశ్వరూపాన్నంతటినీ చూపోసనపట్టడానికి బ్రౌన్ ఒక మహోద్యమమే సాగించవలసి వచ్చిందని. ఒక విధంగా ఈ బ్రౌన్ నిఘంటువు పుట్టుకకు కూడా ఈ వేమన పద్యాల అధ్యయనమే ఒక ప్రబల కారణమైంది. తన స్వీయచరిత్రలో ఒకచోట ఇట్లా వ్రాసుకున్నాడు :

"While studying Vemana I procured an interleaved copy of Campbell's Telugu-English Dictionary: in which I daily noted down such words or meanings as came to light. In eight years I swelled this dictionary to fourfold its original extent; and afterwards kept no account but added many thousand expressions; most of which were based on quotations made fromTelugu poems. Not a single quotation was there in Campbell's publication: he was little more than the publisher."*

అని తన నిఘంటు పుట్టుకగూర్చి బ్రౌన్ తానుగానే చెప్పుకున్నాడు. ఊరకే చెప్పు కోవడంగాదు, చెప్పిన పనిని, ఇంకా స్పష్టంగా చెప్పాలంటే, చేసిన పనిని చూచుకోండని ఆ ఆధారాలను మనకు ప్రసాదించిపోయాడు. కాంబెల్ డిక్షనరీకి మధ్యలో తెల్లకాగితాలు కుట్టి బైండ్ చేయించి అందులో తాను పదాలు అర్థాలు చేరుస్తూ, ఎన్నో చర్చలు చేస్తూపోయిన ఆనాటి ఆ సంపుటాలను శిథిలావస్థలోనైనా మ.ఓ.మే.లై.లో భద్రపరిచి పోయాడు. తాకితే పొడైపోతున్న దశలోనైనా వాటిని అక్కడ మనం చూడవచ్చు.

అంటే, 1824 లో వేమన పద్యాలు చదవడం ప్రారంభించడంతో తెలుగు సాహిత్య స్పృహను పొంది, తనకు అర్థంకాని పదాలకు అర్థాలకోసం వెతుకులాట ప్రారంభించి, కాంబెల్ నిఘంటువును సంప్రతిస్తే, అందులో ఒక మూడు పదాలకు అర్థాలు దొరికితే, మరో ఆరు పదాలకు దొరికేవి కావు. వేమన పద్యాల్లో ఎదురైన

* మిన్నెసోటా (అమెరికా) లైబ్రరీలోవున్న లోగడ పేర్కొన్న బ్రౌన్ 'స్వీయచరిత్ర' లిఖితప్రతి.

పదాలకే అర్థాలు దొరక్కపోతే, ఆ మందట్నే చదవడం ప్రారంభించిన భారత, భాగవత, పంచతంత్రాదుల్లోని 'సంక్లిష్ట' పదాల సంగతి చెప్పాల్నా? ఇట్లా 1824 లో బ్రౌన్ తెలుగు నిఘంటు నిర్మాణానికి పునాది రాయి వేసి వ్రాతపనికి వుపక్రమించా డన్నమాట.

కాంబెల్ నిఘంటువులో మొత్తం ఎన్ని పదాలున్నాయో లెక్కబెట్టాలనే దృష్టి వోపికా మనలో ఎందరికున్నవో ఏమో గానీ, బ్రౌనే అక్షరాలా ఆ పని కూడా చేసి పెట్టాడు :

"I began to compile this Dictionary in March, 1824 adopting Campbell's Dictionary as a basis. Campbell contains 14,862 words and in May, 1829 I found that I had added 16,203, and continued to add to it upto 1836 upto 1840 upto 1842."*

1829 మేలో ఏ డిక్షనరీలో ఎన్నెన్ని పదాలున్నాయో బ్రౌన్ లెక్కపక్కలు తీయడానికి కారణమేమై వుంటుంది? ఊరకే ఊబుసుపోకకా? తాను డిక్షనరీ పని ప్రారంభించి అప్పటికి అయిదేళ్లు అయిందనా? లేక తాను ఇన్ని పదాలు కొత్తగా చేర్చానని ఆత్మ సంతృప్తిని ప్రదర్శించుకోడానికా? ఈ విషయం మున్ముందు చర్చకు రాబోతుంది. కానీ బ్రౌన్‌కి ఈ డిక్షనరీ ఆలోచన వచ్చింది 1824 మార్చిలోనేనా, ఇంకా అంతకు ముందునుంచీ పురుగు దొలుస్తున్నదా అని చూస్తే ఆధారాలు లభించకపోవు.

1824 కంటే ముందు, బ్రౌన్‌లో ఈ డిక్షనరీ ఆలోచన ఒకటి పురుగులాగా ప్రవేశించి వుండాలి, కడప వదిలే ముందుగానో, మచిలీపట్నానికి బదిలీ అయిన వెంటనేనో నిఘంటువు వంటిదానికి ఒక చిత్తు రచన చేసుకుంటూ వచ్చాడనుకోవాలి. దీనికి ఆధారం? ఇవిగో ఈ వాక్యాలు :

"In the end of 1822 I was appointed to be Assistant Judge at Masulipatam where Telugu is the language of the people. But still I did not study Telugu beyond keeping a running memoradum of such words or phrases as occured in business."†

---

* చూడు : మ. ఓ. మే. లై. లోని బ్రౌన్ డిక్షనరీల నోట్సుకు సంబంధించిన సంపుటం డి. 1931 (వాల్యూమ్ 1).

† Literary Life of Charles Philip Brown (printed for private circulation), C. P. Brown, London, 1872, P. 7.

అని వ్రాశాడు. అంటే, వేమన పద్యావలోడనానికి చాలా ముందుగానే చిత్తు రూపంలోనైనా ఈ బాపతు కృషి ప్రారంభమైందన్నమాట. దీన్ని బలపరిచే వాక్యాలు కొన్ని మరోచోట ఒక నోట్‌లో వ్రాసిపెట్టి పోయాడు:

"I originally attempted writing an English Telugu Dictionary in 1823. That plan was soon laid aside because I found that Morris had undertaken the work, I therefore undertook the Telugu English Dictionary in March, 1824. This went on steadily untill the end of 1830 — but I continually added fresh words and meanings for ten years after."*

1823-24 నాటికి ఇంగ్లీషు - తెలుగు నిఘంటువు లనేవి రాలేదు. అప్పటికి అచ్చయిన రెండూ—విలియం బ్రౌన్, కాంబెల్ డిక్షనరీలు. రెండూ తెలుగు-ఇంగ్లీషువే కాబట్టి, తాను ఇంగ్లీషు - తెలుగు నిఘంటువును ఎందుకు రాయకూడదని అనుకొన్నట్లున్నది. దీనికి సాక్ష్యం పై వాక్యాలేగాక మరొకచోట మరికొన్ని వివరాలు కూడా ఇచ్చివున్నాడు. కాంబెల్ డిక్షనరీ వచ్చిన మందట్లోనే ఒక చురుకైన బ్రాహ్మణ పండితుడు వచ్చి, "అది తెలుగు - ఇంగ్లీషుదైతే, మనం దాన్ని తిరగదిప్పి ఇంగ్లీషు - తెలుగు చేద్దాం" అని అన్నాడంటూ అప్పటి తన పరిస్థితిని గూర్చి ఇట్లా వివరించాడు:

"Mr. Campbell's Dictionary was printed in 1819 (sic. it must be in 1821) — and in 1821 a clever Telugu Bramin offered to assist me in reversing it - we found this task more than we prepared for: neither of us having sufficient command of both languages.

"In 1822 I began to study Telugu of which I already had sufficient command to converse, correspond, and try prisoners in the language without much aid. I wished to speak and write it correctly; for I daily felt my want of a command of idiom. I began by reading Vemana whose 3,000 stanzas of brief triplets I translated - entering every new word or meaning in an interleaved copy of Campbell's Dictionary; my references to Vemana and other poets always were by chapter and verse; for as I numbered the lines; This course of reading extended to about eight poets and occupied seven years..."†

---

* మ.ఓ.మే.లై. లోని బ్రౌన్ డిక్షనరీల నోట్సుకు సంబంధించిన సంపుటం డి. 1393, (వాల్యూమ్ 2) ఆఖరు పేజీలు.

† అక్కడిదే డి. 1391 (వాల్యూమ్ 1).

ఇట్లా ఇంగ్లీషు - తెలుగు డిక్షనరీ ఆలోచన మాని తెలుగు - తెలుగు, ఇంగ్లీషు నిఘంటువువైపు మనసు మళ్ళిందన్నమాట. రోజులు గడుస్తున్నకొద్దీ, వేమన పద్యాలు, ఛందస్సు, భారతభాగవతాది గ్రంథాలు చదువుతూన్నకొద్దీ ఇది బలపడుతూ వచ్చింది. నెలకో రెండు మూడు నూర్ల చొప్పునైనా కొత్త పదాలు చిట్టాలోకి ఎక్కుతూ వచ్చాయి. వరసబెట్టి కావ్యాలన్నీ చదువుతూ వచ్చాడు కాబట్టి, వట్టి పదాలే గాక, ఆ పదాలకు అర్థాలు, ఎక్కడికక్కడ కావ్య ప్రయోగాలు, కథాగతమైన అన్వయాలూ, వివరణలూ, నోట్సూ చేరుస్తూ వచ్చాడు.

ఇది జరిగిన ఒకటి రెండేళ్ళకే తాను రచించిన ఛందోగ్రంథంలో భారత భాగవతాదులేగాక దాదాపు డజన్ కావ్యాల్లోని పద్యాలను ఏరి ఇంగ్లీషు మీటర్‌లోకి పకడ్బందీగా తర్జుమా చేయగలిగే స్థితికొచ్చాడంటే, ఎంత చప్పున ఎంత సమగ్రంగా క్షుణ్ణంగా చదువుతూ అవగాహనకు తెచ్చుకుంటూ వచ్చాడో అర్థమవుతుంది. తాను అర్థం చేసుకొంటూ ఇతరులకు అర్థమయ్యేలా చేయగలిగాడు. తాను సొంతంగా ఎక్కడికక్కడ పనిముట్లు సమకూర్చుకుంటూ, ఇతరుల పనిని సులువు చేయగలిగాడు. ఈ స్థితిని ఇట్లా వివరించివున్నాడు మరోచోట :

"As I proceeded I had to make my own tools; to write my own grammar and dictionary. Others will now find the path less rugged and toilsome."*

ఇట్లా దాదాపు ఏడెనిమిదేళ్ళపాటు ఏకధాటిగా ఒక మహాయజ్ఞంలా తెలుగు భారతిని సంస్కృతిని సాక్షాత్కరింపజేసుకొనేకొద్దీ, తెలుగు కావ్యపఠనం సాగుతున్న కొద్దీ తన డిక్షనరీ రచన పెరుగుతూ వచ్చింది. ఈ దశను ప్రతిబింబించే డిక్షనరీకి సంబంధించిన ముడిరచన తాలూకు సంపుటాలను మద్రాసు ఓరియంటల్ మేనుస్క్రిప్ట్స్ లైబ్రరీలో చూడవచ్చు.

తొలుత ఛందో గ్రంథం, వేమన పద్యాలు ప్రకటించాడు 1829 నాటికి. బ్రౌన్ గట్టివాడే సుమా అనిపించుకొన్నాడు. ఆ విజయగర్వంతో, తన డిక్షనరీ తాలూకు ముడి రచన సంపుటాలలో నుంచి మాదిరికి కొన్ని పదాలు అర్థాల జాబితా ఇస్తూ 1829 మే లో కాలేజి బోర్డుకు ఒక జాబు వ్రాశాడు. మీరు 'వూఁ' అంటే డిక్షనరీ అచ్చుప్రతిని

*మిన్నెసోటా (అమెరికా) లైబ్రరీలో వున్న లోగడ పేర్కొన్న బ్రౌన్ స్వీయచరిత్ర లిఖితప్రతి.

సిద్ధం చేసిస్తానంటూ ఆ జాబులో ఒక ప్రతిపాదన చేశాడు—కాంబెల్‌లో లేనివి అదనంగా 16 వేల పదాలు చేర్చానంటూ, ఆయన నిఘంటువుకు పూర్తి భిన్నమైన ధోరణిలో కావ్య ప్రయోగాలు, లోక వ్యవహారాలు ఎత్తిచూపుతూ, తన బృహన్నిఘంటువులో సాధికారమైన అర్థ నిర్ణయాలు వింగడించానంటూ, మీరు అచ్చు వేస్తానంటే మొత్తం ప్రతిని పూర్తిచేసి సమర్పిస్తానని కాలేజీ బోర్డుకు ఆ ప్రతిపాదనలో తెలిపాడు. ఈ ప్రతిపాదనైతే పంపాడుగానీ, 8 నెలలైనా జవాబేమీ రాకపోతే, పబ్లిక్ డిపార్ట్‌మెంట్ సెక్రెటరీకి ఒక 'రిమైండర్' పంపుతూ ఇట్లా వ్రాశాడు 1830 ఫిబ్రవరి 2న.

"In the end of May last (1829), I submitted another work for publication to the College Board; this was a new edition of the Telugu Dictionary; containing about eighteen thousand words additional to the existing (Campbell's) edition, which was thereby increased to atleast twice to original extent. Of the heavy expense to which this undertaking has subjected me, I do not wish here to give the details. The private communications received by me in consequence from the members of the Board, and from the author, Mr. Campbell, were very gratifying; but I have not yet been made acquainted with the decision of Government as to the publication of this work. Some copies of Mr. Campbell's edition still remain unsold; but they will probably be disposed of long before the printing of the new edition could be completed.

"For any information as to the... wishes of Government respecting the publication of the Telugu Dictionary, I should feel most grateful."*

ఏమైతేనేం, ఏళ్ళు పూళ్ళు గడిచినా బ్రౌన్ ఈ డిక్షనరీ ప్రతిపాదన పైకి రాకుండా అణగదొక్కి పెట్టినట్టున్నారు కాలేజి బోర్డువారు. ప్రతేకించి బోర్డులో ముఖ్యులైన కాంబెల్, మారిస్ దొరలు బ్రౌన్‌ను ఎక్కిరానీలేదు. సదుద్దేశంతో నైతేనేమి దురుద్దేశంతో నైతేనేమి కాలేజి బోర్డు దీన్ని అట్లా అణగదొక్కి పెట్టడమే తెలుగువాళ్ళకు మేలైంది. అప్పట్లో దీన్ని బోర్డు అచ్చువేస్తామని అనివుంటే, బ్రౌన్ ఈ డిక్షనరీ తాలూకు ప్రెస్‌కాపీని ఏదో హడావుడిగా తయారుచేసి సమర్పించి వుండవలసి వచ్చేదేమో. అప్పుడు బ్రౌన్ డిక్షనరీకి ఇంతటి విలువ వచ్చి వుండేది కాదేమో.

* చూడు: తమిళనాడు ఆర్కైవ్స్. 1830 మార్చి 9 తేదీనాటి పబ్లిక్ డిపార్ట్‌మెంట్ కన్సల్టేషన్ నెంబర్ 135.

ఎట్లయితేనేం, 1824 లో 'అ' నుంచి ప్రారంభించిన ఈ డిక్షనరీ, 1831 నాటికి 'క్ష' వరకు కొనసాగింది. ఇట్లా ముడిరూపంలో తాను సొంతంగా వ్రాసుకున్న పదాల నోట్సు సంపుటాలను ఆధారం చేసుకొని, 1832 నవంబరు 10 న తన జన్మ దినాన మళ్ళీ శుభ్రంగా అకారాదిక్రమంలో పదాలను అర్థాలను ఎనిమిది సంపుటాల లోకి ఒక వైపు పేజీల్లో 'ఫేర్‌కాపీ'గా ఎత్తి వ్రాయించడం ప్రారంభించాడు. కుడి వైపు పేజీలను కాళీగా అట్టి పెట్టమన్నాడు. కావ్య ప్రయోగాలు, ఇతర దాఖలాలతో ఇంకా ఎన్నెన్ని ఆధారాలతోనో చర్చచేస్తూ, ఈ కాళీ పేజీల్లో మళ్ళీ తాను సొంతంగా వ్రాస్తూ వచ్చాడు.

1834 డిసెంబర్లో మూడేళ్ళపాటు సెలవు మీద లండన్ వెళ్తూ వోడమీద ఈ దస్త్రాలను కూడా తన వెంట తీసుకెళ్లాడు. లండన్‌లో కూడా ఈ డిక్షనరీ వ్రాత విరమించలేదు, ఎక్కువ భాగం వ్రాత అక్కడే చేశాడు కూడా. మ.ఓ.మే.లై. లోని డి. 1391 ఎనిమిదో సంపుటంలో ఆఖరున "Finished in London, 20th May 1836" అని వ్రాసిపెట్టి వున్నాడు. ఈ దశలో మళ్ళీ ఎన్నో కొత్త పదాలు, కొత్త చర్చలు చేరుస్తూ, మారుస్తూ వచ్చాడు. సెలవు అనంతరం 1837 మధ్యలో లండన్‌నుంచి తిరిగి వస్తూన్నప్పుడు పడవ ప్రయాణంలో కూడా ఈ సంపుటాలను తిరిగేస్తూ వచ్చాడు. పడవలో పరిచయమైన కాల్డ్వెల్ (బిషప్) తన జీవిత చరిత్రలో ఈ ఎనిమిది సంపుటాల బ్రౌన్ డిక్షనరీని ప్రస్తావించి వుండడాన్నిబట్టి పడవ ప్రయాణంలో కూడా వీటి పని పట్టిస్తూ వచ్చాడనే అనుకోవాలి.

ఇది ఇట్లా సాగుతున్నప్పుడు—మధ్యలో మరో ఆలోచన వచ్చింది బ్రౌన్‌కు. బుర్ర మరోవైపు పోయింది. తెలుగు ఇంగ్లీషు నిఘంటువును తిరగదిప్పి 1830 లో ఇంగ్లీషు తెలుగులోకి పరివర్తన చేయడం ప్రారంభించాడు. ఇట్లా కొంత దూరం పోయిన తర్వాత జాన్సన్ ఇంగ్లీషు డిక్షనరీ కాపీ కొని, దాన్ని 'ఇంటర్లీవ్' చేయించి నాలుగు సంపుటాలుగా బైండ్ చేయించి, మధ్యలో కుట్టిన తెల్లకాగితాల్లో జాన్సన్ ఇంగ్లీషులో ఇచ్చిన అర్థాలను తెలుగులోకి అనువాదం చేస్తూ మొత్తం జాన్సన్ నిఘంటువును తెలుగులోకి దించాడు. ఒకచోట ఈ కృషి గురించి ఒక చిత్తునోట్‌లో ఇట్లా వ్రాసిపెట్టి పోయాడు.

"This was completed on 21 July 1832 when I was at Masulipatam. That rough draft is written in an interleaved quarto Johnson, in four very thick volumes... The transcript

of this English – Telugu Dictionary is written in another Johnson, bound in four volumes. This is the revised and corrected and completed work. I began it in August 1838 and finished it in December 1840. Then I began the revisal..."*

ఇట్లా జాన్సన్ నిఘంటువును (తెలుగు తర్జుమాను) తిరగవ్రాయడంలో జాన్సన్ ఇవ్వని ఇంగ్లీషు పదాలను కూడా చిట్టాలోకి ఎక్కిస్తూ అర్థాలు సమకూరుస్తూ వచ్చాడు. ఇండియాకు 1838 జనవరిలో తిరిగొచ్చేటప్పటికి మారిస్ ఇంగ్లీషు తెలుగు నిఘంటువు మొదటి సంపుటం వెలువడింది. దాన్నీ సంప్రతించడం ప్రారంభించాడు. కానీ అందులో తనకు ఆట్టే సారం కనబళ్లేదు. దాన్ని భూతద్దంపెట్టి శోధిస్తే అందులోనూ తనకు కొత్తగా కనపడ్డ ఒకటి అరా పదాలను అర్థాలను చేరుస్తూ వచ్చాడు. ఈ దశను గురించి మరొక చిత్తునోట్‌లో మరికొంత విపులంగా వ్రాశాడు.

"...This part of the work (translation of Johnson's) occupied two years: and from this rough draft (excluding a great deal) I prepared (in 1839 & 1840) the fair copy. In the following year I submitted this to a further and final process wherein the whole was perused and closely examined. In this I had the assistance of Krishtama Chari, a learned bramin of remarkable genius, industry and patience who revised each article with me making such observations as occurred. This was the finishing process and was nearly as laborious as any that preceded it. We compared every page with Morris's English Telugu dictionary- with Reeve's English Cannadi dictionary - with Gilchrist & Roebuck's philology or English Hindustani dictionary with an English-Tamil dictionary and some other works and freely adopted whatever proved to be correct and useful.

"The assistance of the bramin I have mentioned was the only aid I received from Government or from any individual: beyond that of the transcribers (sudras) whom I was obliged to employ as my private servants. The learned bramins also whom in various years I employed were all supported by myself..."†

---

*చూడు: మ. ఓ. మే. లై. లోని సంపుటం డి. 1391 (వాల్యూమ్ 7).

†మ. ఓ. మే. లై. లోని సంపుటం డి. 1392 (వాల్యూమ్ 1).

ఇట్లా డిక్షనరీ నిర్మాణంలో రాటుదేలి 1840 వచ్చేటప్పటికి తన శక్తులేమిటో తనకు తెలిసి వచ్చాయి. తన పనిలో వున్న పరిమితులు, మెరుగులు, మరుగులు అర్థమయ్యాయి. 1839-40 లో తెలుగు భాషా సాహిత్యాలపై సమీక్ష, తెలుగు కవులు, కావ్యాలు, జంగం లిటరేచర్, బసవ పురాణం వగైరాలపై ఇంగ్లీషులో పెద్ద పెద్ద వ్యాసాలు ప్రకటించాడు. నిఘంటు నిర్మాణంలో తాను చేపట్టిన ప్రయోగాలన్నీ జయప్రదమై తన అవస్థలన్నీ గట్టెక్కి, తన డిక్షనరీలు 'అ' నుండి 'క్ష' వరకు, A నుండి Z వరకు వచ్చి పూర్తయ్యాయి. దాదాపు 20 ఏళ్ల ఎడతెరిపి లేకుండా సాగిన కృషి ఒక కొలిక్కి వచ్చింది. బరువుగా తృప్తిగా ఒక నిట్టూర్పు తీసుకున్నాడు.

ఒక్క కావ్యాలేగాకుండా, ఎన్నో ఇతర గ్రంథాలను, ఇతర భాషా నిఘంటువుల్ని సంప్రతించాడు. జన వ్యవహారాన్ని గుర్తుపట్టి అందులోనుంచి పదాలను అర్థాలను పిండుతూ వచ్చాడు. సమకాలిక పత్రికల్లో నుంచి కూడా దాఖలాలు ఏరుతూ వచ్చాడు. కనపడ్డ పండితుల్నందర్నీ పామరుల్నీ అడిగి అర్థాలు పదాలు రాబట్టేవాడు. సామెతల్ని ఎప్పటికప్పుడు సేకరిస్తూ తన నోట్సుల్లో రికార్డు చేసుకొంటూ వాటిల్లోని నుడికారపు సొంపుల్ని పద స్వరూపాల్నీ గుర్తించేవాడు. ఎన్నెన్నో చాటువుల్నీ, బూతు పదాల్ని కూడా సేకరించి పెట్టాడు. అటు సంస్కృతాల్నీ, ఇటు అన్యదేశ్యాల్నీ రికార్డు చేశాడు. ఇట్లా డిక్షనరీ నిర్మాణానికి కావల్సిన అన్ని హంగుల్నీ వొనగూర్చుకొన్నాడు. కావ్య ప్రయోగాల్ని మాత్రమే కళ్ళకద్దుకొని జన వ్యవహారాన్ని చులకన చేయలేదు. లోక వ్యవహారాన్నీ రూఢినీ మాత్రమే గమనించి, కావ్యాలను తృణీకరించ లేదు. తన నిఘంటువుల్లో అందువల్లనే అటు గ్రాంథికమూ ఇటు వ్యావహారికమూ స్థానం చేసుకొన్నాయి.

వీటిల్లో ఒక్కొక్క విషయాన్నే తీసుకొని చర్చించుకోవల్సింది ఎంతో వుంది. ఉదాహరణకు సామెతల విషయం తీసుకొందాం. ఈ బ్రౌన్ డిక్షనరీ నోట్సుల్లో శబ్దాలకు అర్థనిర్ణయం చేసేటప్పుడు సామెతల తోడ్పాటున్ను కూడా తీసుకొన్నాడు. కాబట్టే ఎన్నో సామెతల్ని (బూతు సామెతల్ని కూడా) రికార్డు చేసిపెట్టి పోయాడు. ఇవన్నీ కూడా ముద్రిత ప్రతిలోకి ఎక్కలేదు. 1868 లో తెలుగు సామెతలను క్రోడీకరించి 'ఆంధ్రలోకోక్తి చంద్రిక' పేరుతో వాటికి మహా ముచ్చటైన ముద్రణ రూపం ఇచ్చిన ఎం. డబ్ల్యు. కార్ పండితుడి కంటే కూడా ముందు, ఈ తెలుగు సామెతల్ని ఒక ప్రత్యేక సాహిత్య శాఖగా గుర్తించి పెక్కింటిని రికార్డు చేసిపోయిన మొదటి వ్యక్తిగా కూడా బ్రౌన్నే జమవేసుకోవాలి. మచ్చుకు రెండు సందర్భాలు పరికిద్దాం:

ఈ డిక్షనరీ నోట్సుల్లో 'సిద్దాయం' అనే పదం పక్కన "ఊరు ఉసిరికాయంత, సిద్ధాయం తాటికాయ అంత"* అనే సామెతనూ దాని ఇంగ్లీషు అనువాదాన్నీ వ్రాసుకున్నాడు. అట్లాగే 'మంకెన' పదం దగ్గర "పెద్దాపె దండు మంకెనకు చేటు" అనే సామెతనూ, ఇంగ్లీషులో దాని అర్థాన్నీ వ్రాసిపెట్టాడు. ఇవి రెండూ కూడా డిక్షనరీ ముద్రిత ప్రతిలో ఆయాచోట్ల కానరావడంలేదు. ఇట్లాగే ఎన్నో సామెతలు. ఒకవిధంగా సామెతలగని ఆ నోట్సులు. ఇక 'చాటువులు' తెలుగువే గాక సంస్కృత చాటువులు కూడా ఎన్నో రికార్డయి వున్నాయి.

"I had collected a great number of Telugu proverbial expressions: but have followed Johnson's example and omitted them."

అని వ్రాసుకొన్నాడు ఒకచోట.† బహుశా, జాన్సన్ అడుగుజాడల్లో పోవాలనుకొన్నందువల్ల తాను సేకరించిన అన్ని సామెతల్నీ డిక్షనరీ ముద్రిత ప్రతిలోకి తీసుకురాలేదనుకోవాలి.

మరో చోట ఇట్లా వ్రాసిపెట్టిపోయాడు.

"Thus far I have tried to collect and explain proverbs - but I have atlast found (1839) that Johnson shelved his wisdom in letting them perish. In English 'Never a barrel herring signifies one is as bad as the other - there is not a pin to choose between them': and who would undertake to collect such rubbishing nonsense?"§

సామెతల విషయం వచ్చింది కాబట్టి, ఇక్కడమళ్ళీ శాఖా చంక్రమణం అనుకోకపోతే, ఒక్కమాట. ఆం. ప్ర. సా. అకాడమీ 1959 లో ఒకసారి, 1965 లో

*ఆం. ప్ర. సా. అకాడమీ తెలుగు సామెతల స్వాములు 'సిధ్ధాయం' అంటే అర్థం తెలియక కాబోలు 'సిధ్ధాంతం' అని మార్చారు.

†మ.ఓ.మే.లై.లోని సంపుటం డి. 1392 (వాల్యూమ్ 1).

§ " " డి. 3141. ఇందులో బ్రౌన్ పేర్కొన్న ఇంగ్లీషు సామెతలు గురించి—చూడు: Oxford Dictionary of English Proverbs, London (second edition), 1952, P. 24; Macmillan Book of Proverbs, Maxims, and famous Phrases, New york, 1966, P, 1139.

మరోసారి, 1974 లో మూడోసారి మూడు ఎడిషన్ల "తెలుగు సామెతలు" తెచ్చారు. మొదటి ఎడిషన్ సంపత్ రాఘవాచార్యులుగారి ఆధ్వర్యంలో వస్తే, రెండోదానికి కవి సమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణ సంపాదకత్వం వహిస్తే, లేటెస్ట్ అయిన మూడో ఎడిషన్‌కు మరుపూరు కోదండరామిరెడ్డిగారు ఎడిటోరియల్ బాధ్యత నిర్వహించారు. ఇట్లా 15 ఏళ్ళ వ్యవధిలో ఇందరిచేత యిన్ని చేతులమీదుగా తెలుగు సామెతల సంకలనం చేయించినా బ్రౌన్ ఏనాడో సేకరించి పెట్టిపోయిన సామెతల్లో కనీసం సగమైనా వీటిల్లో ఏ ఎడిషన్లోనూ కానరావడంలేదు. ఈ మూడు ముద్రణలకూ పై ముగ్గురూ మూడు కోణాల్లో వేర్వేరుగా పీఠికలు వ్రాసినా, తమకు ఎన్నేళ్ళముందుగానో ఈ రంగంలో జరిగిన కృషేమిటో, ఏ ఒక్కరు కూడా ప్రస్తావించకుండానే ఏమేమో వ్రాశారు. బ్రౌన్, పర్సివల్, కార్, బెన్సన్ యిట్లా అనేకులు ఈ రంగంలో మౌలికమైన కృషి చేసివున్నా దీన్ని వీరిలో ఎవరూ ఎరగరు. లేకుంటే మాట సామెతకైనా ఎందుకు ప్రస్తావించకుండా వుంటారు? ఈ విషయంలో కూడా బ్రౌన్ యింత చేసి పెట్టిపోతే దాన్ని యింతవరకూ చూచిన పాపాన్నె పోలేదన్న మాట. కనీసం బ్రౌన్ డిక్షనరీ ముద్రిత ప్రతిలో వున్న అన్ని సామెతలైనా వీరి సంకలనాల్లోకి రాలేదు. ఇట్లా వుంటుంది మనవారి కృషి.

ఇట్లాగే ఈ సందర్భంలో చెప్పుకోవల్సిన మరికొన్ని విషయాలు. ఉదాహరణకు చెట్లు చేమలు, చేపలు, పాములు, ఇతర జంతువులు—వీటికి సంబంధించిన పదాలను గూర్చి చర్చించేటప్పుడు బ్రాహ్మణ పండితులు పనికిరారన్నాడు బ్రౌన్. చూడండి ఏమి వ్రాశాడో.

"The names of fishes, snakes, and wild animals have generally been collected from conversations with huntsmen and people from the hills, The entire ignorance of bramins on these matters led me to adopt such extraneous aid."*

పాముల్ని గూర్చి చెబుతూ తన చిత్తునోట్సులో ఒకచోట యిట్లా వ్రాసి పెట్టాడు:

"...These (the plates in Russel's Indian Serpents 1801 - Part 11) I shewed to Telugu snake - catchers in Madras and I here write down the names they gave me - only several of the

*మ.ఓ.మే.లై. లోని సంపుటం డి. 1392 (వాల్యూమ్ 1).

names were evidently mere guesses and the same man would one day give one name and another another. Some names are Tamil..."*

ఇక చెట్లు, పిట్టలు, జంతువులు గురించి ఎన్నిచోట్ల ఎంత నోట్సు వ్రాసి పెట్టాడో లెక్కలేదు.

ఇట్లాగే రంగులు—ఒక సంపుటంలో ఒక డ్రాయింగ్ కాగితంపై రంగులన్నీ గీయించాడు. ఏ రంగు ఎట్లా వుంటుందో తెల్సుకోనిదే నిద్రపోయినట్లు లేదు బ్రౌన్. ఒక్క పచ్చలోనే ఎన్ని పచ్చలు గీయించాడు: తెల్లపచ్చ, సఫేదపచ్చ, కప్పుపచ్చ, కాటుకపచ్చ....రంగుల విషయంలో నిఘంటుకారుడికి ఎదురయ్యే ఇబ్బందుల్ని గురించి ఇట్లా వ్రాశాడు:

"The names of colours are not easily explained: thus 'erra' (ఎర్ర) is the obvious name for red, but include brown and scarlet. 'Pacca' (పచ్చ) leaf colour - means both green and yellow (probably originally in the colour of a faded leaf): 'nili' (నీలి) denotes blue, purple and sometimes black. Thus the generic name is in each nation given to a peculiar tint: who can define what Homer means 'glaucus' and 'cyaneus': and Shakespeare seems to call blue eyes grey. To remedy this uncertainity I have always specified some bird, flower, or other object known in India that exemplifies the tint in question..."†

ఇట్లాగే వివిధరకాల లోహ, మృణ్మయపాత్రలు — వూరికే 'పాత్రవిశేషం' అంటే ఏమీ అర్థంకాదని— ఏపాత్ర ఎట్లా వుంటుందో— అటికె, గంగాళం, దుత్త, కడవ, చెరవ, చట్టి, చెంబు.... ఇట్లా వీటన్నిటికీ— వరసగా బొమ్మలు గీయించాడు. ఇట్లాంటి కొన్ని చిన్నచిన్న పదాలకు వట్టిమాటలతో ఎంత వివరించినా అర్థం కాదనుకొన్నాడు. పదిమాటలతో చెప్పలేని భావాన్ని ఒక్క బొమ్మతో ఇస్తే అర్థమవుతుంది గనుక, డిక్షనరీలో బొమ్మల్ని ముద్రించే అవసరాన్ని గుర్తించాడు బ్రౌన్. ఇట్లన్నాడు ఒకచోట:

* డి. 1391.

† డి. 1392 (వాల్యూమ్ 1).

"Some instruments, weapons, vessels, jewels, dresses etc., cannot be clearly interpreted without the aid of pictures. Several dictionaries printed in English and French gave such pictures: the latest Crabbs dictionary of general knowledge, in one and small volume (published by Tegg): but we have no convenient book to guide the reader regarding these objects..."*

తన డిక్షనరీలో ఇట్లా కొన్ని బొమ్మలు గీయించి ముద్రించ చూశాడుగానీ అప్పటికి మన ముద్రణ అంత అభివృద్ధికాలేదు కాబట్టి, ఖరీదు జాస్తి అవుతుంది కాబట్టి మానుకొన్నాడనుకోవాలి. అప్పటికీ కొన్నిచోట్ల బొమ్మలు గీయించాడు— ఉదాహరణకు చూడండి మహాభారత యుద్ధంలో వచ్చే "శకట వ్యూహం." అట్లాగే గర్భగృహం.

ఇంకా రాజకీయ, వేదాంత, మత, శాస్త్ర సాంకేతిక పదజాలాన్ని గురించి కూడా ఈ నోట్సుల్లో పెక్కుచోట్ల చర్చించాడు. ఉదాహరణకు:

"...Some useful words are omitted in all the dictionaries I have named (for instance, 'Feudal' is not in Johnson)... words connected with a feudal Government are readily explained: but all the ideas connected with the liberty of the subject are (as franchise, vote, popular etc.) are far from easy to render..."†

ఈనాటికి కూడా మనం 'వోటు'ను వోటుగానే గ్రహిస్తున్నాం. కొందరు 'ఓటు' అని కూడా వ్రాస్తున్నారు.

ఇట్లా ఇన్ని పుంతలు తొక్కి తెలుగు శబ్దతత్వాన్ని ఇంతగా మధించి చూశాడు గనుకనే తనకు ఈ డిక్షనరీల పని ఎనలేని తృప్తి నిచ్చినట్లున్నది.

"My own studies had sufficiently tested the completeness and accuracy of the Telugu - English Dictionary. But a similar test was required for the English - Telugu Dictionary. And this was supplied for the process (sufficiently tedious) of causing natives to read English books to me and explain them in Telugu. The test made a material change in the book, supplying numerous phrases, and suggesting the exclusion of whatever proved wrong or superfluous...

---

* డి. 1392 (వాల్యూమ్ 1).

† అదే సంపుటం.

"My dictionaries were compiled entirely from original sources: but in the revisal of English - Telugu Dictionary I used... other language dictionaries also...*

తృప్తికరంగా తయారయ్యాయి అనుకొన్న తర్వాతనే, ఇక ఈ నిఘంటువులు అచ్చయితే బాగుణ్ణనుకొన్నాడు. డిక్షనరీలకు ఏం పేరుపెడితే బాగుంటుందో చాలా దూరమే ఆలోచించినట్లున్నాడు బ్రౌన్.

"Call this book - అక్షయపాత్ర, నామనిధి, పదనిధి, కమఠం, జలధారం a fountain! Jaladhara Minaxia decides in favour of బ్రౌణీయ్యం పుష్కరం as it occupied one 12 twelve years. No బ్రౌణ్యం. బ్రౌణ నిఘంటు or బ్రౌణీయం——"†

మరికొన్ని పేజీల తర్వాతనే ఇట్లాగే మరికొన్ని ఆలోచనలకు అక్షరరూప మిచ్చిపోయాడు.

"...as to what should be the title of the Dictionary. A Dictionary Telugu and English in three parts. 1. The ordinary Dialect. 2. The absolute and poetical. 3. The modern mixed foreign explanations or thus: A Dictionary of the Telugu language explained in English... Let the name be సర్వాంధ్ర నిఘంటు or moderately thus కడప నిఘంటు or better thus కోరుకొండ నిఘంటు or better గోదావరీ నిఘంటు, ద్రాక్షారామ నిఘంటు....Golconda Dictionaries. Or better thus: ఆంధ్ర ఇంగ్లీషి నిఘంటు, ఇంగ్లీషాంధ్ర నిఘంటు, సర్వాంధ్ర నిఘంటు, సమస్తాంధ్రం...."

దీనికి పూర్వంనాటి సంపుటంలో ఆలోచనకొచ్చిన మరికొన్ని పేట్లు చూడండి: "తెనుగుతెట్టె, తెలుగులగని, ఆంధ్ర త్రివేణి (ఇవన్నీ అడ్డగీతతో కొట్టేసి వున్నాడు), ఆంధ్ర భాషాంజనం, ఆంధ్ర సాహిత్య దర్పణం, శబ్ద త్రివేణి, ఆంధ్ర కామధేను or బ్రౌణ్యం...." (చూడు: 70 వ పేజీలో ఛాయాచిత్రం.)§

* అదే సంపుటం.

† మ.ఓ.మే.లై. లోని డి. 1391 (వాల్యూమ్ 8).

§ మ. ఓ. మే. లై. లోని బ్రౌన్ డిక్షనరీ నోట్సు (కాంబెల్ నిఘంటువును ఆధారం చేసుకొని ఏర్పరుచుకొన్న నోట్సు) డి. 3156.

ఇట్లా సరైన పేరుకోసం ఎంత ప్రాకులాడాడు! కడకు అట్టబడి ఇట్టబడి "తన నిఘంటువుకు బ్రౌణ్యమని పేరుపెట్టడంలోనే బ్రౌనుగారికి సంస్కృత సంప్రదాయంపట్ల గల గౌరవం తెలుస్తుంది."*

ప్రారంభదశలోనే తన ఈ డిక్షనరీ కృషికి ఎంతెంత ఖర్చు అయ్యేదీ, ఎంతెంత కాలం పట్టేదీ అంచనా వేసుకొంటూనే వచ్చాడు. ఉదాహరణకు ఒకచోట వేసుకొన్న అంచనా లెక్కపక్కలు చూడండి :

"Writers should be employed, and the volumes divided among them, each having 100 pages + interleaves = 200. Eight Pagodas a month would be moderate pay, and each man with diligence ought to finish on an average three pages per day - that is including the interleaves = 6 per day × 6 writers = 36 pages per day which at 25 days per month gives about 900 pages per month. (3 writers 400 pages per month.)

"The whole volume in my manuscript equals full 1,200 pages or more. I think that three diligent writers ought to copy it out in about 4 months: and perhaps 3 pagodas per month would be enough pay = 36 pages: however, if I can manage to get it copied out in so little as a twelve month I shall be satisfied as the labour of revising the sheets copied will take a long time.

"The above was written in 1829. Ultimately the copy in 8 folio volumes was prepared in 1831-33 and from that the abridged copy for the press was made in 1840. But in printing the Dictionary, in 1845 I found the necessity of again transcribing it. And much of this was done by my own hand, the work being too intricate for native transcribers."†

ఇట్లా ఎప్పటికప్పుడు అంచనా వేసుకొంటూ లెక్కపక్కలు చూచుకొంటూనే వచ్చాడు. తాను వ్రాసుకున్న డిక్షనరీ నోట్సులనుంచి దేశీయ పండితులచేత 'ఫేర్ కాపీల' తయారీవంటి పనులైనా చేయిస్తామనుకొంటే, అది కూడా అనుకొన్నట్లు కుదిరినట్లులేదు. మళ్ళీ తానుగానే ఈ పనికూడా చేసుకొంటూ వ్రాసుకుంటూ వచ్చాడు. మరోచోట చిత్తుగా వ్రాసిపెట్టిపోయిన మాటలు చూడండి :

---

* లోగడ పేర్కొన్న దిగవల్లి వెంకటశివరావు వ్రాతప్రతి 'Notes on C. P. Brown'.

† డి. 3156.

"I would gladly have lightened the labour by employing natives to translate (and transcribe) for me; but a little experience shewed that to do the work well I must do it myself. Accordingly the whole of both dictionaries was in my own handwriting; and in like manner I was obliged to compile the abridgement, or arrangement of my rough notes as no native amanuensis however expert in English can be trusted in such a task - I am aware that here and there the Telugu phrases will betray that they proceeded from a foreigner's pen...*

ఇట్లా ఈ నిఘంటువుల నిర్మాణంలో తాను ఎన్ని అవస్థలు పడ్డాడో ఎన్నెన్ని చోట్లనో వివరంగా వ్రాసిపెట్టి పోయాడు.

ఇదంతా ఎందుకు ఇట్లా ఇంత విస్తారంగా బ్రౌన్ చిత్తువ్రాతల్లోనుంచి తీసి అదే ముడి రూపంలోనే కోట్ చేయవలసి వచ్చిందంటే కారణం లేకపోలేదు. గిడుగు 'ప్రతిభ' పత్రికలో వ్రాసిన వ్యాసంలో వున్నంతలో బ్రౌణ్యాన్ని మొత్తంమీద శ్లాఘిస్తూ శ.ర.ను, సూ.ని.ని చెడదిడుతూ ఒక మాటన్నాడు. ఆయన బ్రౌణ్యాన్ని మెచ్చుకొన్నాడుగానీ బ్రౌన్‌ను కాదు. బ్రౌణ్య నిఘంటువును రచించింది బ్రౌన్ కాదన్నట్లు, మరెవరెవరోననే అభిప్రాయం కల్గేలాగా వ్రాశాడు! "బ్రౌణ్య నిఘంటువు రచించిన పండితులు ప్రఖ్యాత పండితులు, జూలూరు అప్పయ్య పండితులు మొదలయిన వారు...." అని.† బ్రౌన్‌కు ఇంతకంటే అన్యాయం మరొకటి వుండదు.

బ్రౌణ్యాన్ని వ్రాసింది బ్రౌనేకానీ మరెవరో ఎట్లవుతారు? కడకు ఫేర్‌కాపీలు వ్రాసుకోవడం కూడా చాలామటుకు తానే చేసుకొన్నట్లు వ్రాసుకొన్నాడు. ఇందుకు సాక్ష్యాధారాలు మనముందున్నాయి. ఈ డిక్షనరీలను అయన తన పర్యవేక్షణలో దేశీయ పండితులచేతనే వ్రాయించి ప్రకటించాడనే దురభిప్రాయం ఆనాటి గిడుగులోనే కాదు, ఈనాటి మనలో ఇంకా చాలామందిలో వుంది. ఆయన పండితుల సాయం ఎన్నోవిధాలుగా తీసుకొన్నా— ఈ అవస్థ అంతా తాను సొంతంగా పడి, వాళ్ళ సూచనలు,సలహాలు వున్నప్పటికీ,అడుగడుగునా తన సొంత 'డిస్క్రెషన్' జోడించి అర్థ నిర్ణయాలుచేసి, కడకు వ్రాతపనికూడా తానుగానే చాలావరకు స్వయంగాచేసి, ఈ మహా యజ్ఞాన్ని పూర్తిచేసి పదనిధులు పొంగించిన నిఘంటు సోమయాజి అయ్యాడు బ్రౌన్.

* డి. 1392.

† లోగడ పేర్కొన్న గిడుగు వ్యాసం 'శ్రీ సూర్యరాయాంధ్ర నిఘంటువు', పేజి. 32.

తనచుట్టూ చేరిన తెలుగుపండితులు చెప్పినవి చెప్పినట్లుగా గ్రహించివుంటే బ్రౌణ్యానికి అంతటి విలువ వచ్చివుండేది కాదు— అని చెప్పడానికి మచ్చుకు ఈ క్రింది జాబులేన్నే ఉదాహరణలుగా స్వీకరించవచ్చు.

13

మహారాజశ్రీ బ్రౌన్‌దొరగారి సముఖమునకు॥ విన్నపములు.

తిప్పాభట్ల వెంకటశివశాస్త్రులు సలాములు చేశి చాయంగల విన్న పములు.

మేటీకోఉు అనేమాటకు రెండు ఱెండు (sic) అర్థములు. 1. సముదాయముమీద సమముగా చూచుకొనుట. 2. పరస్పరము కనిపెట్టుట. యీ ఱెండు అర్థములు మేటీకోఉు అనేమాటకు చెల్లుతవి. మేటీకోఉు అనేమాట ఆభాసాంధ్రము యెట్లాగైనదంటే మేటియనగా తెనుగుమాట. కోఉు అనగా తురకమాట. యీ ఱెండు మాటలనున్నూ వ్యవహారమందు కలిపి వాడినారు గనక ఆభాసాంధ్రమైనది. చిత్తగించవలెను॥ యిదే పదివేల విన్నపములు.

ది 25 అక్టోబరు 1824.*

14

మహారాజశ్రీ మేస్తరు బ్రౌన్‌దొరవారికి॥ తమ కోర్టు పండితుడు వఠ్యం అద్వైత బ్రహ్మశాస్త్రులు అనేక సలాములు.

మేటీకోఉు అనేమాట తెలుగుభాషలో దేశ్యమయిన తెలుగుమాట. మేటీ అనే శబ్దంబునకు గొప్ప యధికారి అని అర్థము. మేటీకోఉనే శబ్దంబునకు గ్రామస్థులయ్యి రహియితులు అందరు జరిగించెడి కార్యములలో వకరిని వక అధికారివలె కనిపెట్టుట. యది యట్లుంన్నను వక గ్రామమందు బహుమంది రహితులు దున్నిన దుక్కివల్ల పండించి వేశిన పయిరు కుచ్చళ్లు

* మ.ఓ.మే.లై. లోని బ్రౌన్ డిక్షనరీ నోట్సు సంపుటం డి. 3140 పేజీ 611. ఈ జాబుపైన "on the word Meticor. మేటికోరు is infact మేడి యొక్క పాలు the share given to ploughman. See also next page—" అని బ్రౌన్ వ్రాసున్నాడు.

మొదలయ్యినవి కళ్లంలో నూర్చి వబ్బిడి చేశి కయిలు సేసెడి సమయమందు రహితులలో పరస్పరము వక రహితు కుచ్చులదాపున మరి వక రహితున్ను వీని కుచ్చులదాపున వాడున్ను సస్యమేగాని ధాన్యమేగాని అపహరించకుండా నున్ను కయిలు అయిన ధాన్యము యిన్నియని తెలుసుకునేటందుకున్ను కావలి యుంచున్నారు గనక యిలాగే యెందున గురించి అయినా గ్రామస్థులు పరస్పరము వకరు సేసెడి కార్యముమీద మరి వక రహితు కావలియుండుట మేటీకోఱు. శబ్దార్థము మెట్టు అనే శబ్దముమీద మేటీ శబ్దము గ్రామ్యముగా పుట్టినదికాదు. మెట్టుశబ్దము వేరు మేటీశబ్దము వేరు. మేటీకోఱు శబ్దము గ్రామ్యముకాదు. సుశబ్దము. మెట్టుశబ్దమునకు సోపానము వక అర్థము. యింకా శాన అర్థములు వున్నవి. చిత్తగించవలెను. యివే అనేక సలాములు.

ది 25 అక్టోబరు ఆన 1824 సం॥*

## 15

మహారాజరాజశ్రీ చా. ఫి. బ్రౌన్‌దొరవారి సముఖానకు— ఆశ్రితుడు రావిపాటి గురుమూర్తిశాస్త్రి అనేకములైన సలాములుచేసి వ్రాసుకొన్న విజ్ఞాపన పత్రిక—

తమరు అలవోక— డాబాలు అనే శబ్దములకు అర్థము వ్రాసి పంపించుమని వ్రాయించినారు. అలవోక శబ్దమునకు స్వేచ్ఛ— అనిచ్ఛ— అప్రయత్నము— అశ్రమము— కారణము— అని నానా అర్థములు వున్నవి. ఆయా స్థలములకు తగినట్లుగా చెప్పుకోవలసినది.

డాబాలు అనేది డాబా అనేదానికి బహువచనాంతము. డాబా అనగా వెండితోగానీ బంగారుతోగాని చేసిన మొలత్రాడు యొక్క బిళ్ల. ఉత్తర దేశములో బంగారుతోగాని వెండితోగాని చేసిన మొలత్రాడు నాలుగైదు వరుసలుగా చుట్టి అతికించి బిళ్లలువేసి మొలను ధరించడం కద్దు. అటువంటి త్రాడు డాబా మొలత్రాడు అని చెప్పబడుచున్నది.

* అదే సంపుటం, పేజీ 612. దీనిపైన "Not quite correct all wrong- మేడి a plou - మేటికోఱు the share of the plousman—" అని బ్రౌన్ వ్రాసున్నాడు.

కాలేజీవారు కోరిన 500 రూపాయిల పుస్తకముల వైనం నాకు యెంత మాత్రమున్ను తెలియదు. చిత్తగించవలెను. ఇదిగాక తమరు హంసవింశతి లోని కొన్ని పద్యాలకు శబ్దార్థమున్ను వ్రాసి పంపించుమని వ్రాయించినారు. తోచినమట్టుకు వ్రాసి యిందులో బిడాయించి సముఖానకు పంపించినాను. చిత్తగించవలెను. నేను నడుముకోగలందులకు ఆజ్ఞాపత్రిక దయచేయించ వలెను. ఇదే అనేకములైన విజ్ఞాపనములు—

చెన్నపట్నం 1827 నవంబరు 22 తేది. —రా. గురుమూర్తిశాస్త్రి.*

* * *

'మేటీకోరు' అంటే అర్థమేమిటి అని బ్రౌన్ మొదటగా అడిగిన వ్యక్తి తిప్పాభట్ల వెంకటశివశాస్త్రులుగా కనపడుతున్నాడు. ఎవడీ తిప్పాభట్ల? అక్షరాభ్యాసం చేయించిన వెలగపూడి కోదండరామయ్య తర్వాత, ఒక విధంగా బ్రౌన్‌కు ఆది గురువు అని చెప్పవచ్చు. బ్రౌన్‌కు తెలుగు సాహిత్య స్పృహను కల్గించిన తొలి తెలుగు పండితుల్లో ముఖ్యుడైనవాడే అనుకోవాలి.

తిప్పాభట్ల ఈ జాబు వ్రాసిన దాదాపు నెలరోజులు తర్వాత, వేమన పద్యాలకు బ్రౌన్ 1824 నవంబరు 23 తేదీన ఒక చిత్తు పీఠికలో ఇట్లా వ్రాశాడు:

"...I am indebted to two very learned Bramins who taught me the language, its grammar and prosody. They are Thippabhotla Venkata Siva Sastri of Masulipatnam and Advyta Brahmia, the Pandit belonging to the court in which I have the honour of being assistant judge..."†

---

* ఈ జాబు మ. ఓ. మే. లై. లోని బ్రౌన్ లేఖలు పేర గల సంపుటాల్లోగానీ లేదా తదితరమైన వ్రాతప్రతుల్లోగానీ ఎక్కడ వున్నదో నేను శోధించలేదు. 1951 లో వావిళ్ళవారు పునర్ముద్రించిన రావిపాటి గురుమూర్తిశాస్త్రి "తెనుగు వ్యాకరణము"లో వేదము లక్ష్మీనారాయణశాస్త్రి వ్రాసిన పీఠికలో ముద్రణై వున్నది. డాక్టర్ కొత్తపల్లి వీరభద్రరావు తన "సి. పి. బ్రౌన్" గ్రంథంలో కూడా దీన్నిబట్టే తీసుకొన్నారు.

† Veres of Vemana (in the Telugu original with English rendering), C. P. Brown, Hyderabad, 1967, prefare by Brown, pp. III - IV.

వేమన పద్యాల అధ్యయనంలో బ్రౌన్‌కు తోడ్పడినవారిలో ప్రథముడు ఈ తిప్పాభట్ల పండితుడు. తెలుగు కావ్యభాష మెళకువలు విప్పిచెప్పిన ఈ పండితుడు వాడుకలో వున్న ఒక మామూలు తెలుగు మాటకు అర్థం చెప్పవలసి వస్తే పప్పులో కాలు వేశాడంటే అందులో ఆశ్చర్యమేమీలేదు. మన పండితులు లోక వ్యవహారానికి ఎంతదూరులో తెలుస్తుంది. కృతకగ్రాంథికమే వారి సొమ్ము. సహజ వ్యావహారికం వారికి కొరకరాని కొయ్య.

ఇక వచ్చేం అద్వైత బ్రహ్మయ్య గూర్చి లోగడ కొంత ప్రస్తావనకు వచ్చింది (చూడు: పేజీలు 52-55). ఆయన ఈ శబ్దార్థ నిర్ణయంలో కొంత దరిదాపుకు వచ్చినట్లు కన్పించాడుగానీ పూర్తిగా మాత్రం కాదు.

పండితులు చెప్పారు కదా అని, బ్రౌన్ పూర్తిగా వాటినే గుడ్డిగా స్వీకరించకుండా తన సొంత ప్రతిభను కూడా జోడించి అన్వయం చేసుకొని తెలిసిన వాళ్ళను పట్టుకొని కరెక్టు అర్థాలు రాబట్టే దాకా బ్రౌన్ విశ్రమించేవాడు కాదు. గనుకనే ఒక్క మేటికోరు అనే పదం విషయంలోనే గాకుండా, ఇట్లా ఎన్నింటి విషయంలోనో సరియైన అర్థ వివరణలు చేయగలిగాడు. ఎట్లయితేనేం, బ్రౌన్ కడకు తన డిక్షనరీలో ఈ శబ్దానికి సరియైన అర్థాలే ఇవ్వగలిగాడు:

"మేటి (infl. of మేడి) : మేటిపాలు or మేడికోరు the farmer's share. Some derive this from మేటి a lord, thus మేటికోరు is the same as స్వామి భాగము (not భోగము?). Some spell it as మేడి but others say the two are different. మేడిపాలు is a phrase even used by salt makers.

"మేడి plu. n.s. A plough staff or plough tail. మేడికోలు, మేడి పాలు the farmer's share of the crop. మేడిపాలికి యిచ్చెను: this means that the landlord and the tenant each took half or else that the landlord gets two thirds."

పై మొదటి రెండు జాబుల్నిబట్టి మనకు తెలిసే మరొక చిన్న విషయం ఏమంటే 1824 నుంచీ పదాలు, వాటి అర్థాలకోసం బ్రౌన్‌లో ప్రాకులాట ప్రారంభమై డిక్షనరీ నిర్మాణ తలంపు ఏర్పడిందన్న విషయం రూఢి అవుతున్నది కూడా.

* * *

ఇక 'అలవోక' గురించి జాబు వ్రాసిన రావిపాటి గురుమూర్తిశాస్త్రిని గురించి లోగడ చర్చించుకొన్నాం. ఈయన్ను గురించి బ్రౌన్ ఒక చోట ఏమి వ్రాసిందీ కూడా తెలుసుకొన్నాం (చూడు: పేజీ 21). బ్రౌన్ ఇంతగా శ్లాఘించిన పండితుడు, అప్పటి కున్న ఏకైక ప్రభుత్వ కాలేజీలో అగ్రస్థానంలో వున్న పండితుడు—ఒక పదానికి నాలుగర్థాలు వ్రాసి పంపితే, బ్రౌన్ గాకుండా మరొకడైతే ఆ నాలుగర్థాలను కళ్ళు మూసుకొని అట్లాగే అప్పటంగా తీసుకొని తన డిక్షనరీలో ఎక్కించుకుని వుండేవాడు. అతను ఇచ్చిన అర్థాలు దాదాపు సరియైనవిగానే కనపడ్తున్నా వాటిలో ఏ ఒక్కదాన్నీ బ్రౌన్ స్వీకరించలేదంటే ఏమనుకోవాలి?

ఏదో మహా పండితుడు చెప్పిన అర్థం గదా అని ప్రమత్తుడుగా వుండి పోకుండా, బ్రౌన్ అడుగడుగునా అప్రమత్తతతో సొంత రుజువులు చూచుకుని ఎంత ప్రతిభావంతంగా అర్థ నిర్ణయం చేసేవాడో ఈ జాబే చాటుతున్నది.

బ్రౌన్ తన నిఘంటువులో 'అలవోకకు' రావిపాటి పండితుడు ఇచ్చిన 'స్వేచ్ఛ, అనిచ్ఛ, అప్రయత్నము, అశ్రమము, కారణము' అనే అర్థాల్లో ఏ ఒక్కదాన్నీ గ్రహించకుండా. అరడజను కావ్య ప్రయోగాలు గుప్పిస్తూ తాను సొంతంగా ఇచ్చిన అర్థాలు చూడండి:

"అలవోకగా- Sportively, amusingly, playfully, easily, carelessly, వేడుకగా, విలాసముగా, ఆట్లాటగా, అవలీలగా, అలక్ష్యముగా, అనడ్డగా. ఉపేక్షగా, O. G. Says ప్రొద్దుపోక....

బ్రౌణ్యం బ్రౌన్‌దేగానీ మరొకరిది కాదు గదా. ఇంతకంటే సాక్ష్యాలు మరేమి కావాలి? మరెన్ని కావాలి?

ఆఖరుగా ఒకమాట. బ్రౌన్ డిక్షనరీ నిర్మాణానికి సంబంధించి మ.ఓ.మే.లై. లో ఇన్ని చిత్తు వ్రాతల సంపుటాలు వున్నా, ఆఖరుమాటగా ఏమీ చెప్పేస్థితిలో లేము. ఎందుకనంటే, లండన్‌లోని ఇండియా ఆఫీస్ లైబ్రరీలో మనం చూడవలసిన సంపుటాలు మరెన్నో వున్నాయి. ఇండియాలో తెలుగువాళ్ళ మధ్య ఇంచుమించు 30 ఏళ్ళు ఉద్యోగ జీవితం గడిపి రిటైరై లండన్ వెళ్ళిన తర్వాతకూడా మరో ముప్పై ఏళ్లు బ్రతికాడు బ్రౌన్. ఈ 30 ఏళ్ళు లండన్‌లో ఆయన వూరకే వుండిపోలేదు. ఆఖరు క్షణం వరకు తెలుగు భారతిని సేవిస్తూనే వచ్చాడు. విశ్రాంతి జీవితం గడుపుతూ, తాను సంతరించి పెట్టిన నిఘంటువులనే మళ్ళీ తాను దాదాపు రోజూ తిరగేస్తూ, తోచిన

మార్పులు, చేర్పులు, కొట్టివేతలు, సవరణలు, వివరణాదులు చేరుస్తూ పోయాడు. తన డిక్షనరీ ముద్రిత ప్రతులను 'ఇంటర్లీవ్' చేయించి, మధ్యలో కుట్టిన తెల్లకాగితాల్లో ఈ చేర్పులు చేరుస్తూ పోయాడన్న మాట. ఈ చేర్పులు మార్పులు ఎంత విస్తారంగా చేశాడంటే—ముద్రిత ప్రతులు ఇంచుమించు 1,400 పేజీలు చొప్పునవుంటే, ఈ చేర్పులు దాదాపు ఇంకంత వున్నట్లున్నాయి:

"I daily made additions to the Dictionaries, and the grammar, which are now more than doubled. Most of the quotations I originally had collected were from poems in manuscript, which appeared in print shortly before I returned to England. Those I set down in the last fifteen years may be more valuable; they are certainly more numerous. This part of the work will therefore be acceptable to learned readers. I also made many additions and corrections in the learned Wilson's glossary of Judicial and Revenue Terms."*

బ్రౌన్ ఇంత విస్తృతంగా చేశానని చెప్పిన ఈ మార్పు చేర్పుల్ని ఇంత వరకూ ఏ తెలుగువాడూ చూచి బేరీజు కట్టిన పాపాన పోలేదు. 1895 లో బ్రౌన్ ఇంగ్లిషు–తెలుగు డిక్షనరీకి రివైజ్డ్ ఎడిషన్ను తీసుకొచ్చినప్పుడు పైన పేర్కొన్న బ్రౌన్ స్వీయచరిత్రను యథాతథంగా పీఠికాప్రాయంగా పునర్ముద్రించారు. అందులో బ్రౌన్ స్వయంగా ఈ మార్పు చేర్పులు చేసి వున్న వ్రాత ప్రతులు ఎక్కడున్నాయో వాటి పోబిడి లభించలేదని ప్రత్యేకంగా ఒక ఫుట్‌నోట్‌లో—"The present Editor has unfortunately not been able to get at these Mss—"† అని పేర్కొన్నాడు ఆ ఎడిటర్ ఎమ్. వెంకటరత్నం.

దరిమిలా 1937 లో ఈ వ్రాతప్రతులు పలానాచోట భద్రంగా వున్నాయని ఒక స్పష్టమైన ఆచూకీ దొరికింది. ఆ సంవత్సరం వెలువడిన "European Manuscripts in the India 'Office Library Vol II, part II. Minor Collec-

* చూడు: Literary Life of Charles Philip Brown (printed for private circulation), C. P. Brown, London, 1872, P. 30.

† An English and Telugu Dictionary—, C. P. Brown, Revised and Enlarged by M. Venkata Ratnam (second edition), Madras, 1895. P. XXIV.

tions and Miscellaneous Manuscripts" అనే పేరుతో G. R. Kaye అనే ఆయన వివరణాత్మకమైన ఒక బృహత్ కేటలాగ్‌ను ప్రచురించాడు. అందులో 1049 పేజీనుంచి 1063 పేజీ దాకా ఈ బ్రౌన్ వ్రాతప్రతుల సంపుటాలను పూస గుచ్చినట్లు వివరించి వున్నాడు. ఈ కేటలాగ్‌ను ఆధారం చేసుకొని ప్రొఫెసర్ సి. ఎస్. శ్రీనివాసాచారి (అన్నామలై యూనివర్సిటీ చరిత్ర ఆచార్యుడు) ఒక వ్యాసంలో వీటిల్ని గూర్చి విస్తారంగా వివరించి వున్నాడు.* మరో నాలుగేళ్ళ తర్వాత, ఆయనే మరొక వ్యాసంలో మరో రూపంలో ఈ విషయాలను చర్చించి వున్నాడు.†

ఆం. ప్ర. సా. అకాడమీ ఒక పండిత ప్రకాండుల కమిటీ నేతృత్వంలో ఈ బ్రౌన్ తెలుగు నిఘంటువును మళ్ళీ నూరేళ్ళు గడిచిన తర్వాత 1966 లో పునర్ముద్రించినప్పుడు—ఈ గొడవలేమీ పట్టించుకోకుండానే 1852 లో బ్రౌన్ ఎట్లా ముద్రించాడో అట్లాగే అబందరగా కళ్ళు మూసుకొని అచ్చువేయించింది. ఎట్లాగైతేనేం, తనకు చేతనైన పరిధిలో మరుగుపడిపోయిన బ్రౌన్ పేరును మళ్ళీ వ్యాప్తిలోకి తెచ్చి పుణ్యం కట్టుకొన్నది.

ఏమైతేనేం, బ్రౌన్ వ్రాతప్రతుల ఆచూకీ తెలిసి 45 ఏళ్ళు కావస్తున్నా వాటిని గురించి మన తెలుగువాళ్ళెవరూ ఇంతకాలందాకా పట్టించుకోనేలేదు. మళ్ళీ ఇన్నాళ్ళకు ఇన్నేళ్ళకు లండన్‌లోని ఈ బ్రౌన్ సంపుటాల సంచయాన్ని తెలుగుదేశానికి రప్పించేందుకు ఒక చిన్న ప్రయత్నం జరిగింది.

శ్రీ వెంకటేశ్వరా యూనివర్సిటీలో సి. పి. బ్రౌన్ రీసర్చి ప్రాజెక్టు ఒకటి ఏర్పాటైంది. ఈ లండన్ సంపుటాలకు మైక్రోఫిల్మ్ ప్రతుల్ని తెప్పించేందుకు దాదాపు 9 వేల రూపాయలు చెల్లించడం జరిగింది. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ విద్యాశాఖవారు కూడా ఆసరా ఇచ్చి కొంత డబ్బు గ్రాంటుగా మంజూరుచేసి తోడ్పడ్డారు. మైక్రోఫిల్మ్

* Journal of the Andhra Historical Research Society: Vol. XI. Parts 1&2, Rajahmundry, 1937, "Charles Philip Brown, a Survey of his Services to South Indian History and Telugu Literature," by Prof. Rao Saheb C. S. Srinivasachari, Pp. 89-99.

† Sri V. Venkateswara Sastrulu Commemeration Volume, Madras, 1941, "Promotion of Telugu Studies by the Madras Government in the Company's Days. part II. Some Bibliographical notes on Charles Philip Brown", by Prof. C. S. Srinivasachari.

ప్రతులు ఇండియాకు రావడానికి ఇంకో ఆరు నెలలయినా పడ్తుంది. అవి వచ్చినప్పుడు ఆ సంపుటాల్లో ఇంకా ఏమేమి విశేషా లున్నాయో వాటిని చూచిన తర్వాతనే బ్రౌన్ నిఘంటువులు గూర్చి తుదిమాట చెప్పడానికి వీలవుతుంది. ఆ శుభ ఘడియ త్వరలోనే వస్తుందని ఆశిస్తున్నాను.

* * *

'తండాయి' అనే పదం బ్రౌన్ డిక్షనరీల్లోనూ ఇతర మరే తెలుగు నిఘంటువుల్లోనూ ఎక్కడా కానరాలేదని వ్రాశాను (చూడు: తాతాచార్ల కథలు పేజీలు 162-3). మిగతా బ్రౌన్ డిక్షనరీల్లో ఎక్కడా లేదుకానీ, బ్రౌనే సమకూర్చిన "జిల్లా డిక్షనరీ"లో ఈ పదాన్ని ఇచ్చివున్నాడు.* ఈ జిల్లా డిక్షనరీ గురించి చెప్పుకో వల్సింది చాలా వుంది. ప్రభుత్వ రికార్డుల్లో (తమిళనాడు ఆర్కైవ్స్‌లో) దీన్ని గురించిన గొడవలు చాలా వున్నాయి. బోర్డ్ ఆఫ్ రెవిన్యూవారు దీన్ని చెడ తిడుతూ ఒక రిపోర్టు సమర్పించారు. దానిమీదట బ్రౌన్ క్షమాపణ కోరుకుంటూ ప్రభుత్వానికి విన్నవించుకోవలసి వచ్చింది. వీటినంతా ఇక్కడ చర్చించడం అధికప్రసంగమే అవుతుంది గనుక ప్రస్తుతానికి ఇంతటితో ఫుల్‌స్టాప్ పెడ్తున్నాను.

* * *

ఇక రావిపాటి గురుమూర్తి శాస్త్రి జాబులో ప్రస్తావనకొచ్చిన మరొక విషయం. "కాలేజివారు కోరిన 500 రూపాయిల పుస్తకముల వైనం నాకు యెంత మాత్రమున్ను తెలియదు" అన్నాడు గురుమూర్తిశాస్త్రి. కాలేజి తెలుగుహెడ్‌గా వుంటున్న గురుమూర్తి శాస్త్రికే కాలేజి వారు కోరిన పుస్తకములవైనం తెలియకపోతే ఇక మనకు ఎట్లా తెలుస్తుందని అనుకోనక్కర్లేదు. అదృష్టవశాత్తు ఇందుకు సంబంధించిన కొన్ని వుత్తర ప్రత్యుత్తరాలు తమిళనాడు ఆర్కైవ్స్‌లోను, బ్రౌన్ సొంత జాబుల సంపుటాల్లోనూ భద్రంగా వున్నాయి. వీటినిబట్టి ఆ "కాలేజివారు కోరిన 500 రూపాయిల పుస్తకముల వైనం" ఏమిటో మనం స్పష్టంగానే చెప్పవచ్చు. దీన్ని గురించి సంక్షిప్తంగానైనా తెలుసుకొందాం.

ఇంగ్లీషు ప్రభుత్వోద్యోగులకు (జూనియర్ సివిల్ సర్వెంట్సుకు) దక్షిణాది ప్రాంతీయ భాషలను నేర్పి, వారికి ఆ ఆ భాషల్లో కొంతప్రవేశమూ పరిచయమూ

*చూడు: The Zilla Dictionary in the Roman Character Explaining the Various Words Used in Business in India, C. P. Brown, Madras, 1852.

కలుగచేసి పరిపాలన వ్యవహారాలు పకడ్బందీగా జరిగేందుకు తోడ్పడాలనే ఉద్దేశంతో మద్రాసు ప్రభుత్వం అంత ఖర్చుపెట్టి ఫోర్ట్ సెంట్ జార్జి కాలేజిని 1812 లో ఏర్పాటు చేసి నిర్వహిస్తున్నప్పుడు, కేవలం ఆ పరిమితమైన ఆశయంతోనే గాకుండా మరింత విస్తృతమైన లక్ష్యాలతో ఈ కాలేజి వర్ధిల్లాలని బ్రౌన్ ఆశించినట్లున్నాడు. దక్షిణ భాషా సాహిత్యాల పునరుద్ధరణకూ పునరుజ్జీవానికి కూడా ఈ కాలేజి ఇతోధికంగా తోడ్పడాలని, ఆ మార్గంలో కాలేజి తగువిధంగా కృషిచేస్తే బాగుంటుందని బ్రౌన్ అభిప్రాయ పడినట్లున్నాడు.

కాలేజీకి అనుబంధంగా తెలుగుకి సంబంధించినంతవరకైనా ఒక లైబ్రరీ ఏర్పడి భాషాసాహిత్యాల అధ్యయనానికి రెఫరెన్సుకు ఉపయోగపడేలాగున అందులో గ్రంథసంచయాన్ని సమకూర్చిపెట్టాలని ఆశించాడు. కాలేజిలో తెలుగు శాఖను అభివృద్ధి పరచి ఒక లైబ్రరీని నెమ్మదిగానైనా ఏర్పరిచి విస్తృతపరచేందుకు తగు సూచనలిస్తూ 1827లో కాలేజి బోర్డుకు ఒక జాబు వ్రాశాడు. లైబ్రరీవారు సేకరించాలనుకుంటే తన సొంత గ్రంథాలయంలోని పుస్తకప్రతులను, వ్రాతప్రతులను ఖరీదుకు తీసుకోవచ్చునని ఆ జాబులో సూచించాడు.* ప్రభుత్వంతో ఉత్తరప్రత్యుత్తరాలు జరపడమేగాక వ్యక్తిగత స్థాయిలో కూడా ఇందుకు సంబంధించిన ఆలోచనలకు పదునుపెడ్తూ ప్రముఖులతో సంప్రదిస్తూవచ్చాడు.

"Plans for the revival and promotion of Telugu Literature (1825-1858-1867)" అనే శీర్షిక క్రింద ఈ ఆలోచనలన్నిటికీ అక్షరరూప మిచ్చు కొంటూ వచ్చాడు. 1827 మార్చి 1 తేదిన ఇట్లా తన నోట్సులో వ్రాసుకొని వున్నాడు: "Many observations having from time to time occurred regarding improvements that may be made in Telugu printing, on the collection of manuscripts and other subjects connected with the literature of the language, I propose to place them all in the present volume"—అని తనకు వచ్చిన ఆలోచనల్ని ఎప్పటికప్పుడు వ్రాసిపెడ్తూ వచ్చాడు. తెలుగు లైబ్రరీ ఏర్పాటుకు ప్రతిపాదనలు—అని వర్సగా కొన్ని పేజీల బారున తన ఆ నోట్సులో వ్రాశాడు. దీని విషయమై ఏ. డి. కేంబెల్‌కు వ్రాసినట్లు

* చూడు: తమిళనాడు ఆర్కైవ్స్‌లోని 1827 మే 15 తేదినాటి పబ్లిక్ కన్సల్టేషన్ల నెంబర్లు 13 & 14. ఆగస్టు 7 తేదినాటి కన్సల్టేషన్ల నెంబర్లు 18 & 19.

న్నాడు. ఆయన 1827 ఏప్రిల్ 14 తేదీన తనకు వ్రాసిన జవాబును ఈ పేజీల్లో కాపీ వ్రాసిపెట్టాడు బ్రౌన్.*

ఈ తెలుగు లైబ్రరీ ఏర్పాటు విషయమై తాను కాలేజి బోర్డుకు పంపిన ప్రతిపాదనను వారు సుముఖంగా స్వీకరించినట్లులేదు. అదంతా చాలా ఖర్చుతో కూడిన వ్యవహారమని త్రోసివేస్తూ, ఏదో కన్నీళ్ళతుడుపుగా బ్రౌన్ సమర్పించిన పుస్తకాల లిస్టులోనుంచి కొన్ని మాత్రం ఏరి 500 రూపాయలకు సరిపడే పుస్తకాలుమటుకు కొనమని సిఫారసుచేస్తూ. కాలేజి బోర్డు కార్యదర్శి హార్క్‌నెస్ ప్రభుత్వ చీఫ్ సెక్రెటరీకి 1827 జూలై 23న వ్రాసిన జాబులో ఈ క్రింది విధంగా తెలియజేశాడు :†

"I have the honor, by desire of the Board for the College of Fort St. George and for public instruction, to acknowledge the receipt of..............................their sentiments on Mr. Brown's proposals for providing the College Library with copies of certain works of celebrity in Telugu literature......

"I am directed to say that the Board do not consider such an establishment as the one prepared by Mr. Brown, to be in any respect necessary, and that they think it is one which might be attended with considerable expense. Of the books mentioned in Mr. Brown's catalogue, many are useful, standard works, of the greatest celebrity, and which would be a valuable addition to the College Library. The specimens of these works forwarded by Mr. Brown, and his known abilities as a Telugu Scholar, leave no doubt as to the intrinsic value of his Editions of them, and under these circumstances the Board beg to recommend to the Honorable the Governor in Council, the purchase of them for the use of the College.

"A list of the particular works here alluded to, with an estimate of the sum they will cost, accompanies this letter.........

* పైన పేర్కొన్న లండన్ ఇండియా ఆఫీస్ లైబ్రరీలోని బ్రౌన్ సంపుటాలకు 'కే' తయారుచేసిన కేటలాగ్, పేజీ 1053.

† మద్రాసు, తమిళనాడు ఆర్కైవ్స్‌లోని 1827 ఆగస్టు 4 నాటి పబ్లిక్ కన్సల్టేషన్.

"LIST OF TELUGU WORKS SELECTED
FROM MR. BROWN'S COLLECTION

IN GRAMMAR AND PROSODY:

| | | | Rs. | As. | Ps. |
|---|---|---|---|---|---|
| 1. | THE ANDHRA COVMADI, (a grammar of Telugu) | ... | 35 | — | — |
| 2. | THE CAVI SIRCHURHANAM, (a system of Prosody) | ... | 21 | — | — |
| 3. | THE LACSHANA DIPICA, (a system of Prosody) | ... | 21 | — | — |
| 4. | THE APPA CAVIYAM, (a system of Prosody) | ... | 63 | — | — |
| 5. | THE SULACSHANA SARAM (a system of Prosody) | ... | 42 | — | — |
| | **ON ETYMOLOGY AND RHETORIC:** | | | | |
| 6. | THE SIVANDHRAM | ... | 28 | — | — |
| 7. | THE VISHNU ANDHRAM OR VENCATES ANDHRAM | ... | 21 | — | — |
| 8. | THE ANDHRA BASHARNAVAM | ... | 42 | — | — |
| 9. | THE ANDHRA BHASHA BHUSHANAM | ... | 42 | — | — |
| 10. | CAVYALANCARA CHUDAMANI | ... | 35 | — | — |
| | **STANDARD POEMS:** | | | | |
| 11. | PRABANDHA RAJIYAM | ... | 28 | — | — |
| 12. | PANCHA TANTRI | ... | 28 | — | — |
| 13. | RASICA JANAMANOBHIRAMA | ... | 21 | — | — |
| 14. | RADHA MADHAVA SAMVADANA | ... | 24 | — | — |
| 15. | VAIJAYANTI VILASAM | ... | 28 | — | — |
| 16. | HAMSA VIMSHATI | ... | 21 | — | — |
| | Total Rupees | ... | 500 | — | — |

College,
23rd July 1827.

—H. HARKNESS
(Secretary)"

ఇదన్న మాట సంగతి. 'కాలేజివారు కోరిన 500 రూపాయల పుస్తకాల వైనం' ఏమైందో అడిగి కనుక్కుందామని గురుమూర్తిశాస్త్రిని బ్రౌన్ వాకబుచేసిన ఆ వాక్యం వెనుక ఇంత కథ వుంది. చరిత్ర తీగ లాగాలేకానీ ఎన్నెన్నో సామాజిక సంఘటనల డొంకంతా కదుల్తుంది. ఇంతకూ 500 రూపాయలిచ్చి కాలేజీవారు బ్రౌన్ దగ్గర ఈ పుస్తక వ్రాతప్రతులు తీసుకొని కాలేజి లైబ్రరీలో పెట్టారో లేదోగానీ, కడపనుంచి అయోధ్యాపురం కృష్ణారెడ్డి 1827 డిసెంబర్లో వ్రాసిన జాబునుబట్టి చూస్తే, బ్రౌన్ మాత్రం కాలేజివారికి ఈ పుస్తకాల్ను సప్లయిచేయడానికి తీసుకోవల్సిన చర్య లన్నీ తీసుకొన్నట్లే వున్నాడు.

ఎవరీ కడప అయోధ్యాపురం కృష్ణారెడ్డి అనే ప్రశ్న వేసుకొంటే చెప్పుకో వలసిన కథా కమామీషు చాలా వుంటుంది. ఇవన్నీ చెప్పుకుపోవాలంటే అంతం వుండేటట్లులేదు గనుక ప్రస్తుతానికి ముక్తసరిగా ముగిద్దాం. ఈ కృష్ణారెడ్డి బ్రౌన్‌కు నమ్మకమైన ఒక చెలికాడు. బ్రౌన్ ఉద్యోగరీత్యా ఎక్కడ తిరుగుతున్నా, కడపలో తాను మొదట్లో కొనుక్కొన్న ఒక పెద్ద బంగళాను అట్టే పెట్టుకుని అందులో తన లైబ్రరీని వుంచిపెట్టాడు. పండితుల్ని నియమించి, ఈ బంగళా ఆవరణంలోనే వారిని వుంచి వారిచేత తెలుగు కావ్యాలకు శుద్ధప్రతులు, వ్యాఖ్యలు అక్కడే వ్రాయిస్తూ వచ్చాడు. ఈ కృష్ణారెడ్డి కడప కోర్టు నాజరుగ్గా వుంటూ ఈ బ్రౌన్ బంగళా అజమాయిషీ, అద్దెలు, రిపేర్లు, పండితుల జీతబత్తేలు వగైరా లెక్కపక్కలన్నీ నమ్మకంగా చేసిపెట్టి ఎప్పటికప్పుడు బ్రౌన్‌కి అందజేసేవాడు. బ్రౌన్ తెలుగు రీడర్లో ఈ కృష్ణారెడ్డి వ్రాసిన జాబులు కొన్ని అచ్చయివున్నాయి. ఇవిగాక అతని కడప జాబులు ఇంకా ఎన్నో అముద్రితంగా వున్నాయి. వీటి సంఖ్య దాదాపు నూరుదాకా వుండొచ్చునని అంచనా. ఈ జాబులన్నిట్లోనూ ఆంధ్రదేశపు చరిత్ర ఎంతో ఇరుక్కొని వుంది. బ్రౌన్ ఎన్నెన్నో వైనాలు కడపనుంచి ఈ కృష్ణారెడ్డిని అడిగి తెలుసుకొంటుండే వాడు. కడప చరిత్రకు ఒక రన్నింగ్ కామెంటరీలాగా ఈ కృష్ణారెడ్డి బ్రౌన్‌కు వ్రాసే జాబుల్లో ఎన్నో విషయాలు పూసగుచ్చినట్లు వివరంగా వ్రాసేవాడు. ఉదాహరణకు ఒక జాబులో — ఆంధ్రదేశాన్ని ఛిన్నాభిన్నం చేసి కలచివేసిన ధాతకరువుకంటే ముందు నాటి 1833 'గుంటూరు కరువు'లో కడప గడ్డుపరిస్థితుల్ని కళ్ళకు కట్టినట్లు బ్రౌన్‌కు తెలియజేశాడు. కడపలో ఈ బంగళా 1840, 44 దాకా బ్రౌన్ పేరనే వున్నట్లు కొన్ని దాఖలాలు కనపడ్తున్నాయి—ఆ తర్వాత ఎవరికి అమ్మివేశాడో ఏమో నేడు పరమ శిథిలావస్థలో వున్నది. మధ్యలో కొంతకాలం కృష్ణారెడ్డి కదిరి మున్సఫ్‌గా బదిలీ

అయినప్పుడు ధర్మవరపు సుబ్బన్న అనే ఆయన చేత ఈ అజమాయిషీ లెక్క పక్కలు చేయించే ఏర్పాటు చేశాడు.

ఇప్పుడు మన చర్చకు వచ్చిన 'కాలేజీవారు కోరిన 500 రూపాయల పుస్తకాల వైనం' గురించిన వివరాలు ఈ కృష్ణారెడ్డి వ్రాసిన ఒక సుదీర్ఘమైన జాబులో పొందు పరచబడి వున్నాయి. ఆ జాబులోనుంచి అందుకు సంబంధించిన కొన్ని భాగాలు ఈ దిగువ ఇస్తున్నాను :

"హుజరత్తు మేస్తరు చారలిస్ ఫిలెప్ బ్రౌన్ ధొరవారి సముఖానకు — నిజ పోష్యవర్గుడయిన క్రిష్ణారెడ్డి పదివేల సలాములు చేసి అత్యంత వినయపూర్వకముగా వ్రాసుకుంన అర్జీ ఖింనపం యేమంటె నాయందు సంపూర్ణమయిన దయచాతను 15 నవంబరు వ్రాయించిన అజ్ఞ పత్రికెన్నూ చ॥ 16 నవంబరు వ్రాయించిన ఆజ్ఞ పత్రికెన్ను ముట్టి చాలా సంతోషం అయినది—

"కాలేజా బోరడువారు కోరిన గ్రంధాలపయికి ఆంధ్రకౌముది। కవి సిరో భూషణం। సులక్షణసారం। విష్ణు ఆంధ్రం। ఆంధ్రభాషార్ణవం। ఆంధ్రభాషా భూషణం। కావ్యాలంకార చూడామణి। ప్రబంధరాజ్యీయం యీ గ్రంధాలుంను విష్ణు పురాణ ప్రతులుంను అగత్యం కావలసినదనింని। యీ గ్రంధాలపయికి ఖంమంలో వుండే పుస్తకాలు జాగ్రత్తగా తెప్పించుకుని త్వరగా అంపించేది అని వ్రాయించినారు.

"కంభములో తమరు వుంనప్పుడు కాలేజ్రావార్కి అప్పగించవలసిన పుస్తకాలు యిక్కడ సిద్ధం చేయిస్తూ వుంనంతలో, కాలేజాకు ఇవ్వవలసిన గ్రంధాలు అక్కడ యేమి సిద్ధమయినవో అంపించేది అనింని కాలేజావారికి అప్పగించ వలసిన పుస్తకాలు అంని యిక్కడ నుంచి అంపింస్తామనింని కంభాన్నుంచి నా పేరట హుకుం వ్రాసి నందున అజ్ఞప్రకారం అదివరకు సిద్ధంగావున్న కావ్యాలంకారచూడామణి। ఆంధ్ర కౌముది। సులక్షణసారం। రసికెజనమనోభిరామం। లక్షణదీపికె। సివాంధ్రము। ప్రబంధ రాజియ్యం। యీ గ్రంధాలుంను బందరులో చీనాకాగితాలపైన వ్రాయించియుంన ఆంధ్ర భాషార్ణవం వగైరా వుండబడిన యర్రబొక్కుంను యివి యావత్తు జులై నెల తేదిన కంభానికి అంపించి వుంనాను. కవి సిరోభూషణం వగైరా గ్రంధాలు వుండె పెద్ద బొక్కు 1827 సం॥రం అక్టోబరు నెలలో కంభాన్కి అంపించి వుంనాను.

"యీ హేతువవల్ల కాలేజావారి నిమిత్తం తమరు అప్పగించేటందుకు పంపించ మని వ్రాసిన గ్రంథాలు యావత్తుంను కంభములోనే వుంనందున తమ హుకుం చేరిన

యందు సదరు గ్రంథాలు త్వరగా అంపించేది అని కోదండ్రామయ్య పేరిట వుత్తరం వ్రాసి అంపించి వుంనాను....యిదిగాక కవి సిరోభూషణం బాలసరస్వతియ్యం రెండు గ్రంథాలు వుండబడిన పెద్ద/బొక్కు కంభములోనె వుంనావి. సదరు గ్రంథాలు వకపె బొక్కులో వుంనను చాతనుంన్ను అవి మినహా మరి వేరే వ్క గ్రంథము లేనందు చాతనుంను బొక్కులోనుంచి వేరే వక నూతన గ్రంథము వ్రాయించి కాలేజావారికి యివ్వవలసివుంటూ వుంనవి అని లోగడ తమరు శలవు యిచ్చి వుంటిరి....అదిగాక వకవక బొక్కులో కాలేజావారికి అప్పగించవలసిన గ్రంథాలుగాక యింకా కొంని గ్రంథాలతో కూడా మిశ్రమంగా వుంనావి. ప్రకృతం నూతనంగా వాటికి వేరె ప్రతులు వ్రాయించె యోచన చేస్తే నెల దినములకు పైన సావుకాశం సంభవింస్తూ వుంనావి గనక యే ప్రకారం శలవు అయితే ఆ ప్రకారం శిరసావహించి నడుచుకుంటూ వుంనాను....అంతకు పూర్వం కాలేజావారికి యివ్వవలసిన గ్రంథాలకు నాల్గుఅయిదు తూర్లు తమకు అర్జీలు సహా వ్రాసుకొని వుత్తరవు తెప్పించుకొనీ 10/11 గ్రంథాలు యిక్కడ సిద్ధం చేయించి యుంటిని. కంభములో వుండేవారు కాలేజావారికి కావలసిన గ్రంథాలపయికి రాధామాధవిసంవ్వాదం వకగ్రంథం వినహా మరియేమి వ్రాయించి యుంనట్టు అగుపడలేదు—చిత్తానకు రావలెను...."*

ఈ కృష్ణారెడ్డి జాబునుబట్టి—కాలేజీవారికి తాను సప్లయి చేయవలసిన పుస్తకాల విషయమై బ్రౌన్ ఏమేమి ఏర్పాట్లు చేసిందీ కొంతకు కొంతైనా అర్థం చేసుకోవచ్చు.

ఇట్లా తెలుగు లైబ్రరీ ఏర్పాటు మొదలు, తెలుగు ముద్రణ, బోధన గ్రంథాల తయారీ, కావ్యాల పరిష్కరణం, డిక్షనరీల నిర్మాణం వరకు ఎన్నో రంగాలకు సంబంధించి ఎంతో బహుముఖమైన పునాది ప్రాయమైన కృషి చేసిన కారణ జన్ముడు బ్రౌన్ గురించి మనం ఇంకా గాఢంగా పరిశీలించవలసింది ఎంత వున్నదో నన్నే స్పృహను ఈ లేఖల గ్రంథం రవ్వంతైనా కల్గిస్తే అదే పదివేలని భావిస్తాను.

*మ. ఓ. మే. లై. బ్రౌన్ జాబుల సంపుటం ఎమ్. 411, పేజీలు 49-53.

# UNIVERSITY COLLEGE, LONDON.

## COURSE OF TELUGU.

Professor C. P. BROWN.

### JUNIOR CLASS.

Brown's Dialogues; the Reader, Chapter 1; the Grammar (Books II., III., & IV.).

### SENIOR CLASS.

Reader, Chapters 2, 3, 4; Grammar, Books V. & VI.; Verses of Vemana, Book II.; Wars of the Rajas.

### HIGHEST CLASS.

Reader, the last Chapter; Harischandra and Vakyavali; Vemana, Books I. & III.

*For Prizes*: Bhaganat, Book X., pp. 1–36: Swa. Manu Charitra.

The number and times of Lectures, and the Fees will be fixed when the Classes are formed.

AUGUSTUS DE MORGAN,
*Dean of the Faculty of Arts and Laws.*

CHAS. C. ATKINSON,
*Secretary to the Council.*

లండన్ యూనివర్సిటీలో బ్రౌన్ తెలుగు ప్రొఫెసర్ అయినప్పుడు అక్కడి విద్యార్థులకు రూపొందించిన 'తెలుగు కోర్సు' పత్రం తాలూకు ఛాయాచిత్రం. (చూడు: పేజి 11.)

## అనుబంధం - 1

# బ్రౌన్ రాసినవే మరి రెండు లేఖలు

[ఈ గ్రంథంలో బ్రౌన్ స్వయంగా వ్రాసిన, వ్రాయించిన లేఖలు వీలైనన్ని ఎక్కువగా చేర్చాలనే ఉద్దేశంతో ఈ కింది రెండు జాబులను వ్యాఖ్యాన రహితంగా ఈ అనుబంధంలో ఇవ్వడం జరిగింది. —సం.]

16

ధర్మవరం సుబ్బన్నకు—

మహారాజశ్రీ శి၊ పి၊ బ్రౌన్‌దొరవారు వ్రాయించిన అజ్ఞ యేమంటే— నీవు మా పేర వ్రాశి పంపించిన వుత్తరం చదువ్వుకోంగా చాలా సంతోష మయినది. వుత్తరం పట్టుకుని వచ్చిన మనిష్యికి భత్యాఖర్చుకింద వక రూపాయి యిప్పించి వున్నాము. మాకు కొన్ని గ్రంధములు కావలశివుండగా జాగ్రత్త చేస్తానని వ్రాసినావు గనుక సంతోషించినాము. అట్లా చేసిన పక్షమందు అయ్యే ఖర్చు ముజరా యిప్పిస్తున్నాము.

మరిన్ని భానుమద్విజయం అనే తెలుగు గ్రంథం కడపలో యిప్పుడు దొరికితే దానికి ప్రతి పుట్టించుకుని పదిరూపాయీలు యినాం యిప్పిస్తున్నాము. మాతృక మా దగ్గెరకు పంపించడానకు అభ్యంతరమయ్యే పక్షమందు అక్కడనే ప్రతి పుట్టిస్తున్నాము. ముఖ్యంగా యిది శైవకావ్యము. అయిదు ఆశ్వాసములు గలది. వెలగపూడి కృష్ణయ్యకవి చెప్పినది. యిది తెలుగు

కావ్యము గనుక వకవేళ కడపలో దొరకవచ్చును. పయిగా పయిడిమర్రి వెంకటపతి చెప్పిన చంద్రాంగదచరిత్ర అయిదు అశ్వాసములు గలది ముఖ్యం కావలశియున్నది. యిదిగాక జంగమ పుస్తుకాలలో కొన్ని కావలశియున్నవి. అవి కన్నడభాష గనుక కన్నడవాండ్లవద్ద విచారించవలెను. యేవంటే— ప్రభులింగలీల । బసవపురాణం । బసవకాలజ్ఞానం । వీటిలో ముఖ్యంగా లీల కావలసినది గనుక దానికి రెండు మూడు ప్రతులు దొరికే పక్షమందు చాపా చేయించేటందుకు మాకు భావం కలిగివున్నది. యీ పనికిగాను అక్కడ యేదయినా వక పుస్తుకం వ్రాయించవలసివచ్చే పక్షమందు సాధారణంగా వచనం రీతిగా వ్రాయవలశినది. పద్యములు నాలుగేశి చరణములుగా యేర్పర్చి వ్రాయవలశిన జరూరులేదు.

వ్రాత అయిన తరువాత మొకాబిలా చేయించవలశినది. యీ మనిషి నీ తావుకు పొయ్యేటప్పుడు వీని పరంగా నీ తావుకు కొన్ని పుస్తకములు దానంగా పంపిస్తున్నాము. సదరహి వ్రాశిన గ్రంథములేకాకుండా యీ దిగువను వ్రాశిన గ్రంథములు కూడా మాకు కావలశివున్నవి గనుక వీటిని గురించి కూడా తలాషుచేశి పంపించవలెను.

1 సూర్యతనయా పరిణయం
1 చారు చంద్రోదయం
1 పండితారాధ్య చరిత్ర
1 రత్నావళి పరిణయం

4

యీ పుస్తుకములు కూడా జాగ్రత్తచేశి పంపించవలెను.

యిటని మా వ్రాలు

ది 12 డిశంబరు ఆన 1840 సం॥ (Signed) C. P. Brown.*

* మ.ఓ.మే.లై. లోని బ్రౌన్ జాబుల సంపుటం ఎమ్. 411, పేజీలు 54-5.

## 17

[మహారాజశ్రీ గుండవరపు కృష్ణయ్యగారికి—]

సలాములు. త॥

ఆ జిల్లాలో కుంపిణీపనిలో మీరు అభివృద్ధిని పొందిన॥ విని సంతోషించి నాము. యింతటనుంచి మీ సుఖసమాచారములు మాకు యరకచేస్తూ రావలెనూ॥ మరిన్ని వ్రాయవలశ్నిది యే॥ కవి గౌరనమంత్రి చెప్పినటువంటి నవనాథచరిత్ర అనే ఆంధ్ర ద్విపదకావ్యము అయిదు అశ్వాసములు కల ప్రబంధము **140 - 160** ఆకులుగల ప్రబంధం మాకు ప్రస్తుతం జరూరుగా కావలశ్నిది. యీ ప్రబంధం చేబ్రోలులో శంభుదేవరగారి మఠంలో కలిగినట్టు విన్నాము గన్క యీ జాబు మీ పేరట వ్రాయడం అయ్నిది.

మీరు ఆ మనిషిని బహుశా గుర్తెరిగి వుండగా ఆ గ్రంథం మాకు అందేలాగున చెయ్యవలశ్నిది. ఆ మాతృక యిక్కడికి అంపించడాన్క ధైర్యం లేకుంటే అందుకు ప్రతిక పుట్టించవలశ్నిది. ఆ ప్రతిక వచనరీతిగా త్వరగా కరడా కాగితాలమీద వ్రాయించవలశ్నిది. మేము యిక్కడ వేరే ప్రతిక పుట్టించబోతున్నాము గనుక మీరు విడివిడి కాగితాలమీద వ్రాశినా చింతలేదు. కాని కాగితాల లెఖ్క క్రమముగా వ్రాయవలశ్నిది. అక్షరాలు బాగా వుండవలెనన్నమాట అక్కరలేదు. తప్పులు మాత్రం లేకుండా దిద్ది వ్రాయించవలశ్నిది. అయితే మాత్రుక గ్రంథం యిక్కడికి అంపించే పక్ష మందు నెలరోజులకు లోపల ప్రతిక వ్రాయించి తిరిగి నిరాయాసంగా మీ దగ్గిరకు చేరేటట్టు చేస్తున్నాను. మరిన్ని యిది శైవగ్రంథం గనుక అక్కడ వుండే ఆరాధ్యులలో విచారించవలశ్నిది.

యీ జాబు పంపిన వెంటనే నలచక్రవర్తి చరిత్ర ద్విపద గ్రంథం మీ తావుకు అంపించడం అయినది. యింకా కొన్నాళ్లకు హరిశ్చంద్ర చరిత్ర ద్విపద ప్రభులింగలీల ద్విపద మొదలయినవి కొన్ని ప్రబంధములు అచ్చు వేయించడంకు వుద్యుక్తులైనాము. పైగా చెప్పిన నవనాథచరిత్ర యీ సారంగధరచరిత్ర సహితం కలిగినది గనుక కొందరు భ్రమపడి నవనాథ చరిత్ర అని పేరు యెరగకుండా సారంగధర అనే పేరు అన్యాయంగా

పెట్టుతారు గనుక్క యిప్పుడుదొరికే గ్రంథం సారంగధరచరిత్ర అన్న పక్షమందు కవినామం చూడవలశ్నిది. గౌరన అనే ఆహ్వాయం వుంటె నాకు కావలశ్నిటు వంటి గ్రంథం యిదేను. అని గ్రహించవలశ్నిది. దీని పోబిడి తెలిశిన వెంటనే ఆ వయినం మాకు తెలియజేశి గ్రంథం తరువాత బంగీ తపాలమీద వచ్చేటట్టు జాగ్రత్త చెయ్యావలశ్నిది.

యిదే సలాములు.

[—C. P. Brown].*

* మ.ఓ.మే.లై. లోని బ్రౌన్ జాబుల సంపుటం ఎమ్. 411, పేజీ 86. ఈ జాబు వ్రాసిన తేదీ వివరం లేదు. గుండవరపు కృష్ణయ్య '1841 సం॥ ది 22 అక్టోబరు'న వ్రాసిన జవాబు దీనిప్రక్కనే వుంది కాబట్టి, బ్రౌన్ ఈ లేఖను 1841లో ఏ అక్టోబరు సెప్టెంబరు నెలల్లో వ్రాసి వుంటాడని వూహించుకోవచ్చు.

## అనుబంధం-2

# టూకీగా బ్రౌన్ జీవిత కథ

**1798** నవంబర్ **10**

కలకత్తాలో సి. పి. బ్రౌన్ జననం. తండ్రి రెవరెండ్ డేవిడ్ బ్రౌన్. తల్లి శ్రీమతి కౌలీ (బెంగాల్ ఆర్మీలోని కెప్టెన్ కౌలీ కుమార్తె). మొదటి భార్య మరణానంతరం డేవిడ్ బ్రౌన్ కౌలీని పెండ్లిచేసుకొన్నాడు. ఆయన కలకత్తా ఫోర్ట్ విలియమ్ కాలేజీలో ప్రొవోస్ట్, బెంగాల్‌లో ఈస్టిండియా కంపెనీవారికి సీనియర్ చాప్లెన్‌గా వుండేవాడు. బాల బ్రౌన్ తండ్రి శిక్షణలో వివిధ భాషలు నేర్చుకోవడం ప్రారంభించాడు. ఇంగ్లీషుతో బాటు హిబ్రూ, సిరియన్, అరబ్బీ, పారసీకం, హిందూస్తానీ, గ్రీక్, ల్యాటిన్ భాషల్లో ఒకపాటి ప్రాథమిక పరిచయం సంపాదించాడు. డేవిడ్ బ్రౌన్ ఇంటిని ఆ రోజుల్లో 'హిబ్రూ స్కూల్' అని పిల్చేవారు—ఒక ముప్పైఏళ్ళ తర్వాత మన బ్రౌన్ ఇంటిని 'బ్రౌన్స్ కాలేజ్' అని పిలవబోతున్నట్లు. అరేబియానుంచి వచ్చిన 'షాలమ్' అనే హిబ్రూ మహాపండితుడు బాల బ్రౌన్‌కు హిబ్రూ చెప్పేవాడు. హిందూ స్తానీలో 'బగోబహార్' చదివి ఆనందించాడు. బాలబ్రౌన్ హిందూస్తానీ ఉచ్చారణ చూచి క్లాడియస్ బుకనన్ దంగైపోయాడంటే హిందూస్తానీ బాగా పట్టుబడినట్లే అనుకోవాలి. ఉత్తరోత్తరా ఈ హిందూస్తానీ ద్వారానే ప్రారంభంలో తెలుగుకావ్యాలకు అర్థతాత్పర్యాలు చెప్పించుకోబోతున్నాడు బ్రౌన్.

**1810—11**

బాల బ్రౌన్ మిల్టన్ 'ప్యారడైజ్ లాస్ట్' చదవడం ప్రారంభించాడు. ఊరకే చదవడం కాదు. అర్థం చేసుకుంటూ మరీ చదివేవాడు. డ్రైడన్, కూపర్‌లతో కుస్తీపట్టేవాడు.

మిల్టన్ అంటే చెవికోసుకొనేవాడు. డ్రైడన్ 'డల్'గా వున్నాడనేవాడు. కూపర్ పర్వాలేదు, ఒకమోస్తరు అనేవాడు. కొత్తగా వెలువడిన వాల్టర్ స్కాట్ రచనలు'లే', 'మార్మియన్' చదివి ఆనందించేవాడు. తనకొడుకుల్ని మిషనరీలుగానో, క్రైస్తవ మత గురువులుగానో చేయాలని, ముఖ్యంగా భాషలు బాగా నేర్చుకుని, బైబిల్‌ను, క్రీస్తు మతసారాన్ని భారతీయ భాషల్లోకి అనువదించే స్థాయికి తీసుకురావాలని తండ్రి డేవిడ్ బ్రౌన్ ప్రగాఢ సంకల్పం. ఇందువల్లనే కావచ్చు షేక్స్పియర్ను మాత్రం పిల్లలకు దూరంగా వుంచాడట తండ్రి.

## 1812—13

1812 జూన్ 14 న తండ్రి మరణం. కుటుంబ సభ్యులతో బాటు లండన్‌కు తరలి వెళ్ళాడు బాలబ్రౌన్. ఆర్నెల్లపాటు లండన్‌లోని ఒకస్కూల్లో చదువుకొనసాగించాడు. బెంగాల్‌లో రెవరెండ్ బ్రౌన్ చేసిన ఘనమైన సేవలకు ప్రతిఫలంగా ఆయన కొడుకు లకు ఇండియాలో ఉద్యోగాలిచ్చి ఆదుకోవాలని కుంఫిణీ ప్రభుత్వం భావించింది. మరణించిన తండ్రి సంకల్పానికి భిన్నంగా కొడుకులు ఈస్టిండియా కంపెనీ ఉద్యోగాలు చేపట్టవలసి వచ్చింది.

## 1814—15

ఇండియాలో ఈస్టిండియా కంపెనీ ఉద్యోగానికి మొదటి మెట్టుగా బ్రౌన్‌ను లండన్ (హెర్ట్ఫర్డ్) లోని హెయిలీబరీ కాలేజీలో చేర్పించారు. జనవరి 19 న బ్రౌన్‌ను ఈ కాలేజికి 'నామినేట్' చేయడం జరిగింది. హిందూస్తానీ చదువులో ఒక చిన్న 'ప్రయిజ్' కూడా వచ్చింది. సొంతంగా ల్యాటిన్ చదువుల మోతాదు ఎక్కువ చేసుకొన్నాడు. హెయిలీబరీలో సంస్కృతం కూడా చెప్పేవారు, మొత్తానికి చాలా చాలా చెప్పడానికి ప్రయత్నించారు కానీ బ్రౌన్ నేర్చుకొన్నదేమీ లేదు. డైరీలాంటిది వ్రాస్తూండమని తల్లి ఇచ్చిన సలహా పాటించి, ఒక నోట్‌బుక్‌లో రోజువారీ వ్యవహారాలూ భావాలూ అదే పనిగా వ్రాస్తూ పోయాడు. జ్ఞాపకశక్తి పెరుగుదలకు దివ్యౌషధంలా పనిచేసిందట ఈ ప్రక్రియ.

## 1816

నూనూగు మీసాల నూత్నయవ్వనుడైన బ్రౌన్‌కి జూన్ 30 న 'రైటర్‌ర్యాంక్' ఇవ్వడం జరిగింది, బ్రౌన్ సోదరులిద్దర్నీ బెంగాల్ సర్వీస్‌కీ, బ్రౌన్‌ను మాత్రం

మద్రాసుకూ కేటాయించారు. అప్పటికి ప్రపంచంలో తెలుగుభాష అనేది ఒకటున్న దని బ్రౌన్‌కు తెలియనే తెలియదట! (తండ్రి డేవిడ్ బ్రౌన్‌కు మాత్రం తెలుసు. ఆయనకు విశాఖపట్నంనుంచి ఆనందరాయర్ తెలుగులో వ్రాసిన జాబులు ఇంగ్లీషు తర్జుమా నకళ్ళతోబాటు వెళ్లేవి.)

## 1817—19

ఆగస్టు 4 న బ్రౌన్ మద్రాసులో కాలుపెట్టాడు. 5 వ తేదీన ఛీఫ్ సెక్రటరీని చూశాడు. 13న మద్రాసు ఫోర్ట్ సెంట్ జార్జి కాలేజీలో చేరాడు. వెలగపూడి కోదండరామపంతులు తెలుగులో అక్షరాభ్యాసం చేయించాడు. మొత్తం 6 సార్లు జరిగిన పరీక్షల్లో బ్రౌన్ మామూలుగానే పాసవుతూ వచ్చాడు. మొదట మొదట థర్డ్‌క్లాసులోనూ, తర్వాత తర్వాత సెకెండ్ క్లాసులోనూ. కాలేజి లైబ్రరీలోనుంచి గ్రీకు, హిందూ మైతాలజీలపైన పుస్తకాలు తీసుకుని చదివేవాడు. ఆ విచిత్ర పౌరాణిక లోకాల్లో విసుగుపుట్టిన దాకా విహారం చేశాడు. ఫ్రెంచి కూడా నేర్చుకోవడం ప్రారంభించాడు. ఇంగ్లీషులో కవిత్వం కూడా వ్రాసేవాడు. కానీ వ్రాసిన ఈ అభ్యాస కవితలన్నిటికీ అగ్గిపుల్ల గీసిపెట్టేవాడు- ఎట్లాగో ఒక్క కవితా ఖండిక మాత్రం మిగిలున్నది.

ఈ మద్రాసు కాలేజీలో గడిపే రెండు—మూడేళ్ళ కాలవ్యవధిలో ప్రతి సివిల్ ఉద్యోగీ రెండు భారతీయ భాషలు విధిగా నేర్చుకొని పరీక్ష పాసవ్వాలని రూలు. బ్రౌన్ మొదట్లో తెలుగు, మరాటీ నేర్చుకొంటానని దరఖాస్తులో సూచించాడు. కానీ 1819 జూన్‌లో జరిగిన పరీక్షలప్పుడు పేచీ పెట్టాడు— నాకు మరాటీ వద్దు అని. కావలిస్తే హిందూస్తానీలో పరీక్షించండని కోరగా హిందూస్తానీలోనే పరీక్షించి చూశారు. సెకెండ్ క్లాస్ మార్కులు వచ్చాయి, కానీ కాలేజీ రూల్సు ప్రకారం మొదట ఎన్ను కొన్న భాషను మధ్యలో మార్చుకోడానికి లేదట. కాలేజీబోర్డు డైరెక్టర్లు రూల్సు చూపించి, వాదించి, బెదిరించి ఎట్లాగో బ్రౌన్‌ను వొప్పించారు మరాటీ చదవడానికి. ఇట్లా అయిష్టంగానే తెలుగుతోబాటు మరాటీ నేర్చుకోవడం ప్రారంభించాడు. ఈ కాలేజీలో చదువుతుండగానే బ్రౌన్‌కు ఒక పెద్ద సొంత గ్రంథాలయమే వుండేది. ఒక మిత్రుని పట్టుదల మీద కొన్ని పుస్తకాలను అమ్మించి వేశాడు.

## 1820—21

అప్పుడే మద్రాసు గవర్నర్‌గా చార్జి తీసుకొన్న మన్రో సమక్షంలో జూన్-జూలైలో ఫైనల్ పరీక్షలు జరిగాయి. మొత్తం 16 మందిలో ఇద్దరికి మాత్రమే ఫస్ట్ క్లాస్.

అయిదుగురికి సెకెండ్, మిగతా అందరికీ థర్డ్ క్లాసులూ వచ్చాయి. బ్రౌన్ సెకెండ్ ✓క్లాసు లిస్టులో ఆఖరువాడు. అంటే 7 వ స్థానం తెచ్చుకొని ఏట్లాగో గట్టెక్కాడన్న మాట. ఈస్టిండియా కంపెనీ ఉద్యోగులు భారతీయ భాషలు బాగా నేర్చుకొని జనంతో మమేకంగా వుండాలని, సత్పరిపాలకులుగా కావాలని మన్రో తన 'కాన్వొకేషన్' ఉపన్యాసంలో చేసిన ప్రబోధం బ్రౌన్ మనసులో మంత్రోపదేశంలాగా బాగా నాటుకున్నది. మన్రో అంటే ఆరాధనా భావం ఏర్పడ్డది.

1820 ఆగస్టులో కడపలో ఉద్యోగ జీవితం ప్రారంభం. అప్పటికి బ్రౌన్ వయసు 22 ఏళ్ళు. కలెక్టర్ క్రింద అసిస్టెంట్‌గా చేరాడు. అంతకుముందు కొద్దికాలం క్రితమే జిల్లా హెడ్‌క్వార్టర్స్ సిద్ధవటంనుంచి కడపకు మారింది. తెలుగుతోబాటు హిందూస్తానీ, కన్నడం, మరాటీల్లో కడప పరిపాలనా వ్యవహారాలు జరుగుతుండేవి. కడప కలెక్టర్ హాన్‌బరీ తెలుగులో జమాయించి మాట్లాడ్తున్నాడు. ఆయనలాగా నేనూ అట్లా ఎప్పుడు మాట్లాడగలుగుతానా అనుకొనేవాడు.

కడపలో రెండేళ్ళు గడిచాయి. అప్పటికి తెలుగులో ఒక మోస్తరుగా మాట్లాడ్డం పట్టుబడింది. కానీ ఆ నుడికారం అబ్బింది కాదు. తెలుగు గ్రామర్, డిక్షనరీలు ప్రకటిం ✓చిన విలియం బ్రౌన్ అనే దొర తెలుగులో సారస్వతం పూజ్యం పొమ్మన్నాడు. మన బ్రౌన్ దాన్ని అక్షరాలా నమ్మి కూర్చొన్నాడు. తెలుగులో ఒక్క సారస్వత గ్రంథమైనా కనపడ్డదికాదు. తెలుగు మున్షీలద్వారా ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపించు కొంటూ నెగ్గుకొచ్చేవాడు. గ్రీక్, హిబ్రూ,పారసీక సాహిత్య పారాయణంలో పడ్డాడు.

ఎక్కడ చూచినా అవిద్య తాండవిస్తున్న ఆ రోజుల్లో చదువుసంధ్యలున్న తెలుగు యువకు లెవరూ తనకు కనపడ్డ పాపాన పోలేదు. 1821 లో కడపలో రెండు బళ్ళు పెట్టాడు. ఉచితంగా తెలుగు, హిందుస్తానీల్లో చదువు చెప్పించడం ప్రారంభించాడు. దేశీయ ఉపాధ్యాయుల్ని నియమించి సొంతడబ్బుతోనే వీటిని నిర్వహించేవాడు. అయోధ్యాపురం కృష్ణారెడ్డి తమ్ముడు నారాయణరెడ్డి ఈ బడిలో పార్సీ, తెలుగు చదువుకొన్న దాఖలా వుంది.

## 1822

మచిలీపట్నం జిల్లాకోర్టు రిజిస్టర్(రిజిస్ట్రార్)గా అక్టోబరు 26 న బదిలీ ఉత్తర్వు. రిజిస్టర్ అంటే జిల్లాజడ్జి కింద పనిచేసే యూరోపియన్ ఆఫీసర్. వెయ్యిరూపాయలలోపు

సివిల్ దావాల విచారణకూడా వుండేది. సహాయక మేజిస్ట్రేటు హోదా, దస్తావేజులు రిజిస్టర్ చేయడంకూడా వుండేది. డిసెంబర్ 16 న మచిలీపట్నం జిల్లాకోర్టులో ప్రమాణంచేసి రిజిస్టర్ పదవిలో చేరాడు.

## 1823

జనవరిలో మచిలీపట్నం జడ్జి చెర్రీని కుంభకోణానికి మార్చారు. ఆ స్థానంలో రావల్సిన వ్యక్తి వచ్చి చేరే ముందుగానే, చెర్రీ ఆరోగ్యం బాగాలేదని చెప్పి వెళ్ళడంతో రిజిస్టర్‌గా వున్న బ్రౌన్ మచిలీపట్నం జడ్జి & క్రిమినల్ జడ్జిగా ఒకటి రెణ్ణెల్లపాటు పనిచేశాడు. ఈ ఇన్‌చార్జి జడ్జీగా వున్నప్పుడే మచిలీపట్నం కోర్టు నాజర్, మరికొందరు వుద్యోగుల్ని లంచగొండితనం వగైరాల మూలంగా సస్పెండ్ చేశాడు. దీనిపైన పైకి అర్జీలు పోయాయి. పై అధికార్లు బ్రౌన్‌ను సంజాయిషీ అడిగారు. ఇచ్చాడు. బ్రౌన్ వుత్తర్వులు కొన్నిట్ని రద్దు చేశారు కూడా.

జూన్ 9 న ఆరువారాలు సెలవు కావాలని దరఖాస్తుపెట్టాడు. మంజూరు కాగానే మద్రాసుకు పయనమై వెళ్ళాడు. సెప్టెంబర్‌దాకా సెలవులోనే వుణ్ణాడు. మంజూరైన సెలవుకంటే రెండురోజులు అదనంగా తీసుకొని మద్రాసునుంచి వచ్చి చేరాడు. బహుశా ఈ సెలవులో నుంచి తిరిగివస్తూ మద్రాసులో 'అబే డుబాయ్' వ్రాసిన పుస్తకం కొనుక్కొని వచ్చివుంటాడు.

మచిలీపట్నంలో కూడా రెండు 'ఫ్రీ స్కూల్స్' ప్రారంభించాడు. ఈ బళ్ళలో చదివిన విద్యార్థులు తర్వాత తర్వాత బ్రౌన్‌కు ఉత్తరాలు వ్రాసేవాళ్లు. ఇదే కాలంలో ఒక బెంగాలీ గ్రామర్‌ను తెచ్చి బెంగాలీ భాషను అభ్యసించడం ప్రారంభించాడు.

## బ్రౌన్ మర్చిపోలేని సం॥ 1824

బ్రౌన్ జీవితంలో మర్చిపోలేని సంవత్సరం. అబే డుబాయ్ పుస్తకం 'హిందూ మేనర్స్, కస్టమ్స్ అండ్ సెరిమనీస్' చదువుతుంటే వేమన కవిచంద్రుని ప్రస్తావన కనపడింది. అరే, తెలుగులో అసలు సాహిత్యమే శూన్యం అని విలియమ్ బ్రౌన్ అన్నాడే, ఇదేమిటీ, ఈ కవిగారెవరూ—అనుకొన్నాడు. ఊరకే అనుకోవడం కాదు. వేమన కవిని టకీమని పట్టుకొన్నాడు.

వేమన పద్యాల సేకరణ మొదలైంది. తాటాకు ప్రతులు వచ్చి పడ్డాయి. చదవడం మొదలెట్టాడు. తిప్పాభట్ల వెంకట శివశాస్త్రి, మచిలీపట్నం కోర్టు పండితుడు

(సదర్ అమీన్) వఠ్యేం అద్వైత బ్రహ్మశాస్త్రి ఈ దశలో బ్రౌన్‌కు సాహిత్య గురువులై వేమన పద్యాలకు అర్థతాత్పర్యాలు చెబుతూ తెలుగు వ్యాకరణం, ఛందస్సు వగైరా సూక్ష్మాలు బోధించారు బ్రౌన్‌కు.

తాటాకుల్లోనుంచి కాగితాల్లోకి ఎక్కించి పద్యాల్ని పరిష్కరించి స్థూలంగా ఒక శుద్ధ ప్రతిని రూపొందించి, మార్చినెలలో తర్జుమాకు కూర్చొన్నాడు. రోజుకు 7, 8 చొప్పున వేమన పద్యాలకు ఇంగ్లీషు అనువాదం ఆరంభించాడు. నవంబర్ 23 న వేమన పద్యప్రతికి ఒక చిత్తు పీఠికను రూపొందించాడు.

సాధు పాఠ నిర్ణయంలో ఛందో పరిజ్ఞానం వుంటే సహాయకారిగా వుంటుందనుకొని, వేమనాధ్యయనం కాసేపు పక్కకునెట్టి తెలుగు ఛందస్సు నేర్వడం మొదలుపెట్టాడు. వేమన పద్యాల్లో ఎదురైన కఠిన పదాలకు అర్థాల కోసం వెతుకులాటలో నిఘంటువు కూడా ఒకటి రూపొందిస్తే బాగుణ్ణనుకొన్నాడు. అందుకూ ఉపక్రమించాడు. ఇట్లా ఈ సంవత్సరంలో బ్రౌన్ తెలుగు సాహిత్య స్పృహ—కృషి బహుముఖమైంది. నవంబర్ 23న రాజమండ్రి కలెక్టర్‌కు హెడ్ అసిస్టెంటు, మేజస్ట్రేట్‌గా బదిలీఉత్తర్వు.

## 1825

రాజమండ్రి ఉద్యోగంలో వచ్చి చేరాడు. ఆంధ్రమహాభారతం చదవనారంభించాడు. కవిజనాశ్రయం, అప్పకవీయం అంతుపంతు తేల్చుకొన్నాడు. కవిజనాశ్రయానికి ఇంగ్లీషు తర్జుమా కూడా ఆరంభించాడు. ఆంధ్ర గీర్వాణ ఛందో రీతుల్ని ఇంగ్లీషులో వివరిస్తూ ఒక పుస్తకం వ్రాసి డిసెంబర్ 13 న కాలేజీ బోర్డుకు సమర్పించాడు— అచ్చువేయమని అభ్యర్థిస్తూ.

బ్రౌన్ తెలుగు అధ్యయనం ఇట్లా విస్మయకరమైన వేగాన్ని అందుకొన్నది. తెలుగుకావ్య సేకరణ, పఠనం, పరిష్కారం—యీ వ్యసనంలో పడిపోయాడు. సొంత డబ్బు వెచ్చించి, వ్రాయసగాళ్ళను పెట్టి, కావ్యపరిష్కరణ చేయిస్తూ, శుద్ధ ప్రతులు సంతరింపజేయడం, కాగితాలమీద కెక్కించడం—ఈ యజ్ఞకాండ మొదలైంది. ఇట్లా జనబాహుళ్యానికి దూరంగా తాటాకుల్లో మగ్గిపోతూ భ్రష్టమై ఏదో కొద్ది మంది గుత్త సొమ్మై మృతప్రాయంగా మిగిలివున్న తెలుగు కావ్యసంపద బ్రౌన్ హస్త స్పర్శతో స్వచ్ఛమైన కళాకాంతు లీనుతూ ప్రాణవంతమై పునరుద్ధరితమవుతూ వచ్చింది. ఈ సంవత్సరంలో తన సొంత గ్రంథాలయంలో నుంచి కొన్ని ఇంగ్లీషు తదితర పుస్తకాలను అమ్మివేశాడు.

గవర్రాజు కథ జరిగిన సం॥ **1826**

జనవరి 10 న కడపజిల్లాకోర్టు రిజిస్ట్రర్‌గా బదిలీ ఉత్తర్వు. 1825 ఆఖర్లో బ్రౌన్ సెలవు పెట్టి మద్రాసు వెళ్ళి ఛందస్సు పుస్తక ప్రతిని కాలేజీ బోర్డుకు సమర్పించి సభ్యుల్ని చూచి వచ్చాడు. సెలవు కాలంతోబాటు ఈ జాయినింగ్ టైమును కూడా కలుపుకొని, మార్చిలో కడపకు వచ్చాడు. 10 తేదీన జిల్లాకోర్టు రిజిస్ట్రర్‌గా చేరాడు.

లోగడ రాజమండ్రి హెడ్ అసిస్టెంట్ కలక్టరుగా వున్నప్పుడు— 'సాల్ట్ దరోగా' ఉద్యోగి గవర్రాజు ఉప్పుకొఠార్లవారి దగ్గర్నుండి. ఉప్పు వర్తకులనుండి డబ్బు గుంజుతున్నాడనే నేరారోపణపై 2 వేలరూపాయల ధనదండన విధించి, ఆయన్ను ఉద్యోగంనుంచి బ్రౌన్ డిస్మిస్ చేశాడు. ఈ డిస్మిసల్ ఉత్తర్వు కాస్త కలకలాన్నే సృష్టించినట్లున్నది. గవర్రాజు ఫైన్ కట్టాడు. పైకి అర్జీపెట్టి అపీల్ చేసుకున్నాడు. గవర్రాజునే దరోగాగా వుంచాలని స్థానికులనుంచి కూడా అర్జీలు వెళ్ళి నట్లున్నాయి. పై అధికార్లు ఫైల్ తెప్పించుకుని విచారణ చేశారు. గవర్రాజు కింద సాల్ట్ డిపార్ట్‌మెంట్‌లో 'హెడ్‌కాపు'గా పనిచేస్తున్న చిన్నయ్య, గవర్రాజు పేరు చెప్పి ఉప్పుకొఠార్లవారినుండి డబ్బు వసూలుచేసేవాడట. కావడి వర్తకుల్నుంచి కావడికి ఇన్ని దోసిళ్ళ చొప్పున విధిగా కొంత ఉప్పు రాబట్టడమనేది ఒక ఆచారంగా వస్తున్నదనీ, ఈ కర్మకాండంతా కూడా ఏదో దేవాలయ నిధి (దేవుడి ఫండ్) కింద రాబట్టేవారనీ, ఈ వసూళ్ళలోనుంచి కొంత గవర్రాజు సొంత ఖర్చులకింద వాడుకొన్నది వాస్తవమే అయినా, దాన్ని దరిమిలా కట్టివేశాడనీ తేలింది. గవర్రాజు జుల్మానా కింద కట్టిన డబ్బును తిరిగి వడ్డీతో సహా ఆయనకు చెల్లించివేయమన్నారు. అంతేకాదు, ఈ జుల్మానాలోనుంచి సాక్ష్యాలు చెప్పి, ఈ కుంభకోణాల్ని బయటపెట్టిన 'ఇన్‌ఫార్మర్స్'కు 'కాంపెన్జేషన్' కింద ఇచ్చిన మొత్తాలను తిరిగి రాబట్టమన్నారు. ఇట్లా బ్రౌన్ చేసిన తీర్పును, విధించిన శిక్షను రద్దుచేస్తూ ప్రభుత్వ ఉత్తర్వులు వచ్చాయి.

బ్రౌన్ సమర్పించిన ఛందోగ్రంథం వ్రాతప్రతిని కాలేజీబోర్డు తరపున ఎ.డి. కేంబెల్ పరిశీలించాడు. మొత్తంమీద బాగా వ్రాశాడనీ, తాను ఎత్తి చూపుతున్న అక్కడక్కడా దొర్లిన స్వల్పమైన దోషాల్ని బ్రౌన్ సవరించినమీదట, కాలేజి ప్రెస్‌లో 150 కాపీలు అచ్చువేయించమనీ, 50 కాపీలు బ్రౌన్‌కు బహుమానంగా ఇవ్వమనీ చీఫ్ సెక్రెటరీకి గట్టిగా సిఫారసు చేస్తూ ఒక నివేదిక పంపాడు. గవర్నర్ సంతకం పెట్టాడు. ముద్రణ ప్రారంభమైంది.

## 1827

కడపలో కొద్దికాలం ఇన్‌చార్జి అసిస్టెంట్ జడ్జిగా జాయింట్ క్రిమినల్ జడ్జి హోదాలో పనిచేశాడు. అప్పట్లో కడపజిల్లాలో చేరిన కంభంలో (ఇప్పుడు ప్రకాశం జిల్లా) కొత్తగా ఏర్పాటైన ఆక్సిలరీకోర్టుకు అధ్వర్యం వహించాడు.

బ్రౌన్ ఛందోగ్రంథం అచ్చయి విడుదలైంది. ఇది ఎ.డి. కేంబెల్‌కు అంకితం.

ఇది అచ్చులో వున్నప్పుడే, తాను పరిష్కరించి ఎంపికచేసిన కొన్ని వేమన పద్యాలు-వాటికి ఇంగ్లీషులో చేసిన తర్జుమాలు కాలేజిబోర్డుకు సమర్పించి అచ్చువేయించమని కోరాడు. దీన్నికూడా అచ్చువేయించాలనీ, ఈ రెండు గ్రంథాలకు కల్పి కాపీరైట్ క్రిందనైతేనేమి, బహుమాన పురస్సరంగానైతేనేమి బ్రౌన్‌కు వెయ్యి వరహాలు (3500 రూ.లు) యివ్వడం బాగుంటుందని కాలేజీబోర్డు కార్యదర్శి కెప్టెన్ హెచ్. హార్క్‌నెస్ చీఫ్ సెక్రెటరీకి సిఫారసు చేశాడు. గవర్నర్ ఈ వెయ్యి వరహాల విషయమై లండన్ కోర్ట్ ఆఫ్ డైరెక్టర్స్‌కు వ్రాశాడు.

బైచరాజు వెంగళరాజు పంచతంత్రానికీ, పోతన భాగవతానికీ శుద్ధప్రతులు తయారయ్యాయి. తనవద్దవున్న తెలుగుకావ్యాల వ్రాతప్రతుల లిస్టు సమర్పిస్తూ కాలేజీకి అనుబంధంగా ఒక లైబ్రరీని ఏర్పాటుచేసి అందులో రెఫరెన్సుకోసం తనవద్దవున్న వాటిల్లోనుంచి కొన్ని ప్రతుల్ని ఖరీదుకు కొని ఉంచాలనీ కోరుతూ కాలేజీబోర్డుకు ఒక లైబ్రరీ ప్రతిపాదన పంపాడు. ఆ లిస్టులోనుంచి 500 రూపాయలకు సరిపడే కొన్ని పుస్తకాల్ని కొనమని హార్క్‌నెస్ సిఫారసు చేశాడు. (చూడు పేజీలు : 106-7.)

ఈ సంవత్సరంలో మద్రాసు గవర్నమెంట్ గెజిట్‌లో రెండు వ్యాసాలు ప్రకటించాడు. ఒకటి— హైందవ శిల్పులు విగ్రహాలుచేసే విధానం, వాళ్ళు పాటించే కొలతల్ని వివరించే 'Hindu Sculpture' అనే వ్యాసం. రెండు— సతీసహగమనం చట్టవిరుద్ధంకాని ఆ రోజుల్లో ఒకామె సహగమనం చేసుకోవాలని అనుకొంటే, దాన్ని నివారించడానికి ఆయన చొరవ తీసుకొని చేసిన ఏర్పాట్లు గురించి ఒక వార్తలాగా వ్రాసిన 'Sutte Prevented' అనే వ్యాసం. ఇవి రెండూ పేరు లేకుండా వ్రాసిన వ్యాసాలు. ఈ రెండు వ్యాసాలూ ఆ తర్వాత 1828, నవంబరు "ఏషియాటిక్ జర్నల్"లో పునర్ముద్రణైనాయి.

## 1828

మార్చినెలలో కడపజిల్లా జడ్జి హేగ్ జబ్బుపడి నాలుగు నెలలు సెలవుపెట్టి నీలగిరి పోవాలని దరఖాస్తు పెట్టుకోగా ఆయన స్థానంలో కొత్త జడ్జిని వేస్తూ వుత్తర్వు వచ్చింది. కొత్త జడ్జి వచ్చి చేరేలోపుగానే హేగ్ ఆరోగ్యం వికటించినట్లున్నది. కంభంనుంచి వెంటనే రమ్మని, వచ్చి జిల్లా జడ్జిగా చార్జి తీసుకోమనీ బ్రౌన్‌కు తాకీదు రావడంతో ఆయన కడపవచ్చి చార్జి తీసుకొన్నాడు. వారం పదిరోజుల్లోనే కొత్త జడ్జి మేసన్ వచ్చి చార్జి తీసుకొన్నాడు. ఆయనకు చార్జి అప్పగించి కంభం పోదామను కొంటే తానూ జబ్బుపడ్డాడు. మెడికల్ సర్టిఫికేట్‌తోబాటు సెలవు చీటీ పంపుకొన్నాడు. జబ్బు తగ్గగానే కంభం వెళ్ళి చేరాడు. బ్రౌన్‌కు రావాల్సిన ప్రయాణ బత్తెలు, అలవెన్సులు గురించి సివిల్ ఆడిటర్ పేచీ పెట్టాడు. సదర్ అదాలత్ కోర్టుకు వ్రాస్తే, వారు రాజీగా పరిష్కారంచేసి కొన్ని తగ్గింపులతో బిల్లు పే చేయించారు.

రోజూ తెలుగు సంస్కృత కావ్యపఠనం, డిక్షనరీ పనుల్లో నిమగ్నమవుతూనే వచ్చాడు. తెలుగు గ్రామర్ వ్రాయాలని కూడా ఒక ఆలోచన వచ్చింది.

లోగడ కడపలో 1820-22 మధ్య ఉద్యోగంలో వున్నప్పుడో, లేక మళ్ళీ 1826 లో వచ్చినప్పుడో కడపలో ఒక పెద్ద బంగళా— తోటను కొనిపెట్టాడు. అందులో ఒక పక్క స్కూల్, ఇంకోవైపు తన లైబ్రరీ— అందులో పండితులు, వ్రాయసగాళ్ళు చేరి తెలుగు కావ్యాల పరిష్కరణ, శుద్ధప్రతులవ్రాత, వ్యాఖ్యానాల రచన కొనసాగిస్తూ వుండేవారు. వాళ్ళకు జీతబత్తెలు బ్రౌనే చెల్లించేవాడు. జూలూరు అప్పయ్య ఇక్కడుండే వసుచరిత్ర, మనుచరిత్రలకు వ్యాఖ్య వ్రాశాడు. పైడిపాటి వెంకటనరసయ్య వేమన పద్యాల్ని పరిష్కరిస్తూ వచ్చాడు. కంభం నృసింహాచార్యులు రాఘవ పాండవీయానికి వ్యాఖ్య రూపొందించాడు. ఇట్లా ఈ ఇల్లు ఒక చిన్న సారస్వత కర్మాగారంగా వుంటుండేది. తాను ఉద్యోగరీత్యా ఏ వూర్లో పనిచేస్తుండినా ఈ బంగళా— తోటను తనపేరనే వుంచుకొన్నాడు. కడపకోర్టు నాజర్‌గావున్న అయోధ్యాపురం కృష్ణారెడ్డి ఈ బంగళా తోటను, అందులో సాగే సాహిత్య కృషిని అజమాయిషీ చేస్తూ బ్రౌన్‌కు లెక్కపక్కలు పంపుతుండేవాడు. 1840-44 దాకా ఈ బంగళా బ్రౌన్ పేరనే వున్నట్లున్నది. 1829 జూన్‌లో ఈ బంగళాలో వున్న కొన్ని ఇంగ్లీషు పుస్తకాల్ని కెప్టెన్ కియిలీకి చేర్చమంటే అ. కృష్ణారెడ్డి 275 పుస్తకాల్ని రెండు తోలుపెట్టెలు, ఒక వెదురుపెట్టెలోనూ పెట్టి చేర్చాడు.

ఈ దశలో తనకు పరిచయమైన, తన సాహిత్యకృషికి తోడ్పడగలరనుకొన్న కొందరు తెలుగువాళ్ళను గురించి ఒకచోట ఇట్లా వ్రాసిపెట్టుకొన్నాడు :

"One of the greatest acha Tenugu scholars now living, says Bramhia is జూలూరి అప్పయ్య పంతులు at వేటపాళము (alias Naydpally, near Bapatla, which is 5 coss thence). The Pandit styles him a second Nannia, He is a వేపారి—like Jey Row. ములుపాక Buchana Sastri in Nandloor wrote the వేంకటేశ్వర మహాత్మ్యం, మాఘమహాత్మ్యం in the Uttara Kanda of the Padma Purana. Chincholi Apppanna Chari in Pata Cudpa has a noble Sanscrit library. Runga Reddee in Nosum has a noble library సంస్థానం. In pallapaud of Duoor the son of Raghavachari has a library, is a good fellow. Gopuraz Subboya of పడ్లపూడి near Nelloor is a sound scholar. This is the man who brought me the Dasavatara. Condoori Chitambaram of Mogullur (south of Guntoor) near Cumbum offers me his library (a bullock load). In avok of Covilaguntla lines అకింతల సుబ్బరాయశాస్త్రి who resided 30 years in Bengal, knows the Bengali & is a profound scholar....

"Libraries open to me: at Masulipatam that of Mamidi Vencaya, at Cuddapa that of Gajal Reddi, at Pungonoor that of Raja, at Madras that of Langar Papaya....

"In Duoor, Gudipaud, in the Curnum Lakshmipathi's house is a Telugu library. Vangipuram Venkata Crishtama Chari, very humble & proper fellow at Nagireddi pully in Cambam at 32 is a fine scholar and poet. Miduturi Lachminarasu, Curnam at Uyyalavada 3 amadas from Cumbum is a superior scholar and poet. Manchala Kristam Raz brought me 3 chapters of Appa Cavi which he knows by heart. Vidvat Cavi Krishtama Chari is a poet in the employ of Sita Rama Bhupal, Zamindar of Gadwal 5o miles s.w. of Carnul.He has a salary and land...300 Rs. a year.

"....గద్వాలలో రాజమాన రాజపూజితులైన రాజె సీతారాం భూపాల్ రావు బహాదరు.... visited me 23 Dec. 1827...

"Dantuloori Jagannatha Raz...near Cakinada is connected with the Zamindars, is a scholar and has a fine library of Sanscrit & Telugu. Chelicani Vencat Raya (baomardi to Appa Rao, the Zemindar of Gootala) sends me the Dasavatara Charitra. Cappagantula Mandapa Sastri says Simhadri Sastri's heir Bucchıa of Rajahmundry has the Yoni tantra and other such books — not collected, but inherited not understanding them. Pindiprolu Luschmana Cavi, at Cuyyeru in Dracsharama, a Curnum Mirasidar is a noble poet. Tooprani Seenaya of Rajahmundry, a Vaishnavite has a large Telugu library ... In Musulipatam ... particularly Gundumalla Jagannatham and Raja Jagannatha Rao......"

తెలుగునాడుకు దూరమైన సం॥ **1829**

ఫిబ్రవరి 17 న తిరుచునాపల్లిలోని ప్రొవిన్షియల్ కోర్ట్ ఆఫ్ అపీల్ అండ్ సర్క్యూట్ (సదర్న్ డివిజన్) రిజిస్టర్‌గా బ్రౌన్‌కు బదిలీ ఉత్తర్వు. అప్పట్లో మద్రాసు రాష్ట్రానికి నాలుగుచోట్ల ప్రొవిన్షియల్ కోర్టులుండేవి — నార్తర్న్ డివిజన్ (మచిలీపట్నం), సెంట్రల్ డివిజన్ (చిత్తూరు), వెస్ట్రన్ డివిజన్ (తెలిచ్చేరి), సదర్న్ డివిజన్ (తిరుచునాపల్లి). ఇక్కడున్న దాదాపు యీ ఏడాదికాలం తప్ప, బ్రౌన్ తొలిదశ ఉద్యోగ జీవితమంతా తెలుగు పట్టణాల్లోనే గడిచిపోతుంది. తిరుచునాపల్లిలో కూడా తెలుగు పుస్తకాల వేట వదల్లేదు.

వేమన పద్యాల గ్రంథం అచ్చయి విడుదలైంది.

కేంబెల్ డిక్షనరీని ఆధారం చేసుకొని 1824 లో ఒక దీక్షగా ప్రారభించిన నిఘంటువు ఒక కొలిక్కి వచ్చింది. 1829 మే నాటికి తాను అదనంగా చేర్చినవి 16 వేల పైచిలుకు పదాలున్నట్లు లెక్కతేశాడు. మాదిరికి కొన్ని పదాలు అర్థాలు చూపుతూ తన డిక్షనరీ ప్రణాళికను వివరిస్తూ కాలేజీ బోర్డుకు ఒక నివేదిక పంపి, అచ్చువేస్తామంటే డిక్షనరీ పూర్తి ప్రతిని సమర్పించగలనని వ్రాశాడు. ఈ ప్రతిపాదనను కాలేజీ బోర్డువారు పైకి రానీకుండా తొక్కిపెట్టారు.

డిసంబరు 11 న రాజమంద్రి అసిస్టెంట్ జడ్జి & జాయింట్ క్రిమినల్ జడ్జిగా బదిలీ ఉత్తర్వు. ఇంతదాకా సబార్డినేట్ హోదా. ఈ సంవత్సరంనుంచి బ్రౌన్ క్యాడర్ పెరిగింది. ఈ యవ్వన దశలో అడవుల్లో వేటాడ్డం వగైరా వినోదవిలాస కాలక్షేపాలు కూడా వుండేవి బ్రౌన్‌కు.

## 1830

రాజమండ్రి వచ్చి చేరాడో లేదో జడ్జి విబ్రాట్ జబ్బుపడ్డాడు. బ్రౌన్‌ను ఆక్టింగ్ జడ్జిగా పనిచేయమంటారు. కొన్నాళ్ళ తర్వాత హెచ్. మాంట్‌గొమరీని ఆక్టింగ్‌గా వేసి బ్రౌన్‌ను మచిలీపట్నం ఆక్జిలరీ కోర్టు జడ్జిగా వేస్తారు.

'ట్రేడ్'ను గురించి ఒక వ్యాసం వ్రాసి ఫిబ్రవరిలో మద్రాసు పత్రిక (మద్రాసు గవర్నమెంట్ గెజిట్?)లో ప్రకటించాడు. హిందువులకు ముఖ్యంగా ఏయే సరకులు కావల్సి వున్నాయో అందులో వివరించాడు. కొన్ని బెంగాల్ పత్రికలు దీన్ని పునర్ముద్రించుకొన్నాయి. అంతేకాదు, మిస్ ఎమ్మా రాబర్ట్స్ వ్రాసిన "క్యారక్టరస్టిక్స్ ఆఫ్ హిందూస్తాన్...." అనే గ్రంథం తాలూకు అమెరికన్ ఎడిషన్‌లో ఈ వ్యాసం గురించిన ప్రస్తావన కనపడ్తుంది.

ఏడేళ్ళనుంచి ఏకదీక్షగా తాను వ్రాస్తూ వస్తున్న తెలుగు-ఇంగ్లీషు నిఘంటువు ఒక సమగ్రరూపం దాలుస్తుంది. దీన్నే కొంచం తిరగదిప్పి ఇంగ్లీషు-తెలుగు నిఘంటువుగా రూపొందించడం ప్రారంభిస్తాడు. జాన్సన్ ఇంగ్లీషు డిక్షనరీని తెలుగులోకి తర్జుమా చేయడం ప్రారంభించాడు.

## 1831

ఏనుగుల వీరాస్వామయ్య కాశీయాత్ర చేసి తిరిగొస్తూ ఆగస్టు 2-15 మధ్య మచిలీపట్నంలో బ్రౌన్‌ను కల్సుకొన్నాడు. మద్రాసు చేరిన తర్వాత లంగరు పాపయ్య ఇంట్లో వెళ్ళి వెతికి 'స్కాందపురాణం' పంపమని వీరాస్వామయ్యను కోరాడు.

## 1832 గుంటూరు ఆక్టింగ్ కలెక్టర్

గుట్టలుగా తయారైన తన డిక్షనరీ నోట్సుల్లోనుంచి నవంబర్ 10వ తేదీన మళ్ళీ శుభ్రంగా అకారాదిక్రమంలో 8 సంపుటాల్లో ఫేర్ కాపీ వ్రాయడం ప్రారంభిస్తాడు. మనుచరిత్రకు జూలూరు అప్పయ్య వ్యాఖ్యానం పూర్తిచేస్తాడు.

డిసెంబర్లో గుంటూరు ఆక్టింగ్ కలెక్టర్‌గా చార్జి తీసుకొంటాడు. సొంతంగా ప్రెస్‌పెట్టి తెలుగు కావ్యాలు వగైరాలు ముద్రించాలనే తలంపు వచ్చినట్లున్నది. రావిపాటి గురుమూర్తిశాస్త్రి జనవరిలో వ్రాసిన జాబునుపట్టి (చూడు పేజీలు 17-18) చూస్తే ఇందుకు సంబంధించి కొన్ని ప్రాథమిక ప్రయత్నాలు చేసినట్లున్నాడు.

## గుంటూరు కరువు 1833

గుంటూరు జిల్లాలో భయంకరమైన కరువు తాండవమాడుతున్న రోజులవి. జిల్లాలో దోపిడీలు, దొంగతనాలు పెరుగుతున్నాయనీ పోలీస్‌కు కావల్సిన మందుగుండు వగైరా వస్తువుల్ని సరఫరా చేయమని జాబు వ్రాస్తాడు గవర్నర్‌కు. 1831 నుంచి 32 దాకా ధాన్యం ధరల పెరుగుదల, ఆకలిచావుల వివరం తెలుపుతూ ఒక నివేదిక పంపుతాడు. కడపలో కరువు పరిస్థితులు ఎట్లా వున్నాయో, బీదప్రజలు ఎట్లా బ్రతుకుతున్నారో వ్రాయమని అయోధ్యాపురం కృష్ణారెడ్డిని కోరగా, ఆయన పరిస్థితులను వివరిస్తూ కరువు పనులు, గంజి కేంద్రాల ఏర్పాట్లగురించి మార్చి 25న పెద్ద జవాబు వ్రాస్తాడు.

గుంటూరు కలెక్టరుగా పనిచేసినంతకాలం అదనంగా రోజుకు 17⅓ రూపాయల అలవెన్సు డ్రా చేయమని వుత్తర్వు. నెలకు 500 వరహాలు అదనంగా అలవెన్సుల క్రింద డ్రా చేయడానికి రాజమండ్రీ జడ్జి ద్వారా వ్రాసుకోగా వల్లకాదన్నారు.

చిత్తూరు జిల్లా జడ్జిగా బదిలీచేస్తూ వెంటనే వెళ్ళి జాయిన్ కావాలని కోరుతూ మార్చి 19న వుత్తర్వు. 25న ఆక్టింగ్ కలెక్టర్ గిరీ చార్జి ఇచ్చేసి, చిత్తూరుకు బయలుదేరి వస్తాడు. ఒక నెల పనిచేశాడో లేదో చిత్తూరుకు కొత్త జడ్జిని వేస్తారు. మళ్ళీ ఆయనకు చార్జి ఇచ్చేసి మచిలీపట్నం ఆక్జిలరీ కోర్టు జడ్జిగా వచ్చేస్తాడు. గుంటూరునుంచి చిత్తూరుకు వచ్చినందుకు టి.ఏ. బిల్లు 568 రూపాయలా 4 అణాలా 8 పైసలకు మే నెలలో శాంక్షన్ అవుతుంది. మళ్ళీ చిత్తూరునుంచి మచిలీపట్నానికి వేరే బిల్లు.

రాజమండ్రీ వచ్చి చేరే ముందు 3 నెల్లు సెలవు పెట్టాడు. మచిలీపట్నంలో తెలుగు ప్రెస్సును పెట్టించాడు. టైప్స్. వగైరా సామాన్లన్నీ తెప్పించాడు. ప్రింటింగ్ పనులు ప్రారంభింపజేశాడు కూడా. వసుచరిత్రలో నాలుగు పేజీలు మాదిరికి ప్రింటయింది కూడా. అయితే ఈ ప్రెస్ అజమాయిషీకిగాను నియమించిన ఒక ఆంగ్లేయుడి అవినీతి వ్యవహారం తెల్సుకొని ఇందులోనుంచి బ్రౌన్ బయటపడ్డాడు.

## బ్రౌన్‌ను దుఃఖంలో ముంచిన సంవత్సరం 1834

ఆందోళనకరంగా పరిణమించిన సంవత్సరం. బ్రౌన్‌ను పుట్టెడు దుఃఖంలో ముంచిన సంవత్సరం ఇది. చిత్తశాంతికి అగ్నిపరీక్ష ఎదురైన సంవత్సరం.

లోగడ రాజమండ్రి అసిస్టెంటు జడ్జిగా వున్నప్పుడు — కొన్ని ఫోర్జరీలు, అబద్ధీకపు సాక్ష్యాల కేసులకు సంబంధించి బ్రౌన్ అనుసరించిన విచారణ పద్ధతి, చేసిన తీర్పులపై కొన్ని అర్జీలు వెళ్లాయి. మచిలీపట్నం ప్రొవిన్షియల్ కోర్టు తాలూకు ఫస్ట్ జడ్జి ఫైళ్ల పరిశీలించి కొన్ని తీవ్రమైన లోపాలు ఎత్తి చూపుతూ ఫౌజ్‌దారీ అదాలత్ కోర్టుకు ఒక రిపోర్టు పంపుతాడు. ఫౌజ్‌దారీ అదాలత్ కోర్టువారు బ్రౌన్ ఆ కేసుల విచారణలో చట్టవిరుద్ధంగా వ్యవహరించాడని, న్యాయశాస్త్ర నిబంధనలను వుల్లంఘించాడనడంతో 1834 అక్టోబరు 25న బోర్డువారు బ్రౌన్‌ను డిస్మిస్ చేస్తూ వుత్తర్వు చేస్తారు.

ఉద్యోగనిర్వహణలో తప్పులు దొర్లిన మాట వాస్తవమేకానీ, ఇందులో తనకే దురుద్దేశమూ లేదనీ, ఏ పక్షపాతమూ ఎరగననీ, తన అంతరంగం స్వచ్ఛంగానే వ్యవహరించిందనీ విధినిర్వహణలో తన నడవడికనూ, శీలాన్నీ గురించి విచారణ జరిపించమనీ నవంబరు 4న పైకి నివేదించుకొన్నాడు. ఇందులో ఉద్దేశదురుద్దేశాల ప్రసక్తి లేదనీ, విధినిర్వహణలో శీలాన్ని గురించిన విచారణ అవసరం కనపడ్డం లేదనీ, డిస్మిసల్ డిస్మిసలేనంటూ నవంబర్ 14న పై అధికార్లు తెలిపారు. చార్జి ఇచ్చి పొమ్మన్నారు. సీనియర్ మర్చెంట్‌గా సబ్‌సిస్టెన్స్ అలవెన్సులు ఇవ్వమన్నారు.

లండన్ కోర్ట్ ఆఫ్ డైరెక్టర్స్‌కు పై అధికార్ల ద్వారా నవంబరు 26న ఒక విజ్ఞాపన పత్రం (మెమోరియల్) పెట్టుకొన్నాడు, ఈ మెమోరియల్‌ను లండన్‌కు పంపేదానికి ముందు 20 రోజులపాటు 'నోటీస్ బోర్డు'లో వుంచమని బోర్డువారు డిసెంబర్ 5న ఆరర్ వేశారు. కోర్ట్ అఫ్ డైరెక్టర్స్ తన విషయం ఏదో తేల్చేదాకా, తన 17 ఏళ్ళ సర్వీస్‌నుబట్టి మూడేళ్ళ సెలవుమీద లండన్ వెళ్ళి వస్తానని లోగడ పెట్టుకొన్న అర్జీ మీద సెలవు సర్టిఫికేట్ మంజూరుచేయమని కోరుకున్నట్లుంది. డిసెంబర్ 2న ఆబ్సెంటీ అలవెన్సుతో సెలవు మంజూరవుతుంది. సంవత్సరానికి £500 సెలవు (ఫర్లో) జీత మని స్వీయచరిత్రలో వ్రాసుకుంటాడు. డిసెంబర్ 17న కోరంగి రేవులో పడవ ఎక్కి మద్రాసు మీదుగా లండన్ బయలుదేరి వెళ్లాడు. 1835 జనవరి 6న సెలవు సర్టిఫికేట్ మంజూరవుతుంది. లండన్‌కు పోతూ డబ్బుకు ఇబ్బంది కలిగివుంటుంది, తన లైబ్రరీలోనుంచి కొన్ని పుస్తకాలను (బహుశా ఇంగ్లీషువి) అమ్మివేసుకొన్నాడు.

[ఈ డిస్మిసల్ గురించి తన స్వీయచరిత్రలో ఎక్కడా చెప్పనే చెప్పడు. కానీ దుర్బిణీలో వెతికితే కొన్ని డొంకతిరుగుడు వాక్యాలు కనపడకపోవు. ముఖ్యంగా 1854 నాటి 'మిన్నెసోటా వ్రాతప్రతి'లో "Meantime I was daily buried at

my public duties, chiefly as a Judge. Unhappily in the wish to do justice, I committed several illegal acts which soon led to my ruin..." అనే వాక్యాలకు అర్థం ఇదేననుకోవాలి. 1866 ఎడిషన్‌లో యీ క్రింది వాక్యాలను ఈ సంఘటనతో అన్వయించుకోవలసి వుంటుంది: "In discharging my duty as a Judge I was zealous and too often rash. An aged Judge who shewed me great friendship, predicted (in 1825) that I should do great good but injure myself. He on one occasion said 'go on, my friend; you will certainly ruin yourself; but do not fear: I know that God will recompense you'." 1872 ఎడిషన్‌లో ఈ వాక్యాల్ని పూర్తిగా తొలగించేశాడు!]

## ఫలప్రదమైన లండన్ సెలవుయాత్ర 1835 – 37

లండన్‌లో సెలవు జీవితం ఒక సంబరంగా గడిచిపోయింది. తన డిస్మిసల్‌పై కోర్ట్ ఆఫ్ డైరెక్టర్స్‌కు పంపుకొన్న విజ్ఞాపనకు సంబంధించి కల్సుకోవలసిన ముఖ్యుల్ని కల్సుకొని చెప్పుకోవలసిన సంగతులు చెప్పుకుని వుండాలి. కొన్ని షరతులతో వారు బ్రౌన్ డిస్మిసల్‌ను రద్దుచేస్తూ వుత్తర్వులు జారీచేశారు.

బంధువుల్ని మిత్రుల్ని చూడ్డం కల్సుకోవడంతో కాలం హాయిగా గడిచిపోయింది. ఇంత బిజీగా తిరుగుతున్నా రోజూ కొంత విశ్రాంతి దొరకజేసుకునేవాడు వ్రాతకోతల కోసం. తాను ఇండియాలో దీక్షగా గజిబిజిగా వ్రాసిపెట్టుకొన్న డిక్షనరీ నోట్సుల్లో నుంచి ఒక క్రమపద్ధతిలో ఫేర్‌కాపీ చేసేవాడు. ఈ ఫేర్‌కాపీ వ్రాత లండన్‌లోనే పూర్తిచేశాడు.

ఈ దశలోనే తెలుగు గ్రామర్ వ్రాయడం ప్రారంభించాడు. 1835 నవంబర్ 27 న వాల్టన్ హాల్ (డెర్బీషైర్) లో తెలుగు గ్రామర్ రచనకు ఉపక్రమించాడు. 1837 నవంబర్లో మొదటి ముసాయిదా వ్రాతప్రతిని పూర్తిచేశాడు. మధ్యలో స్ఫురించే మార్పులు చేర్పులు చొప్పిస్తూ వచ్చాడు.

బహుశా సెలవుమీద లండన్‌పోతూ తన వెంట తీసుకెళ్ళాడేమో అక్కడి రాయల్ ఏషియాటిక్ సొసైటీకి బ్రౌన్ రెండు వర్ణచిత్రాలు బహూకరించినట్లు 1835 డిసెంబర్ 5 న ఆ సొసైటీవారి తీర్మానం. ఏమిటా రెండు వర్ణచిత్రాలు? ఒకటేమో గోదావరి దగ్గర కోటిపల్లిలో నృత్యభంగిమలో వున్న వినాయక

శిల్పానికి చిత్రానుకృతి. రెండవది....కులీన వంశానికి చెందిన ఒక తెలుగు మహిళ చిత్రం. (ఎవరా కులీన తెలుగు మహిళ? ఏమా కథ? బ్రౌన్‌కేమి సంబంధం?—ఇవన్నీ ఆసక్తికరమైన ప్రశ్నలు మాత్రమే.)

ప్రొఫెసర్ రొసెన్ (Rosen) అనే ఆయన అభ్యర్థనపై సంస్కృత ఛందస్సు గురించి ఇంగ్లీషులో ఒక పెద్ద వ్యాసం వ్రాశాడు. Asiatic Journal లో ముద్రణైంది. ఒక పాంప్లెట్‌గా కూడా విడుదలైంది.

బ్రిటీష్ మ్యూజియం, బాడ్లియన్ గ్రంథాలయాల్లో వున్న కొందరు ల్యాటిన్ కవుల తాలూకు ప్రాచీన వ్రాతపతుల్ని పరిశీలించి వివరించి పెట్టాడు. ఆక్స్‌ఫర్డ్‌లో సంస్కృతం ప్రొఫెసర్ విల్సన్ కోర్కెపై ఇండియా హవుస్ లైబ్రరీలో ఒకమూల పడివున్న తెలుగు, కన్నడం, సంస్కృత వ్రాతప్రతుల్ని (మెకంజీ మేనుస్క్రిప్ట్స్, లేడన్ కలెక్షన్స్ కింద పరిగణింపబడ్తున్నవి) పరిశీలించి, విభజనగా ఒక ముసాయిదా క్యాటలాగ్ తయారుచేసి ఇచ్చాడు. వీటిని ఇక్కడ పడేసి పెట్టేబదులు మద్రాసుకు పంపిస్తే అక్కడ వీటికి బూజు దులిపే యోగం పడ్తుందనీ సలహా కూడా ఇచ్చాడు. ఈపని చేసి ఈ నిధిని బయటపెట్టినందుకు కోర్ట్ ఆఫ్ డైరెక్టర్స్ 1837 మార్చిలో బ్రౌన్‌కు అభినందనలు తెల్పుతూ ఒక తీర్మానం చేశారు.

1836 లో ఆక్స్‌ఫర్డ్‌లో ప్రొఫెసర్ విల్సన్‌కు అతిథిగా వున్నప్పుడు శక్తిపూజా విషయాలపై చర్చవస్తుంది. వీటిపై ఒక వ్యాసం వ్రాయమని బ్రౌన్‌కు సలహా ఇచ్చాడు. తెలుగు కావ్యాల్లోనుంచి వీటికి సంబంధించిన విశేషాలను ఏర్చి కూర్చివ్రాసిన ఒక చిత్తు వ్యాసం ఒకటి లండన్‌లోవుంది.

1837 లో ఫ్రెంచి—తెలుగు, తెలుగు—ఫ్రెంచి నిఘంటువుల తాలూకు వ్రాత ప్రతులు కనపడితే వాటిని 25 షిల్లింగులకు కొనిపెట్టాడు.

డ్రైడన్ చేసిన మార్పులతో షేక్స్పియర్ 'టెంపెస్ట్' నాటక ప్రదర్శన చూశాడు. అడ్డదిడ్డంగా చేసిన మార్పుల్ని చూచి షేక్స్పియర్‌ను హత్య చేసినట్లుగా మనస్సు చివుక్కుమన్నది. ఉండబట్టలేక, ఇదేమిటండోయ్ మహాప్రభో షేక్స్పియర్‌ను ఖూనీ చేస్తున్నారు—అని చీఫ్ యాక్టర్ మేక్రడీ (Macready) కి ఒక జాబు వ్రాశాడు. ఏం చేయమంటారు, ఈ మార్పులు ఒక సంప్రదాయంగా వస్తున్నాయి, ఇప్పట్లో చేయ కల్గిందేమీ లేదని జవాబు వ్రాశాడాయన. అయితే రెండేళ్ళ తర్వాత, డ్రైడన్ మార్పుల్ని

తొలగించి షేక్స్పియర్‌కు మోక్షం కల్గించారని తెల్సుకొని, తన సలహా ఆలస్యంగానైనా పనిచేసినట్లు బ్రౌన్ తృప్తిపడ్డాడు.

## కాల్డ్వెల్‌తో పరిచయం 1837

Mary Ann అనే నౌకలో ఆగస్టు 30 న లండన్ నుంచి ఇండియా బయలుదేరాడు. కానీ వోడ సముద్రంలోకి రావడానికి నెల పట్టింది. ఇంగ్లీష్ ఛానల్‌లో వుండగానే వాతావరణం మారిపోయింది. ప్రతికూలమైన గాలి, బ్రహ్మాండమైన వాన, గాఢాంధకారమైన చీకటి. ఒక ఫ్రెంచి వోడతో ఢీకొన్నది. అయితే బ్రౌన్ నౌక గట్టిదీ, ఆ ఫ్రెంచి వోడ కాస్త ఓటిదీ కావడంతో అది బుడుంగుమన్నది. అందులో చాలామంది ప్రాణాలు కోల్పోయారు. బ్రౌన్ వోడ మాత్రం బాగా సొట్టపోయింది. అదృష్టవశాత్తు ఎవరికీ ప్రాణ నష్టంలేదు. మరమ్మత్తులకోసం ప్లిమత్‌కు కుంటుకుంటూ వెళ్ళింది. ప్రయాణీకులంతా ప్లిమత్‌లోనే పక్షం రోజులపాటు గడపవలసి వచ్చింది.

ఈ వోడలో రాబర్ట్ కాల్డ్వెల్ (మున్ముందు బిషప్) కూడా ప్రయాణిస్తున్నాడు. బ్రౌన్‌తో పరిచయమేర్పరచుకొన్నాడు. స్నేహం ఏర్పడింది.'తెలుగు నేర్పుతాను, నేర్చుకుంటావా?' అని అడిగాడు కాల్డ్వెల్‌ని. 'అబ్బే, తెలుగు వద్దండీ, నన్ను తమిళదేశానికి మిషనరీగా వేశారు. తమిళం చెబితే నేర్చుకొంటాను.' అన్నాడు కాల్డ్వెల్. 'తమిళమా? ఒకరికి చెప్పగలిగేంత బాగా రాదే. అయితే రాజీగా ఒకటి చేద్దాం. సంస్కృతం చెప్తాను.నేర్చుకో, ఉత్తరోత్తరా ఎందుకైనా పనికిరావచ్చు.'—అని అన్నాడు బ్రౌన్. అంతే. రాజీ కుదిరింది. వోడ ప్రయాణంలో కాల్డ్వెల్‌కు వక్కా ముక్కా సంస్కృతం ముక్కలు నేర్పడం ప్రారంభించాడు. తాను ఎంత చెప్పాడో, కాల్డ్వెల్ ఎంత నేర్చుకొన్నాడోగానీ 20 ఏళ్ళ తర్వాత తమిళం, తెలుగు వగైరా ద్రావిడభాషలు సంస్కృత జన్యమైనవికావనీ, స్వతంత్ర ప్రతిపత్తి కలిగిన భాషా కుంటుబానికి చెందినవనీ విపులీకరిస్తూ ఒక పరిశోధన గ్రంథాన్ని కాల్డ్వెల్ వ్రాయవలసి వచ్చిందంటే ఒక వింత పరిణామంగానే తోచివుండాలి బ్రౌన్‌కు.

ఈ వోడలో బ్రౌన్‌తో ఏర్పడిన పరిచయాన్ని పురస్కరించుకునే కాల్డ్వెల్ దాదాపు 20 పేజీల్లో బ్రౌన్ వ్యక్తిత్వాన్ని గురించి చాలా 'క్రిటికల్ రిమార్క్స్' వ్రాసి పెట్టాడు తన జర్నల్‌లో. తొట్టతొలుత బ్రౌన్ తనకు ఒక పుంభావ సరస్వతిలాగా కనపడ్డాడని అంటూనే చాలా నిర్దాక్షిణ్యంగా అతని మనస్తత్వమూ, తత్వమూలోని వెలుగునీడల్ని విమర్శించాడు.

## 1838

సెలవు నుంచి తిరిగిరాక. జనవరి 7 వ తేదిన రిపోర్టు చేసుకొన్నట్లు గెజిట్ ప్రకటన. జనవరి 23న పర్షియన్ ట్రాన్స్‌లేటర్‌గా నియామకం నెలకు 400 రూపాయల జీతంతో. ఇదిగాక ప్రభుత్వ 'కోడ్'ను తెలుగులోకి తర్జుమా చేసే పనికూడా బ్రౌన్‌కు అప్ప గించాలనే ప్రతిపాదనను (దీని అనువాదానికి వేరేగా ఒక మొత్తంగా ప్రతిఫలం ఇచ్చే పద్ధతిన) మద్రాసు ప్రభుత్వం ఇండియా సుప్రీం గవర్నమెంటుకు (కేంద్ర పభుత్వానికి) పంపింది. మార్చి 2 న కాలేజీబోర్డు, నేటివ్ ఎజుకేషన్ కమిటీలకు ఆక్టింగ్ సెక్రెటరీ. అన్నీ ఇట్లాటి పార్ట్‌టైమ్ తాత్కాలిక (ఆక్టింగ్) ఉద్యోగాల్లోనే వుంచారు.

బ్రౌన్ డిస్మిసల్‌ను రద్దు చేస్తూ కోర్ట్ ఆఫ్ డైరెక్టర్స్ జారీ చేసిన ఫైనల్ ఆర్డర్‌లో ఏదో పొరపాటు దొర్లినట్లున్నది. లండన్‌నుంచి తిరిగొచ్చినతర్వాత తనకు న్యాయంగా రావలసిన హోదాలో సీనియారిటీనిబట్టి తన క్యాడర్‌ను పునరుద్ధరిస్తూ రెవిన్యూ• జుడీషియల్ శాఖల్లో సముచితమైన ఉద్యోగం ఇవ్వవలసిందిగా అగస్టు 23 న బోర్డ్ అఫ్ కౌన్సిల్ ప్రెసిడెంటుకు ఒక మెమోరియల్ పెట్టుకొన్నాడు. మెమోరియల్ పెట్టుకోవల్సింది కోర్ట్ ఆఫ్ డైరెక్టర్సుకుగానీ, బోర్డ్ ఆఫ్ కంట్రోల్‌కు కాదనీ, ఈ సవరణ చేసి మళ్ళీ పంపితే ప్రభుత్వం కూడా సానుభూతితో రెకమెండేషన్ చేస్తుందనీ పై అధికార్లు సెప్టెంబరు 4 న వ్రాశారు. దీనిమీద సెప్టెంబర్ 10 న మళ్ళీ కరెక్టు మెమోరియల్‌ను కోర్ట్ ఆఫ్ డైరెక్టర్స్‌ను సంబోధిస్తూ వ్రాసుకున్నాడు. ఇండియా హవుస్ సెక్రెటరీ తన రెకమెండేషన్‌ను జతపరిచి సెప్టెంబరు 15 న లండన్‌కు పంపాడు.

బైబిల్ న్యూ టెస్ట్‌మెంట్ (లూకా చేత వ్రాయబడిన యేసుక్రీస్తు శుభ సమాచారం) తెలుగు తర్జుమా ముద్రణ పూర్తయి విడుదలైంది.

సెప్టెంబర్ 25 న కాలేజిబోర్డు సభ్యత్వం. కేంబెల్ పూనిక వహించి తనకు ఈ సభ్యత్వం ఇప్పించినట్లు బ్రౌన్ ఒకచోట వ్రాసుకొన్నాడు.

ఇంగ్లెండ్‌లో వుండగా తాను రచించిన తెలుగు గ్రామర్‌ను అచ్చువేయమని కాలేజి బోర్డుకు మెరుగులుదిద్ది సమర్పిస్తే వాళ్ళు సుముఖతను ప్రదర్శించినట్లు లేదు. కేంబెల్ సానుభూతి ప్రదర్శించాడుగానీ బ్రౌన్ గ్రామర్ తన గ్రామర్‌కంటే పెద్ద బ్రహ్మాండ మేమీ కాదని తలచినట్లున్నది. డిసెంబర్ 21 న మరో బోర్డు సభ్యుడు మారిస్‌తో మాట్లాడితే 'నీ గ్రామర్‌ను సిఫారసు చేసి కేంబెల్ అసంతృప్తిని కొనితెచ్చుకోలేనని,

అయితే ఇప్పుడు నీవూ కాలేజీ బోర్డు సభ్యుడవు కాబట్టి, సహసభ్యునిపట్ల అంత కఠినంగా ప్రవర్తించడం బాగుండదు గనుక మౌనంగా వుండిపోతానని' చెప్పాడట. ఎట్లయితేనేం ఈ మలగులాలమధ్య విసిగిపోయిన బ్రౌన్ తన గ్రామర్ వ్రాతప్రతిని తిరిగి తీసేసుకొన్నాడు.

## 1839—45

జనవరి 22 న మద్రాసులోని సదర్ అండ్ ఫౌజ్ దారీ అదాలత్ కోర్టులకు ఆక్టింగ్ రిజిస్టర్. జీతం ఫిక్సేషన్‌దగ్గర సివిల్ ఆడిటర్ ఏదో పేచిపెట్టినట్లున్నాడు. మళ్ళీ బోర్డుకు ఒక పిటిషన్ పెట్టుకొన్నాడు. సబ్‌సిస్టెన్స్ అలవెన్సులుగాక, ఈ రిజిస్టర్ ఉద్యోగంలో వున్నంతదాకా నెలకు 700 రూపాయలు డెప్యూటేషన్ అలవెన్సుగా జీతం ఇవ్వాలని ఆర్డర్ జారీ చేశారు. మే 14 న మద్రాసులోనే ఆక్టింగ్ సూపరింటెండెంట్ ఆఫ్ గవర్నమెంట్ లాటరీస్.

వేమన పద్యాల రెండో ఎడిషన్ ముద్రించి విడుదల చేశాడు.

Madras Journal of Literature and Science అనే పత్రికకు కో_ఎడిటర్ (బ్రౌన్‌తోపాటు మరో ఎడిటర్ ఆర్. కోల్, R. Cole). ఈ పత్రికలో వరసగా కొన్ని వ్యాసాలు వ్రాసి ప్రచురించాడు : 1839 జూలై-డిసెంబర్, 1840 సంచికల్లో Essay on the Language and Literature of the Telugus అనే సీరియల్ వ్యాసం. తర్వాత ఇదే వ్యాసం కొద్ది మార్పులతో తగ్గింపులతో Asiatic Journal (1840 - 41) లో కూడా పునర్ముద్రణైంది. 1840 జనవరి సంచికలో Essay on the Creed, Customs and Literature of the Jangams అనే మరో పెద్ద వ్యాసం. 1840 అక్టోబర్ సంచికలో Account ot the Basavapuran; - the principle Book used as a religions code by the Jangams అనే వ్యాసం. 1840 జూలై లో Notices of some Roman Catholic Books existing in the Telugu Language, 1840 ఏప్రిల్‌లో Notice regarding the sects of Hindus called Tengala and Vadagala అనే వ్యాసం—ఇట్లా వరసగా ఇదే పత్రికలో ప్రకటితమయ్యాయి. అంతేకాదు, మరాటీ బ్రాహ్మణులకు సంబంధించి మెకంజీ కైఫీయత్‌ను ఇంగ్లీషులోకి తర్జుమాచేసి ఇదే పత్రికలో 1844 డిసెంబర్ (నెం-31) సంచికలో ప్రకటించాడు.

1839 డిసెంబర్లో దాదాపు 4 వ ఆశ్వాసంవరకు జరిగిన వసుచరిత్ర ముద్రణ ఆగిపోయి నట్లు వర్త్యేంకు బ్రౌన్ వ్రాసిన జాబునుబట్టి (చూడు పేజీలు 52-53) తెలుస్తున్నది. 'చెన్నపట్నపు వృత్తాంతి' అనే తెలుగు పత్రికలో బ్రౌన్ సేకరించి పెట్టిన జ్యోతిష, వైద్యశాస్త్రగ్రంథాల గురించిన వివరం అచ్చయినట్లు రాజమండ్రినుంచి బొమ్మరాజు నాగేశ్వరరావు 1839 సెప్టెంబర్ 8 న వ్రాసిన జాబునుబట్టి తెలుస్తున్నది.

ఎవరైనా జంతుశాస్త్రజ్ఞులకు వుపయోగకరంగా వుంటుందని 1838—1839 జనవరి మధ్యకాలంలో ఒక పెద్ద బరిణపురుగును మద్రాసు లిటరరీ సొసైటీ మ్యూజియమ్‌కు బహూకరించాడు. బ్రౌన్ డిస్మిసల్ వుత్తర్వును లండన్ కోర్ట్ ఆఫ్ డైరెక్టర్స్ రద్దు చేస్తూ జారీచేసిన ఆర్డర్‌లో జడ్జిగాగానీ మేజిస్ట్రేట్ (కలెక్టర్)గా గానీ జుడిషియల్—రెవిన్యూశాఖల్లో పోస్టింగ్ ఇవ్వరాదనే ఒక షరతు పెట్టినట్లున్నారు. ఈ షరతును సడలించవలసిందిగా 1840 ఫిబ్రవరి 7 న లండన్‌కే మరో మెమోరియల్ పెట్టు కొన్నాడు. ప్రభుత్వ సిఫారసుతో ఇండియా హవుస్ సెక్రెటరీకి ఫిబ్రవరి 22న ఫర్వార్డ్ అయింది.

1840 మార్చి 31 న మద్రాసులోనే జె సి. మారిస్ లీవ్ స్థానంలో సివిల్ ఆడిటర్ & సూపరింటెండెంట్ ఆఫ్ స్టాంప్స్.

తెలుగు గ్రామర్ (మొదటి ముద్రణ) ముద్రణపూర్తయి 1840 ఆఖరులో విడుదలైంది. బ్రౌన్ మహాభారతం ఆదిపర్వం అచ్చువేయిస్తున్నట్లు, ముద్రణ కొంత దూరం జరిగున్నట్లు పురాణం హయగ్రీవ శాస్త్రి వ్రాసిన జాబును బట్టి అర్థమవుతుంది. Dialogues in English and Telugu అనే గ్రంథం (మొదటి ఎడిషన్) కూడా ఈ సంవత్సరమే ప్రకటించినట్లున్నాడు.

1841 లో రాఘవ నల చక్రవర్తి ద్విపద కావ్య ముద్రణ పూర్తిచేయించాడు. '42 లో గౌరన హరిశ్చంద్రోపాఖ్యానం. నవనాధ చరిత్ర ద్విపద కావ్యాలను అచ్చువేయించి విడుదల చేయించాడు. ఈ పుస్తకం లోపలి పేజీల్లోవున్న ప్రకటననుబట్టి 'భారతం ఆదిపర్వం' ఇంకా అచ్చు జరుగుతూన్నట్లే వుంది. 1842 ఆగస్టు 4, 18 తేదీల 'వర్తమాన తరంగిణి' సంచికల్లో ప్రకటితమైన తెలుగు ముద్రణ గ్రంథాల వ్యాపార ప్రకటనలో 'ఆదిపర్వము వెల 8 రూపాయలు'కు దొరుకుతుందని వున్నది కాబట్టి అంతకు కొద్దికాలం క్రితమే దాని అచ్చు పూర్తి చేయించి విడుదల చేయించాడని అనుకోవచ్చు. ఈ తెలుగు ముద్రణ గ్రంథాల జాబితా ప్రకటనలోని పద్యకావ్యాలు,

శతకాలలో నూటికి తొంభై పాళ్ళు బ్రౌన్ తయారుచేయించిన శుద్ధప్రతుల ఆధారంతోనే వచ్చినవై వుండాలి. సందేహంలేదు.

1841 ఫిబ్రవరి 12న మద్రాసు ఆక్టింగ్ కలెక్టర్ ఆఫ్ సీ కస్టమ్స్. ఆగస్టు 31 న ఆక్టింగ్ పోస్ట్‌మాస్టర్ జనరల్. ఇంకా ఆక్టింగ్ వుద్యోగాలే.

1843 జూలై 31 న కాలేజీబోర్డు ఆక్టింగ్ సెక్రెటరీ. సెప్టెంబర్ 29 న మద్రాసు యూనివర్సిటీ బోర్డుకు సెక్రెటరీ.

1844 లో మద్రాసులో కూడా ఒక ఫ్రీ స్కూల్‌ను నిర్వహించడం ప్రారంభించాడు. ఇంగ్లీషు, తెలుగు, తమిళం చెప్పించేవాడు. ఇంచుమించు 80 మంది పిల్లలు చదువుకొనేవారు. ఏడేళ్ళు నడిపాడు. గట్టిగా అజమాయిషీ చేయడం వీలుగానందువల్ల నిర్వహణలో దొంగలెక్కలూ అవీ బయటపడ్డంతో ఈ స్కూళ్ళను (కడప, మచిలీపట్నంలోవి కూడా) రెవరెండ్ క్రిశ్చియన్ అరులప్పన్‌కు అప్పగించడం జరిగింది.

1844 లో వసుచరిత్ర సవ్యాఖ్యాన ప్రతి ముద్రణ పూర్తయి విడుదలైంది. తన డిక్షనరీల ముద్రణకు ఎస్.పి.సి.కె. తో ఒక ఒడంబడిక కుదిరింది. జూలై ఆగస్టులో ముద్రణ ప్రారంభమైనట్లున్నది. డైసెసన్ కమిటీవారు మూడు డిక్షనరీలను, అంటే, తెలుగు–ఇంగ్లీషు, ఇంగ్లీషు-తెలుగు, మిశ్ర నిఘంటువు ఒక్కొక్కటీ రెండేసివేల కాపీలు అచ్చువేయాలి. 'కంట్రీ షీప్' బైండ్ కాపీలు వెయ్యి బ్రౌన్‌కు ప్రతిఫలంగా ఇవ్వాలి. మిగతా కాపీలన్నీ డైసెసన్ కమిటీవారు అమ్ముకోవచ్చు. బ్రౌన్‌కు ఇచ్చే వెయ్యికాపీలు రెండు దఫాలుగా అందజేయాలి. కమిటీవారు 1422 కాపీలు అమ్మకం చేసుకొన్న మీదట, బ్రౌన్‌కు మొదటి దఫాగా 568 కాపీలు ఇవ్వాలి. రెండోదఫా కింద ఇవ్వాల్సిన 432 కాపీలు మిగిలిన కాపీలు అమ్మకం జరిగిన తర్వాత. ఇవీ షరతులు. (ఈ షరతులు మార్చమని బ్రౌన్ పదేపదే కమిటీని కోరాడు కాని, కమిటీవారు అందుకు అంగీకరించలేదు. మూడేళ్ళలో ముద్రణ పూర్తవుతుందనుకుంటే, ఆరేళ్ళకు పైన పట్టింది. పుస్తకం ప్రింటవుతున్నప్పుడు ప్రూఫుల్లో విరివిగా మార్పులు చేయడం, ఎక్కువ భాగం మళ్ళీ మళ్ళీ వ్రాయవలసి రావడంతో ఈ జాప్యం జరిగింది. అంతా కల్సి ఇంచుమించు వెయ్యిపేజీల్లో అయిపోతుందనుకొంటే తీరా చూసుకుంటే మూడు వేల పేజీలదాకా దేకింది. ఇవన్నీ ఆలస్యానికి కారణాలు అంటుంది డైసెసన్ కమిటీ).

లండన్ ఇండియా ఆఫీస్ లైబ్రరీలో లోగడ బ్రౌన్ బయటపెట్టిన వ్రాతప్రతుల గుట్టలను 'డ్యూక్ ఆఫ్ కార్న్‌వాల్' అనే వోడలో 1844 లో మద్రాసుకు పంపించారు.

మద్రాసు లిటరరీ సొసైటీకి వీటిని చేర్చారు. బ్రౌన్ వీటిని అక్కడ విభజనగా అమర్చి పెట్టించాడు. తన బాధ్యత పెంచుకొన్నాడు.

1845 జనవరి 27 న మద్రాసు లిటరరీ సొసైటీవారికి తన సొంత గ్రంథాలయంనుండి దేశభాషల్లో వున్న 2,440 వ్రాతప్రతుల్ని (తాటాకు ప్రతులను కూడా కలిపి) బహూకరించాడు. వీటిలో ఎక్కువగా తెలుగు, సంస్కృతం ప్రతులే చేరివున్నాయి. కన్నడం, మలయాళం, బెంగాలీ, బర్మీస్ బాషలవికూడా వున్నాయి. అప్పట్లో వీటివిలువ ఎంత హీనంగా వేసినా 30 వేల పైచిలుకు రూపాయలుంటుందని బ్రౌనే అందాజుగా అంచనా వేసి చెప్పాడు. (ఇంతటితో సరిపెట్టుకోకుండా 1855 దాకా అప్పుడు కొన్ని అప్పుడు కొన్ని చొప్పున బహూకరిస్తూనే వచ్చాడు. అంటే ఈ లెక్కన మొత్తం 4 వేల పైచిలుకు వ్రాతప్రతులు ఇచ్చి వుంటాడనుకోవచ్చు). ఫిబ్రవరి 1 తేదీన జరిగిన సొసైటీ సర్వసభ్య సమావేశంలో బ్రౌన్ గావించిన ఈ బృహత్ బహూకరణకు ఆయన్ను ప్రత్యేకంగా అభినందిస్తూ కృతజ్ఞతలు తెలుపుతూ ఒక తీర్మానం చేశారు. ఈ తీర్మానాన్ని జె. పి. మారిస్ ప్రతిపాదిస్తే, వాల్టర్ ఇలియట్ బలపరిచాడు. బ్రౌన్ ఊరకే బహూకరించడం గాకుండా ముగ్గురు పండితుల్ని కూడా నియమించి మొత్తం లైబ్రరీకి కేటలాగ్‌లు తయారు చేయించాడు. [ఈ లైబ్రరీనే కొన్నాళ్ళకు కాలేజి లైబ్రరీకి తరలిస్తారు. ఆ తర్వాత విడిగా ఇప్పటి మద్రాసు ప్రభుత్వ ఓరియంటల్ మేనుస్క్రిప్ట్స్ లైబ్రరీగా అవతరిస్తుంది. వీటిలో చాలావరకు నేటికీ అక్కడ భద్రంగా వున్నాయి. కొన్ని మహా శిధిలావస్థలో వున్నాయి. కొన్ని తాళపత్ర ప్రతులు మాత్రం తిరుపతి ఓరియంటల్ ఇన్‌స్టిట్యూట్‌కి తరలించడం జరిగింది]. బ్రౌన్ దగ్గర్నుంచి రాక్స్‌బర్గ్ "ఫ్లోరా ఇండికా" అనే గ్రంథాన్ని 36 రూపాయలకు కొనడానికి 1845 డిసెంబర్ 9 తేదీన లిటరరీ సొసైటీ మేనేజింగ్ కమిటీ ఒక తీర్మానం ఆమోదించింది. వ్రాత ప్రతుల బహూకరణ తర్వాత, బ్రౌన్ ఆ మందట్లోనే ఇంచుమించు 250 ఇంగ్లీషు గ్రంథాలను కూడా ఇదే లిటరరీ సొసైటీకి ఇచ్చివేశాడు.

### చరిత్ర సామగ్రి సంరక్షణ

మద్రాసు కాలేజీలోనూ, లండన్‌నుంచి వచ్చిన వ్రాతప్రతుల్లోనూ వుండే 'మెకంజీ కైఫీయతులను'ను ఏరి, దుమ్ముగొట్టుకొని పురుగుల వాతపడి శిధిలమైపోతుంటే మళ్ళీ దళసరి కాగితాలమీద కరక్కాయసిరాతో సొంత డబ్బు ఖర్చుపెట్టి కాపీవ్రాయించి చరిత్రకు మూలాధారమైన ఈ వేలాది కైఫీయతులు కాలగర్భంలో కలిసిపోకుండా

పునరుద్ధరించి పెట్టాడు. ఇవే నేడు మద్రాసు ఓరియంటల్ మేనుస్క్రిప్ట్స్ లైబ్రరీలో వున్న వందలాది 'లోకల్ రికార్డ్స్' (కైఫీయత్తుల) వాల్యూములు.

### పరిపాలనా పదజాలం

ఇండియాలో జుడీషియల్, రెవిన్యూ పరిపాలనలో వచ్చే పదజాలానికి సంబంధించి ఒక డిక్షనరీ రూపొందించాలని 1842 లో లండన్ కోర్ట్ ఆఫ్ డైరెక్టర్స్ ఉత్తర్వులు జారీ చేశారు. బొంబాయి, కలకత్తా, మద్రాసు ఇట్లా ఒక్కో రాష్ట్రంలో ఒక్కొకరికి ఈ వ్యవహారం అప్పగించారు— పదాల సేకరణకు, అర్థాల సరఫరాకు. తమ తమ రాష్ట్రాల్లో వీరు వివిధ జిల్లాలనుంచి, తాలూకాల్లోనుంచి అధికార్లకు వ్రాసి పదాలు సేకరించి అర్థాలు వ్రాయాలి. మద్రాసు రాష్ట్రానికి సంబందించినంతవరకు ఈ పని బ్రౌన్‌కు అప్పగించారు. నాలుగైదేళ్ళపాటు బ్రౌన్ ఈ పనిలో కృషి చేయవలసి వచ్చింది. వేలాది పదాలు సేకరించి అర్థాలతో సహా పంపాడు. ఈ అనుభవంతోనే తర్వాత తాను సొంతంగా 'జిల్లా డిక్షనరీ'ని ప్రకటించాడు. ఆ తర్వాత లండన్‌నుంచి ప్రకటింపబడిన గ్లాసరీ ఆఫ్ జుడీషియల్ అండ్ రెవిన్యూ టర్మ్స్‌లోకి బ్రౌన్ పంపిన పదాలు, ఈ జిల్లా డిక్షనరీ వినియోగమయ్యాయి.

### ఆర్థిక ఇబ్బందులు, దానధర్మాలు, 'ప్రొహిబిషన్'

డబ్బుబాధలు ఎప్పుడూ వెన్నాడుతూనే వుండేవి. ప్రతి పైసాను కూడబెట్టి తన కింద పనిచేసే తెలుగు పండితులకు జీతాలు చెల్లిస్తూ, చేసిన అప్పులు తీర్చుకొంటూ వచ్చాడు. ఆర్థికంగా కటకటలాడుతున్నప్పుడు కూడా పుస్తక ప్రచురణ పథకాలకు నెలకు రెండు మూడు వందలైనా ఖర్చవుతుండేది. ఎప్పటికైనా కాలం కల్సిరాకపోతుందా కష్టాలు గట్టెక్కకపోతాయా అనే ఆశతో బ్రతికేవాడు. కాలం కల్సివచ్చి కష్టాలు గట్టెక్కే నాటికి, 60 వేల రూపాయలు అప్పుకింద చెల్లించవలసి వచ్చింది! ఇందులో సగానికి పైగా వడ్డీయే!

ఒక ఇంగ్లీషు వ్యాపారి దగ్గర అప్పుపెట్టేవాడు. అతన్ని తన ట్రస్టీగా నియమించు కొన్నాడు. ఋణబాధ పూర్తిగా తీరిపోయేదాకా, నెలనెలా అతను బ్రౌన్ బాకీలకింద రెండువేలకు పైగా చెల్లిస్తూ వచ్చాడు. ఇట్లా ఋణవిముక్తి పొందినందుకు దేవుడికి కృతజ్ఞతలు చెప్పుకొన్నాడు. కృతజ్ఞతా సూచకంగా తన సంపాదనలోనుంచి పేదసాదకు చేతనైన సాయం చేసేవాడు. జైలుశిక్ష అంటే బ్రౌన్‌కు వల్లమాలిన

భయమట. తన కొలువులో వుండే ఒక ముదుసలి ముస్లిం మున్షీకి వెయ్యి రూపాయ లిచ్చి ఆదుకొన్నాడు. తన జీతబత్తేల్లో రూపాయకు పైసా చొప్పున (అప్పట్లో రూపాయకు 192 పైసలు. నెలకు మూడువేల జీతం వస్తుంటే దాదాపు 15 రూపా యల లెక్కన) నెలనెలా 100-130 మంది గుడ్డి కుంటి మొదలైన వికలాంగు లకు ఇస్తూ వచ్చేవాడు. ఒకసారి, అప్పులపాలై జైలుపాలైన పదకొండుమందికి 355 రూపాయలిచ్చి విడిపించాడు. ఒకదశలో నెలకు సగటున 500 రూపాయలు దానధర్మాల కింద ఖర్చవుతుండేది.

వివిధ ధర్మసంస్థలకు సభ్యుడుగా వుంటూ వచ్చాడు. అయిదేళ్ళలో పాతబాకీలు చంచాలు చెల్లించి వేశాడు. తన తండ్రి 1812 లో చనిపోయినప్పుడు తన తల్లికి సంక్రమించిన కలకత్తాలోని ఒక ఓల్డ్ చర్చి ఇవాంజెలికల్ ఫండ్‌కు పూర్తి బాకీకింద 4 వేలు చెల్లించి వేశాడు. తన సోదరుడు జార్జి తన భాగాన్ని చాలా ముందుగానే కట్టివేశాడు.

ఇట్లా డబ్బుబాధలు, వొత్తిళ్ల మధ్య 50 వ ఏటిదాకా లాక్కొచ్చాడు. 51 వ ఏటినుంచీ వైన్లు గియిన్లు వగైరా మద్యపానాలకు పూర్తిగా స్వస్తి చెప్పి గట్టిగా 'ప్రొహిబిషన్' విధించుకొన్నాడు. ఎన్ని పనుల్లో వున్నా ఆదివారాలు మాత్రం నియమంగా పాటించే వాడు. 'శాబత్'ను వుల్లంఘించేవాడు కాదు. నిఘంటువుల ముద్రణప్పుడు కూడా ఆదివారాలు పనులు మానుకొనేవాడు.

## 1846—55

1846 జూలై 3 న మద్రాసులో పోస్ట్‌మాస్టర్ జనరల్‌గా స్థిరమైన ఉద్యోగంలో నియ మితుడయ్యాడు. 1 న తెలుగు ట్రాన్స్‌లేటర్‌గా చార్జి తీసుకోగానే ఫోర్ట్ సెంట్ జార్జి గెజిట్‌లో వస్తున్న ప్రభుత్వ తెలుగు ప్రకటనల అచ్చు అంత బాగుండడంలేదనీ, తెలుగు టైప్స్ (అక్షరాలు) అరిగిపోయినట్లు కనపడుతున్నాయనీ, మంచి టైప్స్ పోత పోయించమని బ్రౌన్ ప్రభుత్వానికి వ్రాస్తాడు. అందుమీదట గెజిట్ ప్రెస్ ఆఫీసు సూపరింటెండెంట్ మొత్తం 32 తెలుగు అక్షరాలకు టైప్స్ అరిగిపోయిన మాట వాస్తవమేననీ, వీటిని మళ్ళీ కొత్తగా పోతపోయించడానికిగాను ప్రెస్ ఆఫీసులో స్టాక్‌లోవున్న మెటల్ ఖరీదుగాక 48 రూపాయలు ఖర్చవుతుందనీ ఒక ప్రతిపాదన పంపి అందుకు తగిన ఏర్పాట్లు చేయిస్తాడు. అంటే, తెలుగు ముద్రణ అందచందాల విషయంలో బ్రౌన్ ఎంతటి శ్రద్ధాసక్తులు కనపరిచేవాడో ఈ చిన్న సన్నివేశం తెలుపుతుంది.

కళాప్రియుని దర్జాలు, దర్పాలు

కాస్త సుఖవంతమైన పరిస్థితులు ఏర్పడి కుదుటపడ్డంతో అతిథి మర్యాదలు మళ్ళీ మొదలయ్యాయి. సాధారణంగా 20 కి మించి గెస్టులు రాకపోయినా, దుబారా ప్రియుడనీ, తనకు డబ్బంటే మంచినీళ్ళ ప్రాయమనీ మిత్రులు చెప్పుకొనేవారట. తనకు వచ్చే గెస్టులు తిరిగి ఆతిథ్య మివ్వగలిగే స్తోమతకల్గినవారు కాదట. పెద్ద లంకంత ఇంటికి మారాడు. కొంతకాలం వేపేరీలో వుండేవాడు. అందమైన చలవరాతి విగ్రహాలతో అలంకరించాడు బంగళాను. ఇంకో 70 తైలవర్ణచిత్రాలు — ముఖ్యంగా ఇంగ్లీషు, డచ్, ఇటాలియన్ ప్రకృతి దృశ్యాలు; ఇవిగాక వందకు పైగా ఇతర చిత్రాలు. రెండు స్వారీ బండ్లు, ఆరు గుర్రాలు వగైరా తతంగమంతా వుండేది. ఇక తన డైనింగ్ టేబుల్ గవర్నర్ ఇంట్లో దానికంటే జిగేల్మనేదని వ్రాసుకొన్నాడు.

తన సొంత లైబ్రరీలో ఇంగ్లీషు, ఫ్రెంచి, ల్యాటిన్ తదితర గ్రంథాలు నాలుగు వేలు వుండేవి. ఒక్క యూరప్ చరిత్ర పైన్నే నాలుగు వందలు పైగా వుండేవట. 30 సెట్ల మ్యాపులు అవీ వుండేవి.

పోస్ట్‌మాస్టర్ జనరల్ పదవిలోకి రాగానే — కౌన్సిల్ ఆఫ్ ఎజుకేషన్ మెంబర్, మద్రాసు బ్యాంక్‌కు గవర్నమెంట్ డైరెక్టర్, మద్రాసు కాలేజి లైబ్రరీలో వ్రాతప్రతుల క్యురేటర్ — ఈ జీతంలేని మూడు ఉద్యోగాలు కూడా బ్రౌన్‌ను వరించాయి.

వివాదాల్లో చిక్కుకొన్న బ్రౌన్

ఈ దశలో బ్రౌన్ పెక్కు వివాదాలలో చిక్కుకోవలసి వచ్చింది. పరీక్షల విధానం. తెలుగు సిలబస్, విద్యార్థుల్ని పరీక్షించే పద్ధతులు—వీటికి సంబంధించి అడుగడుగునా దాదాపు ఏటేటా కాలేజి బోర్డులోని మిగతా సభ్యులతో బ్రౌన్ విభేదాలు తారస్థాయి నందుకునేవి.

మద్రాసులో నెమ్మదిగా రాజుకో ప్రారంభించిన నేషనలిజం భావజాలపు వీచికలు, ఒక విధమైన 'హిందూ' రివైవలిజం ఛాయలు, క్రైస్తవ మతాంతరీకరణలకు సంబంధించి ప్రభుత్వ ప్రత్యక్ష పరోక్ష సహాయాలు, నేటివుల ప్రతిఘటనలు, ఘర్షణలు, కోర్టు తీర్పులు, గాజుల లక్ష్మీనరసుసెట్టి ప్రభృతుల మద్రాసు నేటివ్ అసోసియేషన్ తరఫు రాజకీయ పోరాటాలు — వీటిమధ్య సదర్ అదాలత్ కోర్టు జడ్జి ఎమ్. లెవిన్ (M. Lewin)ను గవర్నర్ డిస్మిస్ చేయడంతో — ఆయన (లెవిన్) మద్రాసు

హిందూ నేటివ్‌ల దృష్టిలో ఆరాధ్యుడుగా వున్న తరుణంలో, ఈ లెవిన్ పేర ఒక జాబు వస్తే, ఆ జాబులోని విషయాలను పోస్ట్‌మాస్టర్ జనరల్‌గా బ్రౌన్ చదివి ఒక మిత్రుడికి అందజేశాడనీ, దానిమీదట ఏదో అతనికి సంబంధించిన సమాచారమొకటి బయటికి పొక్కిందనీ, 1847 మార్చి 18 నాటి 'అట్లాస్' అనే పత్రికలో ప్రచురితమైన ఈ లెవిన్ గొడవలకు సంబంధించిన రచనకు కర్త బ్రౌన్ అయివుంటాడనే ఆరోపణ చేస్తూ ప్రభుత్వానికి పిర్యాదు చేస్తాడు లెవిన్. దీనిమీదట బ్రౌన్ సంజాయిషీ ఇచ్చు కోవడం వగైరా తతంగం అంతా జరుగుతుంది. 'ఎతినీయమ్' పత్రిక 1847 జనవరి 30 సంచికలో కూడా ఇట్లాటి ప్రభుత్వాధికారులకు వచ్చే జాబుల్లోని కొన్ని ఆంతరంగిక అధికార విషయాలు బయటకు ఇట్టే పొక్కిపోతున్నాయనీ, ఇందులో పోస్టల్ స్టాఫ్ నిర్వహిస్తున్న పాత్రను శంకిస్తూ ఒక వ్యాఖ్యవస్తే పోస్ట్‌మాస్టర్ జనరల్‌గా ఆ పత్రిక ఎడిటర్‌కు రుజువులు చూపమని కోరుతూ గట్టిగా ఒక జాబు వ్రాస్తాడు.

ఈ అట్టుడికిపోతున్న మద్రాసు రాజకీయ వాతావరణ నేపథ్యాన్ని రాజధానినగరంలో వుంటూ సన్నిహితంగా పరిశీలించే అవకాశం వున్నవాడు గనుకనే బ్రౌన్ ఈ కాలంలో వివిధ అంశాలపై గుప్తంగా ముసుగుపేర్లతో మద్రాసు పత్రికల్లో కొన్ని వ్యాసాలు వ్రాసినట్లే వున్నాడు. మిన్నెసోటా వ్రాతప్రతిలో ఇట్లా వ్రాసున్నాడు: "...I also wrote a number of essays which were printed in the Newspapers. Some were on education, others on Hindu customs and prejudices or on various themes which possessed a temporary interest; and in particular I printed a series of remarks on the Roman Catholic idolatry: which made some noise."

ఇక క్రిశ్చియన్ వర్గాల్లో — బైబిల్‌ను తెలుగులోకి తర్జుమా చేసే విషయంలో సైతం బ్రౌన్ పెక్కు విమర్శలు — ప్రతి విమర్శనలను ఎదుర్కోవలసి వచ్చింది. క్యాథలిక్కులు, ప్రొటెస్టెంట్లమధ్యగల—ఈ విభేదాల ప్రభావంకూడా వీటిల్లో అంతర్లీనంగా పని చేయకపోలేదు. బ్రౌన్ ప్రొటెస్టెంటే అయివుండాలి. మంగళగిరి ఆనందాఖ్యుని వేదాంత రసాయన కావ్యానికి రెవరెండ్ ఫాదర్ జె. ఏలన్ (Rev. Fr. J. Aelen, Nellore, 1969) వ్రాసిన అవతారికలో బ్రౌన్ గురించి ఇట్లా వ్రాసున్నాడు: 'As to his (Brown's) other remarks it must be noted that Brown was a staunch Protestant and showed in more than one place his dislike for things Catholic..." బ్రౌనే స్వయంగా చెప్పుకొన్నట్లు తాను రోమన్

క్యాతలిక్కులపై వ్రాసిన వ్యాసాలపై జరిగిన తర్జన భర్జనలను పరిశీలించనిదేగానీ బ్రౌన్ తత్వాన్ని గూర్చి సరిగా అంచనా కట్టలేం.

ఇక మద్రాసు కాలేజి తెలుగు ఎగ్జామినర్‌గా ఎన్ని వివాదాల్ని రేకెత్తించాడో గదా.

తాను లోగడ తయారుచేయించిన పోతన ఆంధ్ర మహాభాగవతం శుద్ధప్రతి ఆధారంతో పురాణం హయగ్రీవశాస్త్రి ముద్రణ పూర్తిచేసి (1848) విడుదల చేస్తాడు.

1849. మెకంజీ వ్రాతప్రతుల్లో తారసిల్లిన ఒక మరాటీ ప్రతిని ఇంగ్లీషులోకి తర్జుమా చేసి విపులమైన వ్యాఖ్యాన వివరణలు చేర్చి Memoirs of Hyder Ali & Tippu-sultan... అనే గ్రంథాన్ని ప్రచురించాడు. దీన్ని తెలుగులోకి కూడా తర్జుమా చేయించి పెట్టాడు. (ఈ హైదరాలీ.... గ్రంథానికి బ్రౌన్ వెలువరించిన ఇంగ్లీషు ముద్రణను గమనించకుండానే ఈ వ్రాతప్రతికి కర్తఅయిన బ్రౌన్ పేరు చెప్పకుండానే, ప్రఖ్యాత చరిత్రాచార్యులు నేలటూరు వెంకటరమణయ్యగారు చాలా ఇటీవల 1955 లో 'హైదరుచరిత్ర' అనే పేరుతో ప్రకటించారు. అనవసరంగా మళ్ళీ తన సొంత ఇంగ్లీషు తర్జుమాను కూడా జతపర్చారు. తర్జుమాలోనూ, చారిత్రకాది వివరణలు సమకూర్చడంలోనూ బ్రౌన్ మార్గానికి నేలటూరివారిది ఎందునా సరితూగదని రెంటినీ పోల్చి చూస్తే తెలుస్తుంది.)

ముమ్మరంగా పుస్తకాల ముద్రణ

ఈ దశలో ఎన్ని పుస్తకాలు ప్రకటించాడో లెక్కలేదు. 'సైక్లిక్ టేబుల్స్ ఆఫ్ హిందూ అండ్ ముసల్మాన్ క్రానాలజీ' అనే గ్రంథాన్ని ప్రచురించాడు. తెలుగు రీడర్‌ను మూడు వాల్యూములుగా ప్రచురించాడు. వాక్యావళి, డైలాగ్స్ — వీటినీ మళ్ళీ రివైజ్‌చేసి పునర్ముద్రించాడు. డైలాగ్స్‌ను తమిళం, కన్నడంలోకీ; వాక్యావళిని తమిళం, హిందూస్తానీలోకీ అనువాదంచేసి ముద్రించాడు. హిందూస్తానీ ఫ్రేజియాలజీ అనే గ్రంథాన్ని 1846 లో ప్రకటించాడు. ఇంగ్లీషు ఇర్రెగ్యులర్ వెర్బులను తెలుగులో వివరిస్తూ ఒక పుస్తకం వేశాడు. తాతాచారికథలు, వార్స్ ఆఫ్ ది రాజాస్— ఈ రెండింటినీ తెలుగులోనూ ఇంగ్లీషులోనూ విడివిడిగా ప్రకటించాడు. 600 పేజీల 'ఎఫిమరీస్' గ్రంథాన్ని విడుదలచేశాడు. కడపజిల్లా ప్రొద్దుటూరు తాలూకా రామేశ్వరం గ్రామకరణీకం (మిరాశీహక్కు) వివాదానికి సంబంధించిన దావా రికార్డునంతట్నీ పరిశీలించి, ఎడిట్‌చేసి మిరాశివాదం : Disputations on village business అనే గ్రంథాన్ని ఇంగ్లీషు తర్జుమాతో సహా రెండు సంపుటాలుగా ముద్రించాడు. ఎల్లిస్,

బ్లాక్‌బర్న్, మన్రో నివేదికల్లోనుంచి (ప్రభుత్వ రికార్డుల్లోనుంచి) తీసి 'త్రీ ట్రీటైసెస్ ఆన్ మిరాసీ రైట్' అనే మరో గ్రంథాన్నికూడా ప్రకటించాడు. (ప్రభుత్వం అనుమతి లేకుండా ఇట్లా ప్రభుత్వ రికార్డుల్లోనుంచి ప్రభుత్వోద్యోగిగా ప్రకటించినందుకు ప్రభుత్వం బ్రౌన్‌ను మందలిస్తుందికూడా). బైబిల్ ప్రార్థనగీతాల (Psalm LXVII)ను తెలుగు పద్యగద్యల్లోను, కన్నడవచనంలోనూ అనువాదంచేసి ముద్రించి 1851 లో 'లండన్ గ్రేట్ ఎగ్జిబిషన్'లో ప్రదర్శనకోసం పంపుతాడు. గరుడాచలమహాత్మ్యం (యక్షగానం) కూడా ప్రింట్ చేశాడు. వైజయంతీ విలాసం వ్యాఖ్యానంతో సహా ముద్రించాడు. 1852-54 మధ్య తన డిక్షనరీలన్నీ — తెలుగు - ఇంగ్లీషు, ఇంగ్లీషు-తెలుగు, మిశ్రభాషా నిఘంటువు, జిల్లా డిక్షనరీ — వరసగా అచ్చవుతాయి. జిల్లా డిక్షనరీని కొన్ని కాపీలు కొనమని ప్రభుత్వానికి అర్జీ పెట్టుకొంటే, రెవిన్యూబోర్డు పరిశీలించి ఇందులో చాలా లోపాలున్నాయని తీవ్రంగా విమర్శిస్తూ నివేదిక సమర్పిస్తుంది. దీనిమీదట ప్రభుత్వానికి బ్రౌన్ క్షమాపణ చెప్పుకోవల్సివచ్చింది కూడా. దీన్ని గురించి తన స్వీయచరిత్రలో ఇట్లా వ్రాసుకొన్నాడు: "I regretted this thing. It was the puniest of my works, and the only volume which was peevishly criticised." అయినా విల్సన్స్ 'గ్లాసరీ ఆఫ్ జుడిషల్ అండ్ రెవిన్యూ టర్మ్స్' (1855)కు ఇది కొంత ఆధారమవుతుంది.

సంస్కృతంలో కూడా కొన్ని గ్రంథాలు ప్రకటించాడు. భగవద్గీత, నల, సావిత్రి, హితోపదేశం, మాఘమహాత్మ్యం, కవితారత్నాకరం, విద్వన్మాలా తరంగణి, అమరం వగైరా వగైరా. వీటిని తెలుగులిపిలోనే ముద్రించాడు. బెంగాల్‌లో సంస్కృతం (దేవనాగరిలిపి)లో ప్రకటింపబడిన బైబిల్ సంబంధమైన 'బుక్ ఆఫ్ సాల్మ్స్', 'ప్రావెర్బ్స్ ఆఫ్ సాల్మన్'ను తెలుగులిపిలో ముద్రించాడు. సంస్కృత శ్లోకాల్లో ప్రకటింపబడిన 'లైఫ్ ఆఫ్ సెయింట్ పాల్'ను కూడా తెలుగులిపిలోనే ప్రకటించాడు.

1852 మార్చి 29 న బ్రౌన్‌కు ఫస్ట్ క్లాస్ సివిల్ సర్వెంట్ హోదా (ప్రమోషన్) వచ్చినట్లు గెజిట్ ప్రకటన.

పక్షవాతం : నీలగిరి నివాసం

మొత్తంమీద బ్రౌన్‌ది గట్టి ఆరోగ్యమే. నలభైయ్యేయేటి దాకా అట్టే రోగాలు రొష్టులు ఎరగడు. 1845 ఆగస్టులో ఒకసారి పెద్ద జబ్బు చేసింది. 1848 జనవరిలో కలరాలాంటి వాంతిబేదుల వ్యాధి సోకింది. డిసెంబర్లో మళ్ళీ పెద్దజబ్బున పడ్డాడు.

1849 ఏప్రిల్‌లో గుర్రంమీదనుంచి కిందపడి తొంటి ఎముక, కుడిపొటనవేలు విరగ్గొట్టు కొన్నాడు. మే 9 న కలరా. 1851 నవంబరు 26 న మళ్ళీ మరోసారి.

1853 ఏప్రిల్ 16 న బ్రెయిన్ ఫీవర్ (పక్షవాతం) వచ్చింది. దీర్ఘకాలం సెలవుపెట్టి, సంవత్సరం ఆఖరుదాకా మెడికల్ లీవు తీసుకొన్నాడు. నీలగిరి కొండలకు వెళ్ళ మన్నారు డాక్టర్లు. వెళ్ళాడు. ఒక మిషనరీల ఇంట్లో వున్నాడు. వాళ్ళ బ్రౌన్‌ను బాగా దయతో చూశారు. ఆరోగ్యం కొంచం కుదుటపడ్డది. వ్రాతకోతలు పనికిరావన్నారు డాక్టర్లు. 1854 ఫిబ్రవరి 21 న ఒకరకమైన అజీర్ణవ్యాధి వచ్చింది. ఇంతటితో ఆఖరు అనుకొన్నారు. తట్టుకొన్నాడు. నయమైన తర్వాత బెంగుళూరు, శ్రీరంగపట్నం, మైసూరు వెళ్ళి చూచొచ్చాడు. నీలగిరిలో వున్నప్పుడు రెవరెండ్ బెర్నార్డ్ ష్క్రేప్‌తో స్నేహం కల్గింది. ఆయన లోగడ కొన్ని తమిళ పుస్తకాలు చిన్నచిన్నవి అచ్చువేశాడు. సెయింట్ తామస్ ఏ కెంపిస్ జీవితాన్ని తమిళంలో ప్రకటించాడు. వీటిని మళ్ళీ పునర్ముద్రించాలని తంటాలుపడుతుంటే 650 రూపాయలిచ్చి మూడేసివేల కాపీల చొప్పున వీటిని ముద్రింపజేశాడు. ఇంత జబ్బుపడ్డప్పుడు కూడా పెండ్లాం బిడ్డల ప్రస్తావన రాలేదు కాబట్టి బ్రౌన్ బ్రహ్మచారే ననుకోవాలి. పెళ్ళి చేసుకొని వుంటే, ఆయన తెలుగుకి ఇంతచేసి వుండేవాడు కాదేమో. (యవ్వనంలో వున్నప్పుడు తెలుగు పడుచులతో లైంగిక సంబంధాలున్నాయా అనే అనుమానానికి ఆస్కారం కలిగించే జాబులు ఒకటీ అరా కనపడ్తున్నాయి కానీ నిర్ధారణగా చెప్పడానికి వీలుకావడంలేదు.)

రానురాను సాత్వికమార్గంలో సాధుజీవితంలో పడిపోతూ వచ్చాడు. ఒక దశలో కొన్ని రోజులు మంచినీళ్ళు తప్ప మరేమీ తీసుకొనేవాడు కాదట. బహుశా ఇందువల్లనే కావచ్చు కంటిచూపును కాపాడుకొంటూ వచ్చాడు. నలభై య్యో యేట దూరపు చూపు కొస్త తగ్గుతున్నట్లు కన్పించేది. యాభైలో కూడా రాత్రికు చదువుకూ ఏ ఇబ్బందీ వుండేదికాదు. చిన్నక్షరాలు కూడా సులోచనాలు లేకుండా చదివేవాడు. ఒక కంటి డాక్టరు దూరపు చూపుకుమాత్రం కళ్ళద్దాలు తగిలించాడు.

### పదవీ విరమణ : తెలుగు దేశానికి 'గుడ్ బై'

1854 మే 1 తేదీనుంచి పదవీ విరమణకు పెన్షన్ ఏర్పాటుతో 1853 డిసెంబర్ 25 న రిటైర్మెంట్‌కు వుత్తర్వు తీసుకొంటాడు. ఏడాదికి £ 920 పౌండ్ల పించన్. తన సోదరీమణులిద్దరూ ఇంగ్లాండ్ వచ్చేయమని జాబులు వ్రాస్తూ వచ్చారు. ఇంగ్లాండ్‌కు

పెట్టే బేడా సర్దుకోవడం ప్రారంభించాడు. యూరోపియన్ సారస్వత గ్రంథాలు దాదాపు 5 వేల సంపుటాలను అమ్మకానికి పెట్టాడు. అయితే మద్రాసులో ఇంగ్లీషు, ఫ్రెంచి, ల్యాటిన్ పుస్తకాల నెవరుకొంటారు? మందు కింద చూచేవారే అంతా. ముఖ్యంగా సీరియస్ పుస్తకాలు సగటున షిల్లింగ్‌కు తక్కువకే పోయాయట.

తాను లోగడ ప్రింట్ చేసిన పుస్తకాలను టోకున కొనమని ప్రభుత్వానికి వ్రాసుకొంటే, వారు వంద రెండువందల కాపీల చొప్పున మొత్తం 5 వేల రూపాయలకు కాబోలు కొన్నారు. హిబ్రూ, గ్రీక్, ఇంకా వివిధభాషల్లోగల బైబిల్ గ్రంథాలు, తత్సంబంధమైన వాటిని మాత్రం బైబిల్ సొసైటీకి బహూకరించాడు.

ఈ విశ్రాంతి దశలో తన బైబిల్ తెలుగు తర్జుమా మొత్తాన్ని రివైజ్ చేయనారంభించాడు. మెరుగులు దిద్దుతూ వచ్చాడు. లండన్‌కు తీసుకెళ్ళి అక్కడి బైబిల్ సొసైటీకి మొత్తం బైబిల్‌కు తానుచేసిన తెలుగు తర్జుమా వ్రాతప్రతిని బహూకరించినట్లున్నాడు. 1854 లో, మిత్రుల కోరికపై ఇండియా వదిలివెళ్ళే ముందు తన స్వీయచరిత్రను చిత్తుగా వ్రాసి కొందరికి చూపించినట్లున్నాడు. ఈ వ్రాతప్రతే లండన్ పాతపుస్తకాల షాపునుంచి మిన్నెసోటా లైబ్రరీ చేరుకొని భద్రంగా వున్నది.

1855 మే - జూన్‌లో - సిపాయిల తిరుగుబాటుకు ముందుగానే - ఇండియాకు 'గుడ్‌బై' చెప్పి లండన్‌కు తరలివెళ్లాడు ఇక తిరిగి మళ్ళీ రావడమనేది లేకుండా. లండన్ వెళ్ళే ముందు, తన తెలుగు గ్రామర్ రెండో ఎడిషన్ ముద్రణ జరుగుతున్నది. ఆఖరు పేజీలు గబగబా వ్రాసేసి ప్రెస్‌కిచ్చి, లండన్ వెళ్ళిన తర్వాత పీఠిక పంపిస్తానని చెప్పినట్లున్నాడు.

## 1855 - 1884 డిసెంబర్ 12

1817 నుంచి 1834 దాకా 17 ఏళ్ళు, మళ్ళీ 1838 నుంచి 55 దాకా మరో 17, మొత్తం 34 ఏళ్ళు ఇండియాలో ఒక సివిల్ ఉద్యోగిగా, సామ్రాజ్యతత్వ - వలసతత్వ ప్రతినిధిగా తెలుగు వాళ్ళమధ్య బ్రతికి, తెలుగు సాహిత్యాధ్యయనానికి ఉద్ధరణకు తన జీవశక్తులన్నిట్నీ ఖర్చుపెట్టి తెలుగు సంస్కృతినీ తెలుగుభారతినీ తన రక్తంలో జీర్ణింపజేసుకొని, తన తత్వంలో ఒక ప్రధాన భాగంగా చేసుకొన్న బ్రౌన్, తెలుగు వాళ్ళపై ఒక 'లివింగ్ అథారిటీ'గా లండన్‌లో కాలుబెట్టాడు. కీల్డార్ గార్డెన్స్ (kildare gardens) లో నివాసం ఏర్పరచుకొన్నాడు. మూడునాలుగేళ్ళపాటు బాగా

విశ్రాంతి తీసుకొన్నాడు. సింహావలోకనం చేసుకొన్నాడు. ఆరోగ్యాన్ని బాగుచేసుకొన్నాడు. ఆ వేడి తగ్గింది. సంయమనం హెచ్చింది. మెదడు చల్లబడింది. ఉడిగిన శక్తుల్ని చిక్కబట్టుకొన్నాడు. లండన్ మహానగరంలో తన 'లెవల్' ఏమిటో, తన ఉనికికి అర్థం ఏమిటో నెమ్మదిగా తెల్సుకొన్నాడు.

ఈ విశ్రాంతి సమయంలోనే — ఇండియాలో సిపాయిల తిరుగుబాటు కెరటం లేవబోతున్న సమయంలోనే—బ్రౌన్ అక్కడ లండన్‌లో కూర్చొని 1857 ప్రథమ పాదంలో తన రెండవ ఎడిషన్ తెలుగు గ్రామర్‌కు పీఠిక వ్రాయించి అచ్చు వేయించి పార్సెల్ కట్టి మద్రాసు ప్రెస్‌కు పంపాడు. వాళ్ళకు ఆ పార్సెల్ చేరలేదు. మధ్యలో ఎట్లాగో పోయింది. మళ్ళీ కాస్త మెరుగులు దిద్ది మళ్ళీ ప్రింట్ చేయించి పంపాడు. (అప్పటికింకా చిన్నయసూరి బాలవ్యాకరణం రాలేదు.) ఆ పీఠికలో ఇట్లా వ్రాశాడు: "Unless we read their books, and have daily communications with the Hindus, what insight can we obtain into the minds of the people? we have no intercourse with them in society: we live among them, as oil upon water, without mingling... Some have severely judged the Hindus from the stories contained in Sanscrit poems; but these are obsolete, and widely different from modern traits of character. In like manner the prejudices of Hindus regarding ourselves, can only be removed by a course of English reading..."

1863 లో 'కర్నాటిక్ క్రానాలజీ' ప్రచురించాడు. లండన్ యూనివర్సిటీలో తెలుగు ప్రొఫెసర్‌గా ఏ సంవత్సరం చేరాడో కానీ, మొత్తానికి అయ్యాడు. బహుశా 1860-65 మధ్య కావచ్చు. ఇండియన్ సివిల్ సర్వీసుకు 'కాంపిటీటివ్ పరీక్షలు' ప్రవేశపెట్టినప్పుడు తెలుగు పరీక్షాధికారిగా వుండమన్నారుగానీ 1869 లో గానీ ఆ పదవి చేపట్టలేదు.

1866 లో తన స్వీయచరిత్రను ప్రింట్‌చేసి మిత్రులకు పంపాడు. '72 లో మళ్ళీ దీన్ని కొంచెం పెంచి రివైజ్‌చేసి private circulation కోసం మళ్ళీ ముద్రించాడు.

1866 లో 'చితల్' అనే పదం, ఆ పదోత్పత్తిపై అనుమానం వచ్చి ఒకాయన బ్రౌన్‌కు జాబువ్రాశాడు. వివరిస్తూ ఆయనకు జవాబు వ్రాశాడు. బ్రౌన్ జవాబు లండన్ JRAS (జర్నల్ ఆఫ్ రాయల్ ఏషియాటిక్ సొసైటీ, 1866)లో అచ్చయింది. 68 లో గోల్డ్ స్టకర్ సంస్కృత 'నలోదయ'లో ఒక శ్లోకానికి అర్థం అడిగాడు. చెప్పి పంపాడు.

రోజూ కావాల్సినంత తీరిక. తీరిగ్గా తన డిక్షనరీలను (ఇంటర్లీవ్ చేసిన కాపీలను) తిరగేస్తూ వచ్చాడు. తోచిన మార్పులు చేర్పులు చేస్తూ పోయాడు. తప్పులు దొర్లా యనుకొన్న చోట మారుస్తూ పోయాడు. ఈ చేర్పులు మార్పులు అనంతంగా పెరుగుతూ వచ్చాయి. ఇట్లాగే గ్రామర్‌ను కూడా మళ్ళీ రివైజ్ చేశాడు. 1868 నాటికి గ్రామర్ రివైజ్డ్ ప్రతి తయారయింది. (ఇప్పటికి చిన్నయసూరి గ్రామర్ వచ్చింది. బ్రౌన్ దాన్ని చూచి వుంటాడా?)

ఈ దశలో ఇండియాలోనూ తెలుగుదేశంలోనూ బహుముఖ్యమైన మార్పులు జరిగాయి. తెలుగుకావ్యాలు అవీ ముమ్మరంగా అచ్చు జరుగుతున్నాయి. ఈ అచ్చయినవాటిని కొందరు బ్రౌన్‌కు లండన్ అడ్రసుకు బహూకరిస్తూ వచ్చారు. మద్రాసు ఇంజనీరింగ్ కాలేజి తెలుగు మున్షీ మద్దాలి లక్ష్మీనరసయ్య ప్రచురించిన తెలుగు గ్రామర్‌ను బ్రౌన్‌కు పంపాడు. ఇది వట్టి దగుల్బాజీ వ్యాకరణమని చెడదిడుతూ దానిపైన వ్రాసిపెట్టాడు. 1873 లో A. H. Arden ప్రకటించిన తెలుగు గ్రామర్‌ను అభిప్రాయార్థం బ్రౌన్‌కు ఒక కాపీ పంపాడు. ఏ జవాబూ రాలేదు. మళ్ళీ రిమైండర్ జాబు వ్రాశాడు. మర్యాద కోసం ఏదో నాలుగు ముక్కలు వ్రాశాడుగానీ ఆర్డెన్ భావధోరణి గురించి కూడా విమర్శిస్తూ వ్రాసిపెట్టుకున్నాడు. M. W. Carr కొత్తగా ప్రకటించిన తెలుగు సామెతల పుస్తకాన్ని పంపినట్లున్నాడు. దానిమీద కూడా చాలా చాలా వ్రాసిపెట్టాడు. తన డిక్షనరీలో ఇచ్చిన సామెతల్ని ఇందులో చేర్చలేదని వ్రాసుకొన్నాడు ఇందులో లేని సామెతల్ని ఒక పెద్ద లిస్టుగా వ్రాసిపెట్టాడు. 1855 లో వచ్చిన గ్లాసరీ ఆఫ్ జుడీషియల్ అండ్ రెవిన్యూ టర్మ్స్‌కు చేర్పులు చేరుస్తూ వచ్చాడు కొంతమేరం.

తాను లోగడ మద్రాసు సదర్ అదాలత్ కోర్టు రిజిస్ట్రార్‌గాను తెలుగు ట్రాన్స్‌లేటర్‌గాను వున్నప్పుడు — కడప 1839 ఫస్ట్ సెషన్స్‌లో జరిగిన ఒక కేసు (క్యాలెండరు నెం. 22) తీర్పును 1839 ఆగస్టు 5 న ఫౌజ్‌దారీ అదాలత్ కోర్టుకు పంపిన ఫైలు (వెంకటసుబ్బమ్మ అనే ఆమెను ఒక 'మంత్రగాడు' తన ఇంట్లో చంపివేసి ఆమె శవాన్ని ఏదో మంత్ర తంత్ర శక్తులకోసం వినియోగించాలనుకొన్నాడు. ఆ శవాన్ని దరిమిలా ఒక దేవళంలో వ్రేలాడదీస్తాడు— ఇదీ ఆ కేసు)లోనుంచి మంత్రతంత్రా లను బ్రౌన్ ఇంగ్లీషులోకి తర్జుమాచేసిన భాగాలను Telugu Spells అనే పేరుతో MJLS (మద్రాసు జర్నల్ ఆఫ్ లిటరేచర్ అండ్ సైన్స్—1864 జూలై, నెం. 1, III సీరిస్)లో ప్రకటిస్తారు. లోగడ 1840 లో Essay on the Creed and

Customs of Jangams అనే పేరుతో MJLS లో ప్రకటించిన వ్యాసాన్ని సమూలంగా మార్చి కొత్త మెటీరియల్ చేర్చి మళ్ళీ అదే పేరుతో ఒక చిన్న వ్యాసాన్ని 1871 లండన్ JRAS లో ప్రకటించాడు. అదే సంచికలో on Malabar, Coromandel, Quilon అనే పేరుతో ఆ యా పదాల పుట్టుకనుగూర్చి చర్చిస్తూ వ్రాసిన వ్యాసంకూడా అచ్చయింది.

మిరియమ్ బి.... అనే 16 ఏళ్ళ అమ్మాయికి సంస్కృతం, బెంగాలీ నేర్పుతాడు. గోల్డ్ స్టకర్ కోర్కెపై సంస్కృత ఛందస్సుపై లోగడ వ్రాసిన పుస్తకాన్ని రివైజ్‌చేసి మళ్ళీ 1869 లో ప్రకటించాడు. (The experience of Nicholas in verse అనే గ్రంథాన్ని ఎటిట్‌చేసి 1859 లో ప్రకటించినట్లున్నది.)

ఇండియాలో సిపాయిల తిరుగుబాటు లండన్ పెద్దల్లో పెద్ద కలవరాన్నే కల్గిస్తుంది. లండన్ సామ్రాజ్య తత్వవేత్తలకు కనువిప్పు కల్గుతుంది. చక్రం అడ్డువేసి, మసిబూసి మారేడుకాయ చేసి, మరింత నట్లు బిగించి ఒక నూత్న రాజ్యవ్యవస్థను కుదురుగ్గా ఏర్పరుస్తారు. ఇండియా ఏమవుతుంది? అనే విషయంపై కొన్నేళ్ళపాటు లండన్‌లో చర్చలు పరంపరగా సాగుతుంటాయి. ఈ పరంపరలో బ్రౌన్ 'చర్చోప న్యాసం' కూడా ఒకటి. 'హిందూదేశం - నేటి పరిస్థితి' అనే విషయం గురించి బ్రౌన్ extension lectures పలుచోట్ల ఇస్తాడు.

చరమశాసనం

వృద్ధాప్యం ముంచుకొస్తుంది. శక్తి ఉడిగిపోజొచ్చింది. సూర్యుడు పడమటి కొండల్లోకి వాలిపోతున్నాడు. 1884 నవంబరు 3 న వీలునామా వ్రాశాడు — తన మరణం తర్వాత ఏమేమి జరగాల్నో అంతా విభజనగా వ్రాశాడు. ఇందులో కూడా తన పుస్తకాలు, వ్రాతప్రతుల గొడవే. తెలుగు సంస్కృత తదితర ఓరియంటల్ గ్రంథాలు, వ్రాతప్రతు లన్నిట్నీ ఇండియా ఆఫీస్ లైబ్రరీకి దఖలుపరుస్తూ వ్రాశాడు. వీటిని తమ లైబ్రరీలోకి తరలించుకొని పోడానికి ఖర్చులక్రింద 10 పౌన్లు కూడా వ్రాశాడు. 24 ఏళ్ళుగా తనకు సేవజేసిన సేవకురాలు సారా నాట్ (Sarah Nott)కు 250 పౌన్లు, ఇంటి సామాన్లు, ఫర్నిచర్, మరికొన్ని సామాన్లు మరో 25 పౌన్లు మరో సర్వెంట్ ఎమ్మా అగెర్ (Emma Ager)కు; యాన్ హెన్రిటా షెర్మన్ (Ann Henrietta Shearman) అనే ఆమెకు 200 పౌన్లు; ఆమె సోదరి అగ్నెస్ లెయింగ్ (Agnes

Laing)కు 100 పౌన్లు; ఎనిమిదేళ్ళుగా రోజూ గెస్టుగా వచ్చే మిగ్స్ మెటిల్డా కాస్ట్లీ (Migs Matilda Costley) అనే ఆమెకు 50 గిన్నీలు; ఇంకా ఏవైనా మిగిలుంటే అవన్నీ షెర్మన్ - లెయింగ్‌లకూ చెందాలని వ్రాశాడు. తనకు రావల్సిన బాకీలేవైనా వుంటే అవి చెల్లించ నవసరంలేదన్నాడు. హైడ్‌పార్క్ దగ్గర 23, గ్రావెన్ హిల్ గార్డెన్స్‌లో కాపురముంటున్న మిసెస్ లూసీ క్టాగ్ (?) (జార్జి క్టాఫ్ భార్య), ఎడింబరోలోని గ్రాస్‌వెనార్ స్ట్రీట్‌లో వుంటున్న తన మేనల్లుడు రెవరెండ్ జార్జి జేమ్సు కాలీ బ్రౌన్‌లను ఎక్సిక్యూట్రెస్, ఎక్సిక్యూటర్‌లగానూ, ట్రస్టీలగానూ నియమించాడు. ఇందుగ్గాను వారికి అయ్యే ఖర్చులేమైనా వుంటే ఆ ఖర్చులక్రింద 70 పౌన్లు వ్రాశాడు. తన మేనల్లుడు కాలీ బ్రౌన్‌కు మాత్రం తన లైబ్రరీలోనుంచి అతని కిష్టమైన నూరు పుస్తకాలు తీసుకోవచ్చుననీ, మిగతావన్నీ ఇండియా ఆఫీస్ లైబ్రరీకి చెందాలనీ వ్రాశాడు. ఈ వీలునామా ప్రకారం బ్రౌన్ పుస్తకాలన్నీ 1885 మార్చి 3 న ఇండియా ఆఫీస్ లైబ్రరీకి తరలిస్తారు.

ఇంకొన్ని నెలల్లో మరణిస్తాడనగా బ్రౌన్‌ను లండన్‌లో కల్సినప్పుడు - పుస్తకాల ముద్రణకు వగైరాలకు తాను ఖర్చుపెట్టిన దాంట్లో తన చేతికి వచ్చింది 15 వ వంతు మాత్రమేననీ చెప్పినట్లు లండన్ ఎతీనియమ్ పత్రికలో 1885 జనవరి 3 న ఆర్. ఎమ్. మగ్డానల్డ్ వ్రాశాడు. 1884 డిసెంబర్ 20 న 'లండన్ టైమ్స్' పత్రికలో వచ్చిన ఆబిచువరీ నోట్‌లో ప్రత్యేకంగా ఏమీలేదు. JRAS (1885) లో వచ్చిన నోట్‌ను బట్టి చూస్తే, కొంతకాలం ఆ సొసైటీ కౌన్సిల్ సభ్యుడుగా వుంటూ, ఆరోగ్యం బాగున్నంతకాలం సొసైటీ సమావేశాలు, చర్చల్లో బ్రౌన్ పాల్గొంటూ వచ్చాడు.

1884 డిసెంబర్ 12 న తన ఎనభైయేడవ యేట "కారణజన్ముడు, తెలుగు సూర్యుడు" అస్తమించాడు. బ్రౌన్ కన్నుమూశాడు.

# బిబ్లియాగ్రఫీ

ప్రభుత్వ రికార్డులు, వ్రాతప్రతులు, అముద్రితాలు:
పత్రికలు, ప్రత్యేక సంచికలు: ముద్రిత గ్రంథాలు:
వ్యక్తులతో సంభాషణలు.

## ప్రభుత్వ రికార్డులు, వ్రాతప్రతులు, అముద్రితాలు

### ప్రభుత్వ రికార్డులు :

లండన్ : బ్రిటీష్ గవర్నమెంట్ (జనరల్ రిజిస్టర్ ఆఫీస్). 1976 ఫిబ్రవరి 24 న పంపిన బ్రౌన్ డెత్ సర్టిఫికేట్ [ఫోటో కాపీ].

—బ్రౌన్ వీలునామా [1884 నవంబర్ 3 నాటిది. టైప్డు కాపీ].

మద్రాసు : తమిళనాడు ఆర్కైవ్స్‌లో ఎన్ని రికార్డులు, ఒరిజనల్ ఫైల్స్ గుట్టలున్నాయో వర్గీకరించి చెప్పడం కష్టం. ఇది స్థూలవర్గీకరణ మాత్రమే:

—పబ్లిక్ (డిపార్ట్‌మెంట్) కన్సల్టేషన్లు 1809 నుంచి 1857 దాకా.

—జుడీషియల్ (డిపార్ట్‌మెంట్) కన్సల్టేషన్లు 1820 నుంచి 1845 దాకా.

—జుడీషియల్ డిశ్పాచెస్ టు ఇంగ్లండ్ 1833 నుంచి 1835 దాకా.

హైద్రాబాదు : ఆంధ్రప్రదేశ్ స్టేట్ ఆర్కైవ్స్. డిస్ట్రిక్ట్ రికార్డ్స్ ఆఫ్ గోదావరి (1770_1835), డిస్ట్రిక్ట్ రికార్డ్స్ ఆఫ్ గుంటూర్ (1795_1835).

[పై రెండు ఆర్కైవ్స్‌లలోనూ బ్రౌన్‌కు, బ్రౌన్ పరిపాలనా కాలానికి సంబంధించి చూడవల్సిన చూడతగిన రికార్డులు ఇంకా వున్నాయి.]

### వ్రాత ప్రతులు, అముద్రితాలు :

మిన్నెసోటా (అమెరికా) : ఏమ్స్ లైబ్రరీలో భద్రపరచబడివున్న బ్రౌన్ "స్వీయ చరిత్ర" ఒరిజనల్ లిఖితప్రతి. Narrative of the Literary

Life of Charles Philip Brown, late of the Madras Civil Service (1854).

మద్రాసు : గవర్న మెంట్ ఓరియంటల్ మేనుస్క్రిప్ట్స్ లైబ్రరీ (మ.ఓ.మే.లై.)లో బ్రౌన్ సేకరించి పెట్టిపోయిన వేలాది వ్రాతప్రతులు చూడాలంటే ఒక జీవితకాలం పట్టవచ్చు. నేను ముఖ్యంగా చూచినవి : బ్రౌన్ జాబులు, అర్జీలు ఎమ్. 401, ఎమ్. 407-14, ఎమ్. 417-432.

—డిక్షనరీ నోట్స్ సంపుటాలు డి. 1385, 1391 (9 సంపుటాలు), 1392 (4), 1393 (2), 1394 (2), 1395 (1), 3140-44, 3156.

—తెలుగు కావ్య సేకరణల్లో ఈ గ్రంథంలో ఎన్నుకొన్న ఇతివృత్తానికి సంబంధించిన సంపుటాలు.

విజయవాడ : దిగవల్లి వెంకటశివరావుగారు Notes on C. P. Brown అనే పేరుతో (బంగోరె కోసం) వ్రాసిపెట్టుకున్న చిత్తు వ్రాతప్రతి.

తిరుపతి : కుమారి (డాక్టర్) టి. ఉషారాణి శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయానికి తెలుగు నిఘంటువుల పైన సమర్పించిన పిహెచ్.డి. తీసిస్ (1975).

## పత్రికలు, ప్రత్యేక సంచికలు

పత్రికలు :

మద్రాసు : ఫోర్ట్ సెంట్ జార్జి గెజెట్ (ఇంగ్లీషు...1832 నుంచి 1855 దాకా).
వర్తమాన తరంగిణి, వారపత్రిక (1842-43).
సుజనరంజని, మాసపత్రిక (1865 జూన్ – 1866 జనవరి).
ఆంధ్రపత్రిక, దినపత్రిక (1944).

రాజమండ్రి : సరస్వతి, మాసపత్రిక (1923-24) - (కొంతకాలం కాకినాడనుంచి కూడా వచ్చింది.ఎడిటర్ పోలవరం జమీందార్ కె.ఆర్.వి.కృష్ణారావు).

విజయవాడ : ఆంధ్రజ్యోతి, దినపత్రిక (1972).
స్వాతి, మాసపత్రిక (1976 నుంచి నేటిదాకా).

గుంటూరు : ప్రతిభ (గిడుగు స్మారక సంచిక, సంపుటి 4, తేదీ లేదు).

నెల్లూరు : జమీన్ రైతు (1972), యూత్ కాంగ్రెస్ (1974-5) వారపత్రికలు.

Bombay: Journal of the Bombay Historical Society (Nov. 1941).

Madras: Madras Journal of Literature and Science (1839-65).

London: Asiatic Journal (1816-74).
Journal of Royal Asiatic Society (1834-85).
The Athenaeum (1885, Jan. 3).
The Times (1884, Dec. 20).

New Haven (U. S. A.): Journal of American Oriental Studies (1930).

Rajahmundry: Journal of the Andhra Historical Research Society (1932, Vol. XI, Parts 1 & 2).

ప్రత్యేక సంచికలు :

Delhi: Narla Shastyabdapurti publication: Studies in the History of Telugu Journalism (1968).

Madras: Sri V. Venkateswara Sastrulu Commomeration Volume (1941).

ముద్రిత గ్రంథాలు

ఇంగ్లీషు

A Father of the Mill Hill St. Joseph's Society.—History of the Telugu Christians, Trichinopoly, 1910 (a translation from French letters).

[A missionary ?]—A Manual of Telugu grammar and phonetics, Madras, 1918.

Andrinov, M.—Materials for a Bibliography of Dravidian Linguistics, Kula lumpur, 1966.

Arden, A. H.—A Companion to Telugu Reader..., Madras, 1872.
—Progressive grammar of Telugu, Madras, 1870.

Agesthialingam, S. & Sakthivel, S.—A Bibliography of Dravidian Linguistics, Annamalainagar, 1974.

Barnett, L. D.—A Catalogue of the Telugu Books in the Library of British Museum, London, 1912.

Brown, C. P.—ఆంధ్ర గీర్వాణ ఛందము. The prosody of the Telugu and Sanscrit Languages explained, Madras, 1827 (now under reprint by the S. V. University, Tirupati).

—వేమన పద్యములు. The Verses of Vemana, moral, religious and satirical. translated...with the original text, Madras, 1829.

—[an enlarged edition], Hyderabad, 1967.

—The Telugu Reader, being a series of letters...with an English translation, notes explaining the grammar and a little lexicon. 3 pts., Madras, 1852.

—వాక్యావళి. Vakyavali, or Exercises in Idioms, English, and Telugu... (translated... from J. D. Pearson's Bakyabolee, an Anglo-Bengali manual...), Madras, 1852 (second edition).

—Memoirs of Hyder Ali and Tippoo Sultan (translated from a Marata manuscript), Madras, 1849.

—A Grammar of the Telugu Language (second edition), Madras, 1857. (first edition 1840.)

—Cyclic tables of Hindu Mahomedan Chronology..., Madras, 1850.

—An Ephemeris 1750–1850..., Madras, 1850.

—Carnatic Chronology, London, 1863.

—Dialogues in Telugu and English, with a grammatical analysis...Madras, 1853. (second ed.)

—తాతాచారి కథలు. Popular Telugu Tales by Tatachari., translated into English...2 pts., Madras, 1855.

—The wars of the Rajas, being the history of Anantapuram. written in Telugu; translated into English...2 pts., Madras, 1853.

—బ్రౌణ్య తెలుగు నిఘంటు. A Dictionary, Telugu and English..., Madras, 1852; బ్రౌణ్య మిశ్రభాషా నిఘంటు...1854.

—New edition, thoroughly revised and brought up to date...by M. Venkata Ratnam...W. H. Campbell...and K. Veeresalingam Pantulu Garu...second edition, Madras, 1903.

—Third edition (a mere reprint of the original 1852–54 edition), Hyderabad, 1966.

—బ్రౌణ్య ఇంగ్లీషు నిఘంటు. A Dictionary, English and Telugu..., Madras, 1852.

—Second edition (revised and enlarged by M. Venkata Ratnam), Madras, 1895.

—Third edition (a mere reprint...), Hyderabad, 1974.

—The Zilla Dictionary...1852.

—మిరాసివాదము. Disputations on Village Business (An account of litigation from 1750–77 over the rights to the office of Karnikam, etc., in Rameswaram,...Cuddapah Dist.) The original Telugu record...translated into English. 2 pts., Madras, 1855.

—Sanscrit Prosody and numerical symbols explained, London, 1869.

—Some Account of the Literary Life of Charles Philip Brown (not printed for publication), London, 1866.

—Revised edition. Literary Life of...(not published), London, 1872.

—Sumati Satakam in the Telugu original with English rendering (ed. Sarma, C. R.), Hyderabad, 1973.

[Brown, David.]—Memorial Sketches of the Rev. David Brown with a selection of his Sermons preached at Calcutta, London, 1816.

[Bown, William].—A Grammar of the Gentoo Language...,Madras, 1817.

—A Vocabulary of the Gentoo Language..., Madras, 1818, —[reprint, 1953.]

Buchanan, Claudius.—Christian Researches in Asia, London, 1812.

Caldwell, Robert (Bishop). — Reminiscences of Bishop Caldwell, edited by his son-in-law Rev. J. L. Wyatt, Madras, 1894.

Campbell, A. D. — A Grammar of the Teloogoo Language, Madras, 1816.

—A Dictionary of the Teloogoo Language, Madras, 1821,

Carey, William. — The Telinga Grammar, Serampore, 1814.

Carr, M. W. — ఆంధ్ర లోకోక్తి చంద్రిక. A Collection of Telugu Proverbs (in the original text, alphabetically arranged) translated, illustrated, and explained; together with some Sanscrit Proverbs. Printed in the Devanagari and Telugu characters. (A supplement...containing additional proverbs, an index verborum, and an index to the European proverbs quoted in illustration.) 2 pts., Madras, 1868. [సి. పి. బ్రౌన్‌చేత printing is masterly...అని కొనియాడబడిన గ్రంథం.]

[Halle missionaries]. — The Symphona Symphona sive Undecim Lingvaram Orientalism..., Halle, 1782.

Harkness, Capt. Henry. — Ancient and Modern Alphabets of the Popular Hindu Languages of the Southern Peninsula of India, London, 1837.

Kaye, G, R. — European Manuscripts in the India Office Library, Vol. II, Part II, Minor Collections and Miscellaneous Manuscripts. Section 1, London, 1937.

Kopf, David. — British Orientalism and the Bengal Renaissance : the dynamics of Indian modernization 1773-1835, California, 1969.

Krishnamurthi, Bh., & Sivanandasarma, P. — A Basic Course in Modern Telugu, Hyderabad, 1968.

Lane, Major T.G.M. — A Collection of Official Documents in the Telugu Language..., Madras, 1866.

Lisker, Leigh. — An introduction to Spoken Telugu, U.S.A., 1962.

[Madras Government]. — Guide to the Records of the Nellore District 1801 to 1835, Madras, 1934.

Mangamma, J. — Book Printing in India : with Special Reference to the Contribution of European Scholars to Telugu (1746-1857), Nellore, 1975.

Morris, J. C. — Teloogoo Selections..., Madras, 1825.

—A Dictionary English and Teloogoo, Madras, 1835, 37.

Narla, V. R. — Vemana, New Delhi, 1969.

—Vemana through western eyes — (edited with notes), Madras, 1969.

Nicholas, J. — A Vocabulary of English and Teloogoo, Madras, 1832.

English Proverbs — Oxford Dictionary of English Proverbs, London, 1952.

—Macmillan Book of Proverbs, Maxims, and famous Phrases, New York, 1966.

Paul, D Rajaiah. — Triumph of His Grace, Madras, 1967.

Philips, C. H. & Wainwright, M. D. (eds.) — Indian Society and the Beginnings of Modernization 1830–1850, London, 1976.

Rajannan, Busangi. — Dravidian Languages & Literatures, Madurai, 1973.

Reddy, G. N. & Matson, Dam M. — A Basic Course in Modern Telugu (with Glossary), Wisconsin, 1966.

—Graded Readings in Newspaper Telugu (with Glossary), Wisconsin, 1967.

Schultze, Benjamin, Rev. — Conspectus Litteraturae Telugicae..., Halle (Germany), 1747.

—The Large and Renowned Town...upon the Coast of Coramandel...by way of thirty dialogues..., Halle, 1750.

Sivaramamurthi, N. — Intensive Course in Telugu, Trivandrum, 1971.

Subrahmanyam, P. S. — An Introduction to Modern Telugu, Annamalainagar, 1975.

Venkatavadhani, D. — Telugu in Thirty Days, Hyderabad, 1976.

Venkateswarasastri, J. — Telugu Phonetic Reader, Mysore, 1972.

Venkateswarasastri, J. and Krishnamurthi, N.D. — Conversational Telugu: Microwave approach, Madras, 1975.

Wilson, H. H. — Glossary of Judicial and Revenue Terms, London, 1855.

తెలుగు :

అనంతకృష్ణశర్మ, రాళ్లపల్లి — వేమన, వాల్తేరు, 1945 (ప్రథమ ముద్రణ, 1929).

ఆనందాఖ్యకవి, మంగళగిరి — వేదాంతరసాయనము, (ed. Fr. J. Aelen), నెల్లూరు, 1969.

[ఉస్మానియా యూనివర్సిటీ పండిత సంఘం] — ఆంధ్ర మహాభారతము, సంశోధిత ముద్రణము, ప్రథమ సంపుటము, హైదరాబాదు, 1968.

కోదండరామిరెడ్డి, మరుపూరు—వేమన - పాశ్చాత్యులు (సార్ల ఎడిట్ చేసిన ఆంగ్ల గ్రంథానికి ఆంధ్రానుసరణ), నెల్లూరు, 1971.

గురుమూర్తిశాస్త్రి, రావిపాటి—విక్రమార్క కథలు, మద్రాసు, 1819.

—తెలుగు వ్యాకరణము (ద్వితీయ ముద్రణ, మద్రాసు, 1951).

—పంచతంత్ర కథలు, మద్రాసు, 1834.

తెలుగు సామెతలు (అకాడమీ ఎడిషన్లు) — హైద్రాబాదు, 1959, 1966, '74. (మూడు వేర్వేరు పండిత సంఘాలు సంకలనం చేసిన మూడు ముద్రణలు).

పిచ్చయ్యశాస్త్రి, దీపాల—సాహిత్య సమీక్ష, నెల్లూరు, 1956.

బంగోరె (సంశోధన ప్రతి) — సి. పి. బ్రౌన్ సంతరించిన తాతాచార్ల కథలు, మద్రాసు, 1974.

—బ్రౌన్ జాబులు : తెలుగు జర్నలిజం చరిత్ర 1832 నుంచి 1857 దాకా, నెల్లూరు, 1973.

మనుచరిత్ర, స్వారోచిష (సవ్యాఖ్యాన ప్రతి)—బ్రౌన్ ముద్రణ, మద్రాసు, 1851; పునర్ముద్రణ, మద్రాసు, 1875.

మనుచరిత్రము (అకాడమీ ప్రతి)—పరిష్కర్త : తిమ్మావజ్ఝల కోదండరామయ్య, హైద్రాబాదు, 1966.

మనుచరిత్రము (సవ్యాఖ్యానం) — సూర్యనారాయణశాస్త్రి, వెంపరాల, విజయవాడ, 1968. [ఇందులో కొన్ని బ్రౌన్ పాఠాలను గురించిన చర్చ వుంది.]

రాధాకృష్ణశర్మ, చల్లా (C. R. Sarma)—సి. పి. బ్రౌన్ సాహితీ సేవ, హైద్రాబాదు, 1975.

వసుచరిత్రం (సప్రతిపద టీక)—బ్రౌన్ ముద్రణ, 1844.

వీరభద్రరావు, కొత్తపల్లి—తెలుగు సాహిత్యంపై ఇంగ్లీషు ప్రభావం, హైద్రాబాదు, 1960.

—సి. పి. బ్రౌన్, హైద్రాబాద్, 1963.

వెంకటరాయశాస్త్రి, వేదం (కళాప్రపూర్ణ) — ఆంధ్రభాషా సర్వస్వ నియమ కతిపయములు, మద్రాసు, 1948.

వెంకటరావు, నిడదవోలు—శ్రీ పరవస్తు చిన్నయసూరి జీవితము, మద్రాసు, 1954, (1962 లో అకాడమీవారి 'సాహిత్యోపన్యాసాలు చిన్నయసూరి' లో ని. వెం. వ్యాసం).

వెంకటశివరావు, దిగవల్లి (సం.)—ఏనుగుల వీరాస్వామయ్యగారి కాశీయాత్ర చరిత్ర, బెజవాడ, 1941.

—1857 పూర్వరంగములు, విజయవాడ, 1958.

వేంకటరమణశాస్త్రి, దువ్వూరి—రమణీయము: బాలవ్యాకరణ సమీక్ష, వాల్తేరు, 1964.

హరిశ్చంద్ర ద్విపదకావ్యమున్ను ఆయనసే చెప్పిన నవనాథ చరిత్ర ద్విపదకావ్యములో యుండేటి యొక కథయున్ను గలది (గౌరన మంత్రి) — బ్రౌన్ ముద్రణ, మద్రాసు, 1842.

హరిశ్చంద్రోపాఖ్యానం (అకాడమీ ప్రతి) — పరిష్కర్త: పి. యశోదారెడ్డి, హైద్రాబాదు.

సీతారామాచార్యులు, బహుజనపల్లి—శబ్దరత్నాకరము, మద్రాసు, 1885.

—1969 నాటి పునర్ముద్రణ.

## వ్యక్తులతో సంభాషణలు

బ్రౌన్‌ను గురించి ఒక అవగాహన ఏర్పరచుకోడానికీ, కొత్త సందేహాలను రేకెత్తించుకోడానికీ వివిధ వ్యక్తులతో సాగిన సంభాషణలూ, చర్చలూ ఎంతగానో తోడ్పడ్డాయి.

* ముఖ్యంగా నార్ల, దిగవల్లి, ఆరుద్రగార్లతో పలుసార్లు జరిపిన సంభాషణలు మెరుపుతీగల్లాగా పనిచేశాయి. వారి అభిప్రాయాలతో అప్పుడప్పుడూ ఏకీభవించలేకపోయినా కొత్త ప్రశ్నల్ని, కొత్త కోణాల్ని రెచ్చగొట్టేవి.

* కావలిలో శ్రీ కె. వి. రమణారెడ్డితో (జైలుకు పోక ముందు) ఒకసారి బ్రౌన్ డిక్షనరీ గూర్చి చర్చ వచ్చినప్పుడు హఠాత్తుగా కొత్త లోతులు స్ఫురించాయి.

* నెల్లూర్లో వేదం వెంకట్రామన్, హైద్రాబాద్‌లో డాక్టర్ చేకూరి రామారావుగార్లచేత బ్రౌన్ ఛందోగ్రంథాల్ని చదివించి వాళ్లు చెప్పే అభిప్రాయాలు వింటుంటే ఆనందంగా వుండేది.

* బండి నాగరాజుతో బ్రౌన్ తాతాచార్ల కథలపై వచ్చిన వివాదసందర్భంలో బ్రౌన్ తన డిక్షనరీలో ఇచ్చిన అర్థాల్నిబట్టి చూస్తే; యతి, ప్రాస అంటే బ్రౌన్‌కు సరియైన అవగాహన లేదేమోనని అనవలసివుంటుందని ఆయన

అన్నప్పుడు వళ్లు తగలకపోయింది. ఆ క్షణంలోనే బ్రౌన్ ఆంధ్ర గీర్వాణ ఛందోగ్రంథంకోసం వేట ప్రారంభమైంది. తపస్సు ఫలించింది. అప్పటిదాకా ఎంతో 'రేర్ బుక్' అనిపించుకొంటున్న ఆ గ్రంథం అతి స్వల్పకాలంలోనే దొరికింది. ఆ తర్వాత కలకత్తా నేషనల్ లైబ్రరీలో మరో కాపీ కనపడ్డది.

కావలిలో వి. రామకృష్ణతో మాట్లాడుతుంటే — ఇండియన్ రెనైజాన్స్ గురించి, ముఖ్యంగా బెంగాల్ రెనైజాన్స్, కలకత్తా ఫోర్ట్ విలియం కాలేజి ప్రభావం గురించి కొత్త దృక్కోణం ఒకటి తళుక్కుమన్నది. మద్రాసు ఫోర్ట్ సెంట్ జార్జి కాలేజిపై పరిశోధన సాగవల్సిన అవసరం ద్యోతకమైంది. ఈ వాతావరణంలోంచి ఆంధ్రా రెనైజాన్స్‌లో బ్రౌన్ నిర్వహించిన భూమిక ఏపాటిదో నిర్ధారణ చేయవలసిన అగత్యం కనపడ్డది.

# నా మ సూ చి

వ్యక్తుల, స్థలాల పేర్లకు మాత్రమే ఈ జాబితా. పుస్తకాలు తదితరాల పేర్లు ఇందులో చేర్చలేదు గ్రంథ విస్తరణ భీతివల్ల. ఇంగ్లీషులో ఉన్న పేర్లను తెలుగు లిపిలోనే చూపడం జరిగింది.